# అరుణతార

296

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి : 36 సంచిక : 2 జనవరి - ఫిబ్రవరి 2013 పేజీలు : 68 వెల : రు. 20/-

## విరసం
## 18వ సాహిత్య పాఠశాల
## ఆధునిక తెలుగు సాహిత్యంలో నూతన మానవ ఆవిష్కారం





# జనవరి 11, 12 తేదీల్లో హైదరాబాద్‌లో జరిగిన విరసం 18వ సాహిత్య పాఠశాల దృశ్యాలు













**సాహిత్య పాఠశాల వక్తలు, పుస్తకావిష్కర్తలు, కళాకారులు**

1వ వరుస: పిట్టి లక్ష్మి, మెట్టు రవీందర్, శివారెడ్డి, సియస్.ఆర్. ప్రసాద్, సతీష్ చందర్, రత్నమాల, సత్యలక్ష్మి, వాసిరెడ్డి నవీన్.

2వ వరుస: టంకశాల అశోక్, గుంటి రవి, ఎన్. వేణుగోపాల్, ఇంద్రవెల్లి రమేష్, యాకూబ్, హరగోపాల్, చేకూరి రామారావు.

3వ వరుస: పాణి, అల్లం నారాయణ, నాళేశ్వరం శంకరం, కాశీం, వరలక్ష్మి, ఘంటా చక్రపాణి.

4వ వరుస: వల్లూరి రుక్మిణి, రివేరా, అల్లం రాజయ్య, వరవరరావు.

5వ వరుస: అరసవెల్లి క్రిష్ణ, కాత్యాయని విద్మహే, కూర్మనాథ్, కళ్యాణరావు, చెంచయ్య.

6వ వరుస: నందిని సిద్ధారెడ్డి, విరసం కళాబృందం.

7వ వరుస: హాజరైన సాహిత్యాభిమానులు, ప్రజా కళామండలి, అరుణోదయ, దప్పు రమేష్ బృందాలు.









296 సంపుటి : 36 ◆ సంచిక : 2 ◆ జనవరి - ఫిబ్రవరి, 2013

**సంపాదకుడు**
చలసాని ప్రసాద్
వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామక్రిష్ణారావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500040
* **కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా**
రచనలు పై చిరునామాకూ,
* ఇ-మెయిల్ ద్వారా
arunatara1977@gmail.com
కూ రచనలు పంపవచ్చు

సంపాదకవర్గం :
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**

**చందాలు పంపాల్సిన చిరునామ**
మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
సెల్ : 9866021257

విరసం కార్యదర్శి చిరునామా
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
డి.టి.పి. అండ్ లే అవుట్
**ఎస్. రాజు**
కవర్ డిజైన్
సృజన గ్రాఫిక్స్
**శ్రీను**, ప్రొద్దుటూరు, కడప జిల్లా.
మూడవ కవర్ డిజైన్ **ఆర్. భాగ్యలక్ష్మి**
ఫొటోలు
**పి. పావని,**
ఇంటర్నెట్ / గూగుల్

**ఈ సంచిక వెల : రు. 20/-**

## సంపాదక రేఖ...

ఆరోపణ నిరూపణ కాకుండా, ఒక మనిషిని ఒక క్రమ ప్రకారం ఇరికించి రాజ్యం తాను అనుకున్న పద్ధతిలో, తాను అనుకున్నట్లు ఎట్లా చంపగలదో చెప్పడానికి అఫ్జల్‌గురి ఉరి ఒక బలమైన నిదర్శనం. ఒక మనిషి తన అభిప్రాయాలు మార్చుకొని తన జీవితమేదో తాను బతకాలనుకుని అనుకున్నప్పుడు కూడా రాజ్యం ఎలా వ్యవహరిస్తోందో చూపడానికి అఫ్జల్‌గురు ఒక సాక్ష్యం. ఉరిశిక్షలు అనాగరికమని ఇప్పటికే అత్యధికదేశాలు ఆ శిక్షను రద్దు చేశాయి. కానీ మనదేశ పాలకులు ఒకపక్క దేశాన్ని తమ విధానాలతో తాకట్టుపెడుతూ, దేశ సార్వభౌమాధికారాన్ని దెబ్బతీస్తూ మరోపక్క ప్రజలపై అత్యంత పాశవిక శిక్షలను అమలుచేస్తున్నారు. రాజ్యాంగం నిర్దేశించిన కఠిన శిక్షలన్నీ ఈ దేశంలో అమలవుతున్నది ముస్లింలపైన, దళితులపైన, ఆదివాసులపైన, మహిళలపైన, జాతి పోరాటాలు చేస్తున్నవారిపైన, సామాన్యులు, అత్యంత నిరుపేదలపైననే తప్ప దేశాన్ని, దేశ ప్రయోజనాలను దెబ్బతీస్తున్న వారిపైన కాదు అనేది అనేకసార్లు రుజువైపోయింది. మనుధర్మ శాస్త్ర ప్రకారంగానైతే దళితులు, స్త్రీలూ, పశువులు (మొత్తంగా అట్టడుగు వర్గాల శ్రామికులు) శిక్షించబడడానికి అర్హులు. అలాంటి మనుధర్మ జ్ఞానానికి లోబడే మనదేశంలో శిక్షలు అమలౌతున్నాయి. ఈ దేశంలో పాలకులు ప్రజలను కులాల పేరిట విభజించి, మతం (హిందూ) పేరిట ఏకీకరణ సాధించే ఎన్నికల రాజకీయాల ఎత్తుగడను ఎప్పటి నుంచో అమలు చేస్తున్నారు. అంతేకాదు కులమేదైనా, మతమేదైనా తాము మాత్రం వర్గపరమైన ఐక్యతను పాటిస్తూ, అవసరమైనవారిని కలుపుకుంటూ, ప్రజలను మాత్రం నమ్మకాల ఆధారంగా విభజించి పాలించడం కొనసాగిస్తూనే ఉన్నారు. కశ్మీరి ప్రజలు తమ స్వయం ప్రతిపత్తి కోసం, స్వేచ్ఛా ఆకాంక్ష కోసం, గత రెండు దశాబ్దాలకు పైగా చేస్తున్న పోరాటంలో ఇప్పటికే లక్షమందికి పైగా యువతీ, యువకులను కోల్పోయారు. రాజ్యం వివిధ రూపాలలో అమలుచేసే శిక్షలకు, నిర్బంధాలకు అనేకమంది తమ విలువైన జీవితాలను కోల్పోయారు.

రాబోయే ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని 'జాతి మనోభావాలను' సంతృప్తిపరచడానికి అనే పేరుతో సందర్భ సాక్ష్యం ఆధారంగా అఫ్జల్‌గురుకు పాలకవర్గాలు ఉరిశిక్షను ఖరారు చేశాయి. బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., భజరంగ్‌దళ్‌వంటి హిందూత్వ శక్తులకు తామేమీ తీసిపోమని నిరూపించుకునే క్రమంలో ఈ శిక్షను అమలుచేశారు. ఒక కశ్మీరి ముస్లిం బలయ్యాడు. అఫ్జల్‌కు ఉరిశిక్ష విధించడమే అన్యాయమైతే, అత్యంత గోప్యంగా శిక్షను అమలు చేయడంలో పాలకులను ఆవరించిన భయం, వారి దుర్మార్గ ముఖం బహిరంగంగా ఆవిష్కృతమయ్యాయి. వారి బలహీనతను, శిక్షలోని అన్యాయాన్ని చెప్పకనే చెప్పాయి. పరిణిత, ప్రజాస్వామిక (?) వ్యవస్థ జనం ఉద్వేగాలపైకాక తాను నిర్దేశించుకున్న రాజ్యాంగ సూత్రాలకు లోబడి వ్యవహరించాల్సి ఉంటుంది. ఉరి నిర్ణయాన్ని అమలుకు ముందే తెలియజేస్తే జనం నుంచి ఎదురయ్యే నిరసనను తప్పించుకోవడానికే రాజ్యం ఇలా చేయాల్సి వచ్చింది. అఫ్జల్‌గురుకుగానీ, అతని కుటుంబ సభ్యులకుగానీ ఉరిశిక్ష విషయం కనీసం తెలియజేయాల్సిన పద్ధతిలో తెలియజేయలేదు. చనిపోయిన మనిషి మృతదేహాన్నీ కుటుంబ సభ్యులకు అప్పగించలేదు. ఇలా ఎన్ని కోణాలలో చూసినా పాలకులు తమ ఎన్నికల ఎత్తుగడలలో భాగంగా, రాజకీయ క్రీడలో భాగంగా ఒక కశ్మీరి ముస్లిం ప్రాణాలను బలిగొన్నారు. కశ్మీరు నుంచి తెలంగాణదాకా, అస్సాం, మిజో, నాగాలదాకా, కళింగనగర్ నుంచి కూడంకుళందాకా ప్రజలు ఈ దుర్మార్గాన్ని తమపట్ల అమలౌతున్న అనేక దుర్మార్గాలతో పోల్చి చూసుకుంటున్నారు. కశ్మీరి జాతి ఆకాంక్షతో సహా న్యాయమైన ఆకాంక్షలతో, పోరాట వారసత్వంతో తామూ మమేకమౌతున్నారు.



# ఈ సంచికలో...



*సవరణ: 1. నవంబర్-డిసెంబర్, 2012 సంచికలో వచ్చిన 'ఎక్కడని బంధించగలరు నిన్ను' కవిత రచయిత పేరు 'మనిషితనం'గా సరిచూసుకోగలరు. 2. అలాగే స్వాతి రాసిన కవిత వరలక్ష్మి అరెస్టుకు నిరసనగా రాసినది కాదు. పొరపాటుకు చింతిస్తున్నాం. - సం.*

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!


చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.
విడి సంచిక వెల : రు. 15/-; సంవత్సర చందా: రు. 160/-; జీవితచందా : రు. 1500/-

**మేనేజర్ : ఎస్. రవికుమార్**

**5-1307, దొరసానిపల్లె రోడ్, ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360, సెల్ : 9866021257**
**email : arunatara1977@gmail.com**
**http://www.facebook.com/arunatara.virasam**

సంపాదకీయం

# కశ్మీరియత్-అఫ్జల్‌గురు

- పి. వరలక్ష్మి

ఉదయం 11.30కు ఒక తెల్లటి అంబాసిడర్ కారులో ఆయుధాలు ధరించిన అయిదురు గుర్తుతెలియని వ్యక్తులు గేటులో నుండి లోనికి దూసుకుపోడానికి ప్రయత్నించారు. రక్షణ సిబ్బంది వారిని ఆపి ప్రశ్నించగా వారు కారులో నుండి బైటికి దూకి పారిపోతూ కాల్పులు జరిపారు. ఈ హఠాత్‌సంఘటన నుండి వెంటనే తేరుకొన్న సెక్యూరిటీ సిబ్బంది ఎదురుకాల్పులు జరిపింది. కాసేపు హోరాహోరీగా అటూఇటూ కాల్పులైనాయి. కాల్పుల్లో అయిదుగురు దుండగులతోపాటు ఎనిమిది మంది సెక్యూరిటీ సిబ్బంది, ఒక సాధారణ పౌరుడు మరణించారు. కారుకు శక్తివంతమైన పేలుడు పరికరం అమర్చినట్టుగా కనుగొన్నారు. మామూలుగానైతే ఈ వార్త దేశంలో పెద్దగా చర్చనీయాంశం కాదు. ఇలాంటివేవో వార్తల్లో కనిపించడం అలవాటైపోయింది. కానీ ఇది జరిగింది పార్లమెంటు ఆవరణలో. ఆరోజు డిసెంబర్ 13, 2001. లోపల పార్లమెంటు శీతాకాల సమావేశాలు జరుగుతున్నాయి. లోపల ప్రతి క్షణం దేశ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెట్టే పనిలో తలమునకలుగా ఉన్న పార్లమెంటుపై ఎవరో బైటి నుండి దాడి చేశారు. మీడియా పెద్దపెట్టున కేకలేసి జాతిని జాగృతం చేసింది.

ఈ ఘటన లేవనెత్తిన ఎన్నో భేతాళ ప్రశ్నలకు ఈరోజుకూ సమాధానాలు లేవు. కాని నేరం జరిగింది. అదీ ఘోరమైన నేరం జరిగింది. న్యాయం జరగాలంటే బాధ్యులకు కఠినాతి కఠినమైన శిక్షలు పడాలి. పడితేగాని సమాజ సామూహిక ఆత్మ సంతృప్తి పడదు. దాడి చేసినవాళ్ళను అప్పుడే చంపేశారు. దాడివెనక ఎవరున్నది ఇప్పటికీ తెలీదు. అనుమానితులుగా పోలీసులు అరెస్టు చేసిన నలుగురు నేరం చేశారనడానికి ఏ ఆధారాలూ లేవు. పోలీసులు బలవంతంగా ఒకరిచేత చెప్పించిన ఒప్పుకోలు స్టేట్‌మెంటు తప్ప. ఆ 'దురదృష్టవంతుడి' పేరు అఫ్జల్ గురు. అతను నేరం చేశాడనడానికి కచ్చితమైన ఆధారాలు లేవు. అయితేనేం అతనొక ముస్లిం. అతనొక కాశ్మీరీ. దెబ్బతిన్న భారతదేశ అహాన్ని సంతృప్తి పరిచేలా ప్రతీకారం తీర్చుకోడానికొక వ్యక్తి దొరికాడు. ఉరిశిక్ష విధిస్తేగాని సమాజ సామూహిక ఆత్మ తృప్తిపడదంటూ ఆగస్టు 4, 2005న సుప్రీం కోర్టు అతనికి ఉరిశిక్ష విధించింది. ప్రపంచదేశాలు ఉరిశిక్ష రద్దు గురించి చర్చించుకుంటున్నప్పుడు భారతప్రభుత్వం కసబ్‌ను రహస్యంగా ఉరితీసి పూడ్చి పెట్టి మూడు నెలలు కూడా కాలేదు. అదే పద్ధతిలో అఫ్జల్‌గురును అంతే రహస్యంగా చంపి పూడ్చిపెట్టింది. అతిపెద్ద ప్రజాస్వామ్య దేశం తన సూపర్‌పవర్‌ను ఈ విధంగా చూపించింది. సరిగ్గా 1984లో తొలితరం కాశ్మీరు సాయుధ తిరుగుబాటుదారుడైన మఖ్బూల్ బట్‌ను ఉరితీసి పాతిపెట్టిన తీహార్ జైల్లోనే అఫ్జల్‌గురును కూడా పాతిపెట్టింది.

మఖ్బూల్ బట్‌ను ఉరితీసేనాటికి కశ్మీర్‌లో సాయుధ మిలిటెంట్ సంస్థల ఉనికి పెద్దగా లేదు. మఖ్బూల్ బట్ ఉరిశిక్షకు వ్యతిరేకంగా కశ్మీర్‌లో తీవ్ర నిరసన వ్యక్తమైంది. అతన్ని ఉరితీసిన ఫిబ్రవరి 11 కశ్మీర్‌లో అమరవీరుల దినమైంది. బలహీనులు, పిరికివారు అని పేరుపడ్డ కశ్మీర్ యువకులు తుపాకులు పట్టి భారతసైన్యంపై తిరగబడ్డారు. ఇక్కడొక విషయం చెప్పుకోవాలి. ఇప్పుడెట్లయితే అఫ్జల్‌గురు శవాన్ని కుటుంబసభ్యులకు అప్పగించాలని పోరాటం చేస్తున్నారో ఇరవైతొమ్మిదేళ్ళ నుండి మఖ్బూల్ బట్ శవాన్ని అతని బంధువులకు అప్పగించాలని అతన్ని పరాయి దేశంలో కాక అతను పుట్టిన నేల కశ్మీర్‌లోనే ఖననం చేసి తమ విశ్వాసాల ప్రకారం అంత్యక్రియలు జరుపుకోవాలని కశ్మీర్ ప్రజలు పోరాడుతూనే ఉన్నారు. అతని అవశేషాలను ఉంచడానికి శ్రీనగర్ ఈద్గాలో సమాధిని సిద్ధంగా ఉంచారు. ఇప్పుడు దాని పక్కనే అఫ్జల్‌గురు సమాధిని నిర్మించారు. అఫ్జల్‌గురు భారతపాలక వర్గం చేతిలో అసహాయంగా చచ్చిపోతున్న ఎంతోమంది సాధారణ కశ్మీరీ యువకుల్లాంటివాడే. కాని అతను కశ్మీరియత్‌ను మరోసారి రగిలించిన వీరుడిగా కశ్మీరీలు భావిస్తున్నారు.

కశ్మీర్‌లో పుట్టడం తప్ప అతను సాధారణ యువకుల కంటే భిన్నమైనవాడు కాదు. అందరిలానే అతనికీ భవిష్యత్తును గురించిన కలలున్నాయి. తన తండ్రి కోరుకున్నట్టుగా డాక్టర్ కావాలని ఆశపడ్డాడు. కశ్మీర్‌లోని కల్లోలం అతన్ని మామూలుగా ఉండనియ్యలేదు. కశ్మీర్ ప్రజల స్వయంనిర్ణయాధికార హక్కుపై నాలుగు దశాబ్దాల అణచివేతపై సాయుధ ప్రతిఘటన మొదలైంది. ఆ పిలుపునందుకున్నాడు అఫ్జల్. కశ్మీర్ ప్రజలను వంచించి, ప్రశ్నించే తుపాకులతో సమాధానమిచ్చే భారత ప్రభుత్వానికి ప్రజాస్వామ్యం పట్ల, అంతర్జాతీయ న్యాయసూత్రాల పట్ల ఏమాత్రం గౌరవం లేదని వాళ్ళకు అర్థమైపోయింది. తమ దేశమే సరిహద్దు కావడం, రెండు దేశాల మధ్య యుద్ధక్షేత్రం కావడం ఏ ప్రజలైనా ఎలా భరించగలరు. 1947లో కశ్మీరీల ఆకాంక్షలను ఏమాత్రం పట్టించుకోకుండా కశ్మీర్‌ను ఇండియా, పాకిస్తాన్‌లు చెరో ముక్క పంచుకొని విద్వేష రాజకీయాలు యథేచ్ఛగా పండించుకుంటున్నాయి. జమ్ము కశ్మీర్ భవితవ్యాన్ని ఆ ప్రాంత ప్రజలే నిర్ణయించాలని, అక్కడ ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణలో ప్లెబిసైట్ నిర్వహించాలని 1947 నుండి అనేక తీర్మానాలు జరిగినా అవి ఆచరణకు రాలేదు. 47 నుండి అనేకసార్లు అంతర్జాతీయ వేదికలమీదే కాదు, పార్లమెంటులోనూ దీనికి హామీ పడిన భారత ప్రభుత్వం కశ్మీర్‌కు భారత్ ఒక స్నేహితుడి లాంటిదని, కశ్మీర్ భూభాగాన్ని కలిపేసుకోవాలనే దుష్టతలంపు తనకు లేదని చెప్పింది. అదే సమయంలో అనేక దొంగదారులు వేసుకుంటూ తన 'రాజ్యాంగాన్ని' కశ్మీర్ భూభాగంలోకి విస్తరించింది. పదేళ్ళు తిరిగేలోగా కశ్మీర్ భారతదేశంలో అంతర్భాగమని చాటింది. ఈ అబద్ధాన్ని అనేక వందల సార్లు పలికింది. పలుకుతూ ఉంది. భారతదేశం ప్రజలు దాన్ని నిజమని నమ్మారు. గోబెల్స్ సిద్ధాంతం మరోసారి రుజువైంది. (ఇప్పుడు అఫ్జల్‌గురు విషయంలోనైతే మీడియా వెయ్యి మంది గోబెల్సుల కంటే శక్తివంతంగా పనిచేసింది.) అదే కశ్మీర్ ప్రజల విశ్వాసాన్ని మాత్రం శాశ్వతంగా కోల్పోయింది. మిలిటరీ కింద తప్ప కశ్మీర్‌ను పరిపాలించలేని స్థితి భారత ప్రభుత్వానిది. కశ్మీర్ ప్రజల

పాటలు / కవిత్వం

# తెలంగాణ పోరు జెండా

- పానుగంటి నాగన్న

సిరులున్న మా తల్లివీ అమ్మా
నీ తనువెల్ల బంగారమే తల్లీ

వన సంపద నీ ఒడిలో ఉన్నదమ్మా
ఖనిజ సంపద నీ కడుపులో దాగుంది
కొండ కోనలు నీవు కొప్పునముడిసినవు
పచ్చనాకుల తోట్టి అమ్మా పట్టు చీరల కట్టినావమ్మా ॥సిరు॥

పల్లె తంగిడి పూలు రవికలు తొడుగంగా
అడవి మల్లెపూలు దండలైనావమ్మా
మోదుగ పూవులు వీర తిలకం బెట్టి
రేల పూతలు నీకు ముఖున ముభెరలమ్మా ॥సిరు॥

పచ్చని అడవిలో ఎత్తైన కొండలు
చేతిలో చేవగల భూమున్నదమ్మా
ఆకుపచ్చని ఎర్రటి నేలలో
నల్లాటి బంగారు బొగ్గున్నదమ్మా ॥సిరు॥

వాగువంకలు చెరువుకుంటలమ్మ
పంట భూములకు జన్మనిచ్చినవమ్మా
సకల సంపదకు కొదువు లేదమ్మా
అన్నీ ఉన్నా తెలంగాణ నీవు ఆగమైపోతున్నవమ్మా

పారేటి గోదారి పరుగున కృష్ణమ్మ
గలగల గంగమ్మ ఇష్టంగా పారింది
జీవనదులున్న తల్లీ తెలంగాణ
తెలంగాణ ఒడిలోన తల్లి పోతుందమ్మా ॥సిరు॥

మట్టి పూవుల త్యాగాల సిరులున్న
మాగాణి భూములు మా తెలంగాణ
తోవ పూవుల పోరుబాటవమ్మా
వీరుల గన్న త్యాగాల మూర్తివి ॥సిరు॥

దండు గట్టింద్రు జెండలెత్తింద్రు
పల్లె పల్లెలు లొల్లి బెట్టింద్రు
ఎరుపు కన్నుల ఎర్రమల్లెలై
ఎత్తింద్రు తెలంగాణ పోరు జెండాలు ॥సిరు॥

# జనతన సర్కారుకు జై కొట్టరన్నా

- డి. బాలనర్సయ్య

గురిగింజ గురిమల్లెలో.. గూడాలు గుత్పలందుకున్నయో..
మరుమల్లె మాయాన్నలో మార్పు కొరకు
పోరు చేయుచున్నారో...

బామండ్ల వాడలో పుట్టిపెరిగినోడు..
పెద్దపల్లికే పేరు తెచ్చినోడు...
కరీంనగర్‌నే కదంతొక్కించి దండకారణ్యంలో
దండు నడిపినాడు...
॥గురిగింజ గురి మల్లెలో॥

అమ్మలకు అమ్మ పేదోల్లకు అమ్మా
మమ్ముగన్న తల్లీ మా మధురమ్మ...
ఉగ్గుపాలతోటి ఉయ్యాలలూపింది గోరు ముద్దలతోటి
గోటీలు ఆడించి
లాలి పాటలతోటి లడాయి నేర్పింది ...
॥గురిగింజ గురి మల్లెలో॥

---

స్వయం నిర్ణయం ఎక్కడ వ్యక్తమైనా భరించలేని పరిస్థితి. తానే నిర్వహించిన ఎన్నికల్లో ఎన్నికైన ప్రతినిధులను జైళ్ళలో పెట్టించింది. అసంఖ్యాకంగా హత్యలు చేస్తూపోయింది.

అఫ్జల్‌గురు సాయుధ దళంల్లోకైతే వెళ్ళాడుగాని అక్కడ నెలకొని ఉన్న అనేక గందరగోళాలు చూసి వెనక్కి వచ్చాడు. లొంగిపోయాడు. భారతసైన్యానికి లొంగిపోయాడు. కాని అతనికి మునుపటి జీవితం తిరిగి రాలేదు. భారతసైనిక బలగాల చేతుల్లో చిక్కి చిత్రహింసలనుభవించాడు. చివరికి పార్లమెంటుపై దాడి కేసులో అతని జీవితం అంతమైంది. భారతదేశంలో రాజకీయపార్టీల ఎన్నికల క్రీడలకు ఒక కశ్మీరీ బలైపోయాడు. 2005లో మరణశిక్ష విధించాక ఎనిమిదేళ్ళకు దానికి అందివచ్చే సమయంలో కాంగ్రెస్ ప్రభుత్వం అఫ్జల్ అనబడే ఒక 'తీవ్రవాది'ని మట్టుబెట్టి తనకు తిరుగులేదని తలెగరేసింది. ఒకపక్క హిందుత్వ ఫాసిస్టు శక్తులు కుంభమేళాలో సన్యాసులతో నరేంద్రమోడీ ప్రధాని అభ్యర్థిత్వాన్ని ఖరారు చేస్తుంటే, కాంగ్రెస్ తానేమీ తక్కువకాదని అందుబాటులో ఉన్న ఒక ముస్లింను, అందునా కశ్మీరీని చంపి తానేమిటో నిరూపించుకుంది. సరిగ్గా అదేసమయంలో తమిళులను 'పసిపిల్లలను కూడా వదలకుండా' ఊచకోతకోసిన శ్రీలంక అధ్యక్షుడు రాజపక్సేకు ప్రజల నిరసనల మధ్యే ఎర్రతివాచీ పరిచి ఆహ్వానించింది.

అఫ్జల్‌ను చంపాక కశ్మీర్ ఉవ్వెత్తున లేచి నిలబడింది. కశ్మీర్ చరిత్రలో అతను అమరవీరుడయాడు. కశ్మీర్ చరిత్రకు, సంస్కృతికి ప్రతీకగా కశ్మీరియత్‌ను ఆ ప్రజలు ఎలా చాటుతారో ఇప్పుడు కశ్మీరియత్‌కు ప్రతీకగా అఫ్జల్‌గురును నిలిపారు. అతన్ని చంపాక అతని సొంత ఊరు చుట్టూ సైనికపహారా పెట్టింది ప్రభుత్వం. దాన్ని దాటుకొని వెళ్ళడానికి ప్రయత్నించిన యువకులపై కాల్పులు జరిపి ఐదుగురినీ బలితీసుకుంది. కశ్మీర్‌లో ఎక్కడికక్కడ ప్రదర్శనలు నిర్వహించడానికొచ్చిన ప్రజలపై బలప్రయోగం చేసింది. రోజుల తరబడి కర్ఫ్యూ విధించింది. విద్యుత్, మందులు, నిత్యావసర సరుకుల రవాణా ఆపేసింది. టీవీ, ఇంటర్నెట్, పత్రికలను నిలిపివేసింది. భారతదేశంతో ఉన్న అన్ని సంబంధాలను తెంచివేసింది. ఎప్పటిలానే కశ్మీర్ భారతదేశంలో అంతర్భాగమని ప్రకటిస్తోంది.



సెలయేటి నీళ్ళల్లో చైతన్యముందిరా, చెలకల్ల మొలకల్లో
బలముంది చూడరా..
వీచేటి గాలుల్లో విద్యనందుకోరా...
॥గురిగింజ గురి మల్లెలో॥

రాళ్ళల్లో రప్పల్లో రాటు తేలినోల్లు, చెట్లల్లో, పుట్లల్లో
శ్రమ జీవులున్నారు... ఆ దేరువు లేనోల్లు
ఆదివాసులు బిడ్డ ...
మూల పురుషులు వాళ్ళు ముత్తాతలు మనకు ...
॥గురిగింజ గురి మల్లెలో॥

చదువు సంధ్యలు లేక వెనకబడిపోతున్నరు
అండదండలు లేక అల్లాడుతున్నారు...
రోగాలతో వాళ్ళు రోదిస్తూ ఉన్నారు ...
॥గురిగింజ గురి మల్లెలో॥

పోయెదారిలేక రాలిపోతున్నారు,
రాలేటి పిల్లలు రమ్మని చెప్పరా...
పోయేటి పిల్లల పోగులుగా చేయరా...
॥ గురిగింజ గురి మల్లెలో॥

ఆట పాటలతోటి చదువు నేర్పరా ...
చదువుల్లో సంధ్యల్లో శాఖాలు పారించి ...
సాయుధ పోరులో సాగిపొమ్మని చెప్పు ...
॥గురిగింజ గురి మల్లెలో॥

అడవి మీద హక్కు ఆదివాసులదేరా ...
నందిగ్రామ్ నుండి నారిలోకం మెల్ల
సింగూరు జనమంత సిద్దమైనారు
నానో కొడుకును నడ్డి విరిచినారు ...
॥గురిగింజ గురి మల్లెలో॥

మార్క్సిస్టులంత మూర్ఖులైంద్రు,
చెప్పింది వినకుండా చెవిటోల్లు
అయ్యింద్రు, కండ్లున్న గానీ
కనబడదంటుంద్రు, అనగతొక్కుడే మా
మార్గం అంటుంద్రు...
॥గురిగింజ గురి మల్లెలో॥

ఎంద్రాను కంపెనీకి ఎదలోన బల్లెమై ...
పోస్కో కంపెనీతో పోరు చేస్తుంద్రు
లక్ష్మి మిట్టల్‌తో లడాయి చేస్తుంద్రు
టాటా జిందాల్‌కు తడాఖా చూపిస్తూ
వేదాంత కంపెనీకి వెన్నులో చలిపుట్ట ...
॥గురిగింజ గురి మల్లెలో॥

జల్, జంగిల్, జమీన్ మాదంటు,
దండకారణ్యంలో దండు –
కదులుతోంది, జనతన సర్కారుకు జైకొట్టు కొంటు..

# పల్లేలన్ని అడుగుతున్నాయ్

**- దామరపల్లి నర్సింహ్మారెడ్డి**

పల్లేలన్ని అడుగుతున్నాయ్ ప్రజాబంధువు ఏదని
ఇల్లిల్లు కన్నీరుపెట్టింది పోరుబిడ్డ రాడని
అడవి తల్లి ఆగమే ఆమెకు అస్తమించిన రవి లేదని
॥పల్లేలన్ని॥

నీ ఇంటి పేరు శాఖమూరి
నీ పూర్తి పేరు అప్పారావు

ఉన్నత చదువులోదిలి – ఉద్యమాల బాటబట్టి
రాడికల్ల బాటలోనా – రణంలోనా ముందు నడిచి
పల్లె పల్లె తిరుగుకుంటు – ప్రజల బాధలు తెలుసుకున్నావ్
ప్రజా పోరులో ముందు నడిచి – ప్రజా నేతవయినావు
ప్రజా పోరులో జేరినీవు – ప్రజాదండు కట్టినావు
॥పల్లేలన్ని॥

పోరుగల్లు నర్సంపేట – నవమాసాలు మోసి కన్నది నిన్ను
విద్యార్థి ఉద్యమంలో – విజయాల బాట నీది
రైతాంగ పోరులోనా – రణంలో గెలిచిన వాడవునీవు
గెరిల్లా యుద్ధంలోనా – యుద్ధ నిపుణుడవు నీవు
ప్రజా గెరిల్లాకు – ఆజ్యం పోస్తివా మాయన్న
॥పల్లేలన్ని॥

తొర్నాల అడవిలోనా – సభలెన్నో పెట్టినావు
రావురుకులోనా – రణమే రణరంగమన్నావు
మెతుకు లేని పెదతల్లీకి – కుండలో మెతుకువై
భూమి కోసం భుక్తి కోసం – ఉద్యమ బాట పట్టాలన్నావ్
విప్లవిస్తే విజయాలు మనవేనన్నవు॥పల్లేలన్ని॥

విప్లవోద్యమ పార్టీకి నీవు – అగ్రనేతవయ్యినావు
సిద్ధిపేటలోనా నీవు – అస్తమించిన రవన్నవు
సాయుధ పోరుకు నీవు – సారథై నిలిచావు
దోపిడిదారుల గుండెల్లోనా – గునపలైనావు
ప్రజా యుద్ధంలోనా నీవు – ఆరిపోని విప్లవ జ్యోతివి
॥పల్లేలన్ని॥

ముషీరాబాద్ జైలులోనా – రాజకీయ ఖైదీవై
కాలరాయబడిన ఖైదీల హక్కుల కోసం
నిరహార దీక్షలు నిరసనలెన్నో జేసినావు
ఖైదీల హక్కులకై – గొంతెత్తి అడిగినావు
ఖైదీల హక్కుల సాధనలో – విజయాల బాల నీది
॥పల్లేలన్ని॥

మెదక్ జిల్లా నుంచి నీవు – నల్లమలకు ఎగిసినవాడవు
అలలు అలలుగా సాగిన పోరాట యాత్ర నీది
పోరాట యాత్రలోనా – పోరుజెండా లెత్తినావు
మార్క్సిజం – లెనినిజం – మావోయిజం బాటలో నడిచి
చారుబాబు వారసునివై – వెల్లువైతీ రవన్న
॥పల్లేలన్ని॥

బస్సులోనా పట్టుకుని – చిత్రహింసలెన్నో పెట్టి
దొంగ ఎదురు,కాల్పుల్లోనా – కన్నుమూసిన వీరుడవు
పీడిత ప్రజలు మరసిపోని – విప్లవాల అగ్గి పిడుగువు
సముద్రుడికి వారసుడివై – అలలు అలలుగా సాగితివా
అంకం బాబన్న అడుగు జాడల్లో పోతివా మాయన్న
ఓరుగంటి కళలను నిజం చేస్తివా ఓయన్న
మెదక్ జిల్లాలో చెరిగిపోని ముద్ర నీది ॥పల్లేలన్ని॥

# మముకన్న మాయమ్మా...

**- మంజీర**

అమ్మా... అమ్మా... అమ్మా..
అమ్మా... మాయమ్మా...
అమ్మా మముకన్నా మాయమ్మా

పురిటి నొప్పులతో ప్రపంచాన్ని చూపినావు
నీ ఒడిలోనా చనుబాలునిగా చూసినావు
పొలం పనులు చేస్తూనే ఉయ్యాలలు ఊగించావు
పక్షుల రాగాలు కోయిలమ్మ పాటలు వినిపించావు
అక్షరాలు నేర్పినావు - బతుకు బాట చూపినావు
గోరు ముద్దలు తినిపిస్తూ - చందమామను చూపినావు
ఏడుపులు మాన్పించనీకి - జాబిల్లిని పిలిచావు
॥అమ్మా॥
మెతుకు లేని పల్లెలో - కడుపు మంట ఆకలికై
బతుకు పోరులోజేరి - ముందుండి నడిచావు
భూస్వామ్య దోపిడీదారుల - దౌర్జన్యాలను ఎదురిస్తూనే
రాజ్యహింసను దిక్కరిస్తూ - వెనుకడుగు వేయలేదు
పోరాడే జెండాయ్యి - ఉద్యమమే ఊపిరిగా బతికినావు
॥అమ్మా॥
మదమెక్కిన భూస్వామి - నిన్ను చంపాలని కుట్రలెన్నో పన్ని
లంపెన్ గ్యాంగ్‌తో దాడి చేయించి హరిగోసలే పెట్టి
చెరసాలు నిర్బంధం దిక్కరిస్తూ అదవోద్యమానికి అండయి
నీ జవితమంతా కష్టాల కడలై సాగుతూ
భూస్వామి రంగులను బైటపెట్టినావమ్మా
॥అమ్మా॥
నీవు పడిన కష్టాలు మాయమ్మా ఎవ్వరు పడరే అమ్మా
జీవితమంతా అటుపోటులను అధిగమిస్తూనే అమ్మా
మెతుకు పల్లే చివరి పల్లే నీది అమ్మా
భూమి కోసం భూవిముక్తి కోసం రగిల్చిన పోరులో అమ్మా
పోరాట జెండాలై పోరుకే పోరువయ్యావమ్మా
॥అమ్మా॥

# కడుపు నిండ తిండి లేకున్న...

**- ఉప్పెన**

కడుపు నింద తిండి లేకున్న... ఆదివాసులు..
నీళ్ళు తాగి బతుకదామన్న...
మంచి నీళ్ళ కరువు తోటన్న... ఆదివాసుల..
గొంతు తడిసే దారిలేదన్న... ॥కడుపు॥

వాగులన్ని ఎండిపోయి సెలిమెలన్ని ఇంకిపోయి
చేతి పంపులల్లో నీళ్ళు మట్టి కిలుము వాసనొచ్చే
ఆ మురికి నీళ్ళనే కొద్ది కొద్దిగ... ఆదివాసులు..
గతుకుకుంటు బతుకుతున్నార..
కడుపు నిండా మంచి నీళ్ళన్న... ఆదివాసులు..
తాగి బతికే దారిలేదన్న..
॥కడుపు॥

ఫ్రిజ్‌లోని నీళ్ళు తాగుతూ ఎసి లోన కునుకు తీస్తూ
ఐటిడిఎ అదికారులు హాయిగానే గడుపుతున్నారు
మండేటి ఎండలల్లోన... ఆదివాసులు...
ఇంకిపోయిన సెలిమెల వెంట..
బిందెడన్ని నీళ్ళ కోసం... ఆదివాసులు...
బాధలెన్నో పడుతూ ఉన్నారు... ॥కడుపు॥

పై స్టారు హోటల్లలో ఇడ్లి దోశలు తెచ్చుకొని
చుట్టు ఫ్యాన్లు పెట్టుకొని పరుపు మీద పండుకొని
పల్లె నిద్ర పేరు చెప్పేరు... అధికారులు...
పేపర్లకు ఫోజులిస్తారు..
కొండ జనము తిండి గిట్టదు... అధికారులు...
తెచ్చుకున్న తిండె తింటారు... ॥కడుపు॥

వెదురు కొమ్ముల కూర తినరు కొండ జొన్నల జావ తాగరు
దోమలల్లో పండుకోరు కాలువల్లో నీళ్ళు తాగరు
వెంట తెచ్చుకున్న నీళ్ళనే... అధికారులు
ఎందుకుమరి తాగుతున్నరు...
మా చేతి పంపులోని నీళ్ళతో... అధికారులు
మొఖం కూద కడగరెందుకు.. ॥కడుపు॥

గిరిజన దర్బారులోన ఇచ్చినట్టి విన్నపాలు
చెప్పుకున్న బాధలన్ని చెత్త బుట్టలో వేస్తు ఉన్నరు
పట్టనట్టు ఉంటు ఉన్నారు... అధికారులు
పండుకొని తింటు ఉన్నారు...
గిరిజన దర్బారు నిండన్న... అధికారులు...
దళారులను నింపుకున్నారు. ॥కడుపు॥

ఆదివాసుల బాగు కోసమె ఐటిడిఎ ఉన్నదంటరు
మంచి నీళ్ళు అడుగబోతె నిధుల్లేవు వెళ్ళుమంటరు
ఐటిడిఎ ఉన్నదెందుకో.. ఆదివాసులు
అధికారుల నిగ్గ దీయాలి...
మంచినీళ్ళ సాధన కోసం ఆదివాసులు...
ఉద్యమించి ఉప్పెనవ్వాలి..

# ఒక్కొక్క రాత్రి

**- కూర్మనాథ్**

వణికించే చలిలో నగరం ముడుచుకున్నాక
రోడ్లన్నీ నిర్మానుష్యమై చీకట్లో కలిసిపోయేక
ఒక కొత్త ప్రపంచం కనులు తెరుస్తుంది

మీరందరూ గాఢ నిద్రలోకి వెళ్ళిపోయేక
మీ పిల్లల్ని జోలపుచ్చి పడుకోబెట్టేక
టి.వి.ల్లో సినిమాలయ్యాక, ఫేస్ బుక్కుల్లో
గుడ్‌నైట్లు చెప్పుకున్నాక
కొందరు ఆడవాళ్ళు, కొందరు మగవాళ్ళు
పారలూ, పలుగులూ, రోడ్డు కటింగ్ యంత్రాలూ
ట్రాక్టర్లమీంచీ, భుజాలమీంచీ దింపుకుంటారు
కొందరు తల్లులు చంటి పిల్లల్ని ఫుట్‌పాత్‌మీదే పడుకోబెట్టి

పనిలోకి నేరుగా దిగిపోతారు
తప్పిపోయిన వాహనాలు కొన్ని
అటు ఇటూ పరిగెదుతుంటాయి
సరిహద్దు గొడవల్తో కుక్కలు అరుస్తూ ఉంటాయి
కీచురాళ్ళ నిశ్శబ్దాన్ని అదిలిస్తుంటాయి
మీరందరూ ఎవరి నిద్రల్లో, ఎవరి కలల్లో వాళ్ళు
ఈ లోపల మెరిసే బనీన్లు వేసుకుని కొందరు
రోడ్లూ, వీధులూ ఊడ్చేస్తూ ఉంటారు
ఊడ్చిన రోడ్లమీద ట్రాఫిక్ గీతలు వేస్తుంటారొకరు
మరోచోట పొంగిపొర్లుతున్న డ్రైనేజీ కంతల్లోకి దిగి
వదుపుగా బాగు చేస్తుంటారొకరు
చీకట్లతో యుద్ధం చేస్తున్న దీపాల మొహాలు
బ్రహ్మాండంగా వెలుగుతుంటాయి
పొద్దుటి మీ కప్పుల చాయ్ కోసం
పాల సైకిళ్ళు పరుగులు పెడతాయి
నిన్నటి వార్తల్ని తలుపులకు వేళ్ళాడేసేందుకు
పేపర్ బాయ్‌లు ఉరుకుతుంటారు

మీ పగటి కలల్ని నిజం చెయ్యడానికి
దివిటీలాగా వెలిగిన రాత్రి
తొలిపొద్దుతో ఆవిరైపోతోంది

# వాళ్ళెక్కడ!?

**- మురళి**

కరీంనగర్-ఓరుగల్లు-ఆదిలాబాద్
గుంటూరు-కర్నూలు-శ్రీకాకుళం
ఎక్కడా మీ అలికిడి లేదు-ఎటెళ్ళారు కామ్రేడ్స్
రేడియలల్ల, టివిలల్ల ఈ ఊళ్ళ పేర్వింటేనే
మీ పోరు సుద్దుల కోసం చెవులు రిక్కించేవాళ్ళం
అదవంటుకుంది అంటే-చెంచు జీవితాలు
చెల్ల చెదురైనవంటే మీరున్నారనే బరోసాతో
ధైర్యంగుంటిమి
ఎక్కడున్నారు కామ్రేడ్స్-ఒక్కసారొచ్చిపోరూ!
ఆకలి కేకలు - ఆర్తనాదాలు - అనాద చావులు -
అంటరానితనం - ఇవి
మా ఖర్మ కాదని-కాలే కడుపులకు కారణం చెప్పిన కామ్రేడ్స్
ఎక్కడెళ్ళిపోయారు

కారంచేడు - వేంపెంట మారణకాండకు
కారకులెవరనీ... రాజ్యం శిక్షించలేదు-సరికదా!
వారిని పువ్వుల్లో పెట్టుకుని కాపాడినప్పుడు
మీకు మేమున్నామని చెప్పినప్పుడు-శత్రుదేహాన్ని
జెల్లడ పట్టినప్పుడు-మీ ధైర్యంతోనే మేం బతికినం

ఎక్కడున్నారు కామ్రేడ్స్-ఒక్కసారొచ్చిపోరూ?
మీరు లేరని... శత్రుమూకలు సంబరాల్లా ఉన్నయి
లక్షింపేట మరో వేంపెంట అయింది
పెత్తందారుల పెత్తనం-బల్సినోళ్ళ ఖావరం
మళ్ళీ అత్తున్నయి
మాకు తెల్సు-మీరు విశ్వమానవులని-దేశ, ప్రపంచ
ప్రజల విముక్తి మీ ఆశయమని-అందుకే మీరు
రాలేకపోతే మీ జాడనైనా చెప్పండి కామ్రేడ్స్

# మానసిక స్థితి

**- పచ్చల కిరణ్‌కుమార్**

ఆకాశాన పయనించే విహంగం
అనుకోని రీతిలో నేల కూలిందంటే
అది పైలట్ అశ్రద్ధకాక
సాంకేతిక లోపమో
వాతావరణ ప్రభావమో అయి ఉండవచ్చు

ఓ సాధు జంతువు
క్రూర మృగానికి బలైందంటె
దాని బలహీనతో
నిస్సాహాయ స్థితో అయి ఉండవచ్చు

ఒక కార్యాన్ని
సక్రమంగా నిర్వహించలేకపోవడానికి
నిర్లక్ష్యమే కాకపోవచ్చు
అందుకు కారణమేదైనా ఉండి ఉండవచ్చు

శ్రమలని, బాధలని
ఎవరైనా ప్రేమగా ఆహ్వానించలేరు కదమ్మా?

మరణాన్ని
ఎవరైనా సాదరంగా స్వాగతించలేరు కదమ్మా?

శిక్షించదానికి ముందు
షానో మానసిక స్థితిని పరిశీలించావా తల్లీ?

మానవ సమాజానికి
నరనరాన పాకుతున్న
సామ్రాజ్యవాద విష సంస్కృతిని గుర్తించలేక పోతున్నప్పుడు

మనిషికి మనిషి
దూరమవడానికి కారణమైన
ప్రపంచీకరణ కుట్రను కనుగొనలేకపోతున్నప్పుడు
మనం మౌనంగా ఉండలేం తల్లీ

*(తమిళనాడులో షానో అనే 12 సంవత్సరాల విద్యార్థినిని సరిగా చదవడం లేదని టీచర్ తీవ్రంగా కొట్టడంతో రెండు రోజులు ఐసియులో ఉండి చనిపోయిన బాధలో నుండి రాసిన కవిత ఇది)*

# ఒకానొక... ఆమె...

**- మేడక యుగంధరరావు**

నాకు, చాన్నాళ్ళ నుంచి ఒక ఆశ
ఆమెను దగ్గరగా చూడాలని
తలుపులు బార్లా తీసి..

తట్టుకోగలనో లేదో కానీ
పొడి పొడిగానైనా సంభాషించాలని
గొంతులో మొలిచిన మొక్కలతో

చాక్లెట్ ఆశతోనో
ఒద్దు చేర్చే బస్సులోనో
కాల కృత్యాల గుబురు పొదల్లోనో
ఆకలి చూపుల నడిచే పదార్థం ఆమె
భంగ పడుతూనే ఉంది
సారె మీది మట్టి కుండలా
అకాల వర్షంలో
నిండా మునిగిన పంట పొలంలా

తరగతి గది చివరి బెంచిలోనో
కులం తక్కువ ముదనష్టపు దానిగానో
ఎంగిలి విస్తర్లెత్తి
కుక్కలతో కలసి కడుపు నింపుకున్న
ఎట్టి మనిషిగానో
ఆమె ఛీత్కరించబడుతూనే ఉంది
ఇంటి ముందు వాలిన నల్ల కాకిలా

పడుతూనే ఉంది
తిరిగి లేస్తూనే ఉంది
పడుతూ లేస్తూ
'ఊరు' వదిలిన పెరటి పోగుల పక్క
కాలుతున్న మెలకువ ఆమె

ఎంత ఎదురీత
ఎగిరే పతంగమై
ఆకాశానికి ఊయలేయాలని
నదిలో లంగరై
తన్నుతాను నిలుపుకోవాలని
సముద్రమంత కన్నీటిని
భుజాన మోస్తున్న పచ్చిపుండు ఆమె
నేల చిగురిస్తున్నంత మేరా
శిథిలాల్లో తెప్పరిల్లే
అంటరాని గబ్బిలం ఆమె

నాకు చాన్నాళ్ళ నుంచి ఒక ఆశ
ఆమెను దగ్గరగా చూడాలని
పొడి పొడిగానైనా సంభాషించాలని...

# నిర్భయ

**- బాలసాని రాజయ్య**

ఓ చెల్లీ...
నీవు మరణించలేదు
రాజధాని నడిబొడ్డున
వేసిన పోరు కేకవు
మరిచిపోదు ఎప్పటికీ
కామాంధుల కాటుకు
రాబందుల వేటుకు
మానవత్వం మంట కలిసింది
మనిషిగా పుట్టినందుకు జాతి తలవంచుతున్నది
కోర్టులు చట్టాలు ఉన్నోడి చుట్టమని తెలిసింది
గల్లీ నుండి ఢిల్లీ వీధిలో లేచిన ఉప్పెన కెరటం నీవు
కవాతులతో కదిలింది
నీవు రాల్చిన కన్నీటి బొట్టు అనువణువు జ్వాలై రగిలింది
రక్తం మరిగి ప్రతి పిడికిలి బిగిసింది
నినాదమై ఎప్పుడూ సాగుతూనే ఉంటుంది
యావత్తు భారతజాతి మనస్సులో నీవు బతికే ఉంటావు
మహిళా లోకానికి చైతన్య కిరణమై ఉదయిస్తూ ఉంటావు
..... ఓ తల్లీ

# మృగరాజ్యసత్వం

**- ఎం.ఎ. బాసిత్**

కావరమెక్కిన కంటిచూపు చీరేసిన
ఆడ తనమా!
చెల్లివో
మల్లివో
రేపటి అమ్మ తనానికి
కమ్మనైన ప్రతీకవో ...
ఢిల్లీ నేల మీద
'నిర్భయ'గా నడిచిన
బహదూర్ బేటీవో ...
నవనిర్మాణ నారీ లోక
సమ్మాన్ వో ...
చితికిన
బతుకైన అతివవో ...
అపురూప
అమానత్‌వో ...
గుండెలు చిదిమిన
అమానుషం ...
మీగడ మాటల మీటలు
అదిమిన దౌష్ట్యం ...
కన్నతల్లి నేల మీదికి
జారవిడిచిన దారి మరిచిన.
ఘాతుక అఘాయిత్యం ...
గర్భకుహర ద్వారం
భగ్గున మండించిన
ఇనుప చువ్వలు, కడ్డీలైన మృగత్వం ...
అలిమిగానో... బలిమిగానో
అంతుచిక్కని అచేతన క్షణం
అమాయక అండంజొచ్చిన దుష్టకణం ...
మగ పిండంగానో ...
మృగప్రాణ గండంగానో ...
ఎదుగుతున్నా
పొదిగించుకు
ఒదిగించుకున్న ... అమ్మ ఒడి పొత్తిళ్లు
చీల్చేసుకున్న మగతనమా!
జ్ఞాన జన్మనిచ్చి

ప్రాణప్రదానం చేసి
ఆయువు పోసి ...
ఎదిగించుకున్న ... అసలు బడి గోడలు
కూల్చేసుకున్న మృగతనమా!
మిడ్‌నైట్ ... బెడ్‌లైట్
మృగ విష సంస్కృతికి
దాసోహమైన రాజ్యతనమా!
నువ్విప్పుడు
మండుతున్న కంటి గోళాల ముందు
నిలబడ్డావ్! ...
అమానత్!
దీపోజ్వల అపురూప ఆడతనమా!
మగ మృగ విశ్వాసఘాతక
అమానుషత్వాన్ని క్షమించొద్దు ...
నువ్వు అబలవు కానేకావు
కావర మృగరాజ్యసత్వాన్ని
చీల్చే ...
మంత్రసానివి!
శస్త్ర ధారిణివి!

## ఉదయమిత్ర కవితలు రెండు

# A Dalit is not to Sleep

ఎప్పుడూ మెలుకువగా ఉండాలి..
ఎంత చల్లని గాలి వెన్ను నిమిరినా
ఎంత చక్కని పాట వెన్నెలై కురిసినా
ఎంత చల్లని మాట గుండె బరువు దించినా
ఏమరుపాటు వొద్దు..
శతాబ్దాలుగా
విశ్వాసాల ఊబిలోకి
విసిరేయ బడ్డ వాళ్ళం గదా
అవమానాల వెల్లువలో
తడిసి ముద్దయిన వాళ్ళం గదా
ఏ చిన్న సుఖం కింద కునుకు తీసినా
ఏ చిన్న ఓదార్పు కింద
ఇంత నీడను భ్రమించినా
ఏ చుందూరో విరుచుకుపడొచ్చు..
ఏ ఖైర్లాంజి కండకావరమో ఒళ్ళు విరువవొచ్చు
ఏ లక్షింపేటనో కుత్తుకలు తెగ్గోయవచ్చు
నేస్తం..
చరిత్ర ఏమారినపుడే
తలలు తెగిపడ్డాయి..
ఉద్యమాల గొలుసులు తెగిపడ్డపుడే
మారణకాండలు విజృంభించాయి
అయినా.. ఎంతకాలం
ఈ రక్తధారల్ని భరిద్దాం
ఈ తెగిన మాంస ఖండాల్ని
భుజాన వేసుకొని
ఎన్ని దర్వాజల్ని తట్టగలం
ఎంత సానుభూతిని పొందగలం
కదలాలి..
గొలుసు కట్టుగ కదలాలి
అక్కడ పెనుకేక వినబడితే
ఇక్కడ పెనుమంటలు రేగాలి
కలిసి వొచ్చే చేతుల కలగలుపుకొని
కలాలు, గళాలు, పిడికిళ్ళు ఒక్కటిగా
కదం తొక్కాలి
శత్రువు మేలుకోకముందే
కోలుకొని దెబ్బగొట్టాలి
వొద్దు.. ఏమరుపాటు వొద్దు..
ఒక కన్ను నిద్రిస్తే
ఒక కన్ను కాపలా కాయాలి
జాగరూకత
మన ఇంటి పేరయి ఉండాలి
మన ఒంటి మీద విద్యుల్లతలా పాకాలి..
'నిరంతర జాగరూకతయే
నిజమైన స్వాతంత్రానికి ప్రతిఫలం'
A Dalit is Not to Sleep

*('A Mangolian is not to play' అన్న చెంఘిజ్ ఖాన్ మాటలు నన్నెప్పుడూ వెంటాడుతుంటాయి.)*

# అదే నవ్వు

అతడు
మా ఇంటికొచ్చినపుడు
గంప నిండా పూలు తెచ్చాడు..
ఇంటినిండా పర్చి
పరిమళాలు ముంచెత్తాడు..
ఉద్యమానుభవాల్ని దోసిట్లో పోసి
గొప్ప పాటలా వికసించి
నన్ను సంభ్రమాశ్చర్యంలో ముంచెత్తాడు
'ఇంతగాయం తర్వాత.. ఇలా
ఇంత నిర్బంధంలోనూ.. ఇలా' అంటూంటే
అతను మెత్తగా నవ్వాడు..
అతని నవ్వులోని స్వచ్ఛత
ప్రకృతిలోని ఏ పువ్వులోనూ లేదు..
ఏ మానస సరోవరం అతనికి పోటీ రాదు..
ఏ కొండా అతని గుండె నిబ్బరానికి సరిపోలదు..
పొంచి ఉన్న మృత్యువును జూసి
పరిహసించినవైనం..
భద్రతా పొరల్లోంచి తొంగిచూసే నన్ను
మరుగుజ్జును జేసింది
శిఖరమై నిల్చినవాడికి
నాలాంటి గులకరాళ్ళ పట్ల
ఈ అణుకువేమిటో
ఎప్పటికీ అర్థం గాదు..

పోతూ పోతూ అతడు
మా ఇంటి ముందు
ఇన్ని సూర్యోదయాలు చల్లిపోయాడు
* * *

ఒకానొక భీకర నిశ్శబ్దం..
ఆత్మీయుల మధ్యన
మందుపాతరలు పేల్తున్నట్టుగా
పెరుగుతున్న దూరం -
కాలం మీద మిస్సింగులు
కస్సుమని కాటేసే వేళ
పచ్చని బతుకు మైదానంలో
నల్ల నాగులు బుసలుకొట్టే వేళ
ప్రశ్నల్ని భుజాన వేసుకొని
అతని జాడకోసం
ఎందరినో విసిగించాను ..

ఆ స్వచ్ఛమైన మల్లెలాంటి నవ్వుకోసం
ఆ సుకుమార హస్తాల కోసం
ఆ కళ్ళలో నిర్భతి కోసం
జీవితాన్ని
అన్ని మూలాలకూ సారింపజేశాను..
తల్లిలా కొంగుపట్టి
ఇల్లిల్లో తిరిగాను ..

* * *

మిస్సింగ్‌ల కోరల్లో జిక్కి
ఎప్పటికీ తిరిగిరాని
మల్లేష్, మనోహర్‌లకు
సుదీర్ఘ విరామం తర్వాత
రాజ్యం తనమొరటు చేతుల్తో తట్టి లేపింది

ఈ రోజు
ఫోటో ఎగ్జిబిషన్‌లో
అమరుల పక్కన
మిస్సింగుల శీర్షికన
అతని ఫోటో కన్పించింది
అదే నవ్వు..
సముద్రపు గాలుల మీద సవ్వడిలాంటి నవ్వు
సంక్షోభంలో శక్తినిచ్చే నవ్వు..
వెలుగు నీడల్లో, సుఖ దుఃఖాల్లో
ఎప్పటికి గుర్తుండిపోయే నవ్వు

# అవినీతులు

**- కె. అంజయ్య**

అందరికి అన్నీ రుచించావు
అందరికి అన్నీ జీర్ణం కావు
కడుపులో మెలికల దోమల కాట్లు
వాంతి కానంత కాలం
ప్రాణం పట్టు తప్పుతుంది
వత్తి వెలుగులకు చమురు జీవం
గాలిలో దీపం కానంత కాలం చలనం
చమురు అలలు ముంచుకొస్తే
వత్తి సిగలో వెలుతురు రాళ్ళ పిన్నులు మాయం
పెండకవ్వం చిలికితేనే సొన్పుకు కళ
ముగ్గుల మల్లెల విరబూత
సొన్పు పెండ పెండయితే
పురుదు పోసుకుంటాయి జారుడు బండలు
గడప దాటనివ్వని వాకిలి
కాలు జారితే కాళ్ళకో, కీళ్ళకో కదుపొస్తది
తడుల రక్తం ఎక్కిస్తేనే వరికి సిరి
కొనగొటి గొలుసులకు విత్తుల సవ్వడి
దూప వడ గాలులు వీస్తే
పొలంలో బీటల బ్రహ్మ జెముళ్ళు
మడులు నీటి గొలెంలైతే
వేరు కుళ్ళుతో అసలుకు ఉరి
ప్రకృతి పాఠాలు నిరంతర గుణపాఠాలు
జీర్ణించుకుంటే సారం భావి ఫలరసాల హారం
అవినీతి గనులు ఆకలి ఘటోద్గజాలు
కుంభకర్ణ నిద్ర నటనను పండిస్తున్న రాజ్యం
సిజేరియన్ క్లైమాక్స్‌తో పురుడు
ఆ'పరేషాన్' తప్పదు పద గురూ...

# రక్తంలో ముంచెత్తిన అరుణపతాకలే

**- సముద్రుడు**

మార్చి 8
అంతర్జాతీయ మహిళా దినోత్సవం
శ్రామిక మహిళల పోరాట దినం...
ఆకాశంలో సగమైన మహిళలకు
అవకాశాలలో సగమంటూ...
స్త్రీ, పురుష సమానత్వం కోసం
నినదించిన క్లారాజెటికిన్ గురించి
నీకు తెలియకపోవచ్చే అమ్మ
వంగి నాట్లేస్తూ...
కూలీ పెంచమని అడిగిన చైతన్యం నీది...
ఓటు వేయడం తెల్సిన నీకు
హక్కుగా ఉండాలని పోరాడింది ఆమెనే...
రంగు రంగుల రంగవెల్లులు
అల్లికలు... కుట్లు
వేదికలు... మీటింగ్‌లు
పొగడ్తలు... బహుమతుల సంతోషం
కరుగకముందే
చీకారాలు... చిన్న చూపుల
చమత్కారాల సత్కారాలు
పోరాట దినాన్ని
జాతరగా మార్చేశారే...
ఆధునికత పేర
ఆత్మగౌరవాన్ని నశించేలా చేస్తున్నారే...

ద్రౌపదిని వివస్త్రను చేసినట్లు
'నిండు' సభలో మంత్రుల
వివస్త్ర నీలి చిత్రాల వీక్షించే
రక్షకుల పరిరక్షణలో
ప్రెసిడెంట్ అయితేనేమీ
ప్రధాన మంత్రి అయితేనేమీ
స్పీకర్ అయితేనేమీ
పితృస్వామ్య జాతిలో 'జాబిల్లి'వారు
ప్రజాస్వామ్య ప్రహసనంలో
మహిళలు పావులుగా మార్చేస్తున్నారే...
తల్లి
చెల్లి
సహచరి
పాత్రలు వేరైనా వంటింటి బందీనే
పిల్లలగనే యంత్రమేనే...
చదువుల తల్లి శారదమ్మ
బ్లాక్ బోర్డుపై అ, ఆ ల నేర్పుతున్న సరోజ
కలెక్టర్
కమలమ్మ
రమణమ్మ
మగ పెత్తనం అడుగుల్లో నలిగిన వారేనే...
కడుపులో నలుసును నల్చివేస్తున్న
ఆధునిక భారతం మనది...
సంభోగినిగా
సుఖ జీవిగా
నిర్వచిస్తున్న మహిళా కమిషనర్లు
రెడ్‌లైట్ ఏరియాలో మాంసం ముద్దగా మార్చి
మార్కెట్‌లో సరుకును చేసి ఊరేగిస్తున్నారే...
వెర్రితలలు వేస్తున్న పితృస్వామ్య ప్రతినిధులే వీరు
మనిషిగా చూడని లోకంలో
మంచితనం కోసం వెతకడం
గొంగటిలో కూర్చొని
వెంట్రుకలు వేరుకోవడమేనే
తల్లుల చెల్లెల ఆర్తనాదాలు
అనుక్షణం...
రణ నినాదంగా మారకుండా
మహిళలకు విముక్తి లేదే అమ్మా
అంతర్జాతీయ మహిళా దినోత్సవంకు అర్థమే లేదే...
విముక్తి పోరులో
అక్కలు... చెల్లెలు
తల్లులు సంఘాలుగా మారి వారు
కంటికి ధారగా కన్నీరు కార్చిన వారేనే...
సాయుధమవుతున్నారు తల్లి
అణచివేతల్లో పుట్టుకొచ్చిన
జెండాలే వారు
రక్తంలో ముంచెత్తిన అరుణ పతాకాలే తల్లి

*(అంతర్జాతీయ శ్రామిక మహిళా దినోత్సవంగా 'అమ్మ' కోసం రాసినది.)*

# నివురు గప్పిన నిప్పురవ్వలు

**- శ్రీనాగాస్త్ర**

చేపల చెరువులో
మునిగిపోయింది
ప్లాట్లు ప్లాట్లుగా
ముక్కలై పోయింది

అప్పుల ఊబిలో
కూరుకు పోయాడు
వ్యవసాయ 'వ్యసనం'లో
చితికి చిక్కిపోయాడు

పంటభూమి
పాడెపై రూపాయి బిళ్ళైపోయింది
రైతుబిడ్డ
చేలోనే చుక్కైపోయాడు

ఆత్మహత్య
చేసుకునేటంత
పిరికోళ్ళు కారు
నేలతల్లి
భూమి పుత్రుడు

శతాబ్దాలుగా
ఎన్నో కరువు కాట్లు
ఎన్నో వరదపోట్లు
క్రూర మృగాల్లా వేటాడాయి
వడ్డీ వ్యాపారుల్లా పీడించాయి

తల్లికి ధైర్యం కొడుకు
పుత్రుడికి ఓదార్పు తల్లి
కండలు కరిగించి
ఖండలు ఖండలుగా
ధాన్యం రాశులు రాల్చారు

ఇవి హత్యలే
ప్రణాళికలు రచించి చేసిన హత్యలు
ఈ జంటహత్యల హంతకులెవరు?

సామ్రాజ్యవాదులకు
ప్రపంచ బ్యాంకుకు
అమావాస్య నిశిలో
పుట్టిన పెట్టుబడిదారులయ్యుంటారు!

ఏకఛత్ర వ్యాపారాల
దుష్టశక్తులు పడేసే
పరిగెలు ఏరుకునే
పాలేరు పాలకులయ్యుంటారు!

దేశం మార్కెట్‌గా మారిన చోట
సూట్‌కేసులు విధానాలు నిర్ణయించే చోట

శవాల పరీక్షలు
నిజాల నివేదికలు ఇవ్వలేరు
న్యాయాధిపతులు
ద్రోహులను శిక్షించలేరు

చీకటి చరిత్రలో నిజం
నివురు గప్పిన నిప్పురవ్వలా
రగులుతూనే ఉంటుంది

ప్రపంచ కర్షకులు
ఏకమైన క్షణం
మంటై మండుతుంది
ముష్కరులను మట్టుబెడుతుంది

## క్యూ...

**- చైతన్య ప్రకాశ్**

చెత్తబుట్టలో పారేసేదే పార్లమెంటైతే..
దాన్ని కాల్చడానికి అఫ్జల్ గురే కాదు
దేశంలో చాలామందే క్యూలో
నిలబడ్డట్టున్నారు.

## విద్రోహినే

**- నజీమ్ హిక్‌మెట్ రాన్**

అవును నేను విద్రోహినే..
మీరు దేశ భక్తులైతే.. మా మాతృ భూమిని
మీరు రక్షిస్తున్నట్లైతే
నేను విద్రోహినే..
నా మాతృ భూమికి నేను ద్రోహినే..
నా దేశానికి నేను ద్రోహినే
మీ పొలాల్లో దేశ భక్తి ఉంటే
మీ ఇనపెట్టెల్లో.. బ్యాంక్ అకౌంట్లలో దేశభక్తి ఉంటే
రోడ్డు పక్కన దేశభక్తి ఆకలితో మరణిస్తూ ఉంటే
చలికి దేశభక్తి వణుకుతుంటే..
వేసవిలో మలేరియాతో ఊగిపోతుంటే..
మీ ఫ్యాక్టరీల్లో మా రక్తాన్ని పీల్చడం మీకు దేశభక్తి అయితే
దేశభక్తి మీ పల్లెల్లో పెత్తందారుల పంజాల్లో ఉంటే
దేశభక్తి ప్రశ్న అయితే.. దేశభక్తి పోలీసు మూక అయితే
మీ బడ్జెట్ కేటాయింపులు.. మీ జీతభత్యాలు దేశభక్తి అయితే
అమెరికన్ స్థావరాల్లో.. అమెరికా బాంబుల్లో..
అమెరికా మిసైల్స్‌లో దేశభక్తి ఉంటే..
మా కంపుకొట్టే అజ్ఞానపు అంధకార మస్తిష్కాలు
దేశభక్తి నుంచి తప్పించుకోలేకపోతే..
అప్పుడు నేను దేశ ద్రోహినే..
దీన్ని మూడు కాలాల్లో 1 నిట్టనిలువుగా రాయండి..
అయినా నేను దేశ ద్రోహిగా కొనసాగుతా...

*(అఫ్జల్ గురు ఉరి సందర్భంలో మరో మారు గుర్తు చేసుకుంటూ. టర్కీ కవి నజీమ్ హిక్‌మెట్ రాన్ రాసిన కవితకు స్వేచ్ఛానువాదం...)*

1 మూడు కాలాలు = వార్తా పత్రికలో వార్త నిడివిని కొలిచేందుకు వినియోగించే మాట.

## అక్షరాలు ఆడుకోడానికి కాదు

**- కందుకూరి శ్రీరాములు**

లోపలంతా శిధిలమే
పైకి మాత్రం అంతా సవ్యంగా ఉన్నట్టు-
నాలుగు కూలిపోతే
ఒక్కటి పెరుగుతున్నట్టు అభివృద్ధి!

అభివృద్ధి పేరిట అణచే సంస్కృతి
వినిర్మాణమని విధ్వంసం సృష్టించే సంప్రదాయం
ఒక దుష్ట స్వభావం
ఒక దురహంకార పరిపాలనా వాతావరణం

చేయి అందించడం మాట అటుంచి
చాచిన చేయి నరికేసే నీచ ప్రవృత్తి రాజ్యమేలుతుంది
ఎవరికివారు చెల్లాచెదురై ఉండాలి తప్ప
గుమిగూడి వాళ్ళ దినచర్యను
దిద్దుకోవడం నేరమవుతుంది

పచ్చని అడవి చెట్ల మధ్య వెన్నెల్లో కలవడం
ముచ్చటించుకోవడం గొప్పనైన అనుభూతి వాళ్ళది
పండుగ ఆనందాన్ని పదిమంది పంచుకోవడం
ప్రతి ఏటా ఒక ఆనవాయితీ వాళ్ళది

వృత్తి ధర్మాన్ని న్యాయం చేస్తున్న వాళ్ళు
బతుకు సూత్రాల్ని నేర్చుకుంటున్నవాళ్ళు
జీవించే హక్కు కోసం పోరాడుతున్నవాళ్ళు

దున్నేవారిదే భూమికదా
వాళ్ళు భూమిని నమ్ముకున్నారు
భూమిని దేవతను చేసి పూజించుకుంటున్నారు
భూమిని దున్ని విత్తనాల పండుగ జరుపుకుంటున్నారు

భూమి పంపకం గురించి సమావేశమయ్యారు
పిల్లాపాపా ఆడ మగా
తేడా లేకుండా మాట్లాడుకుంటున్నారు
అంతే -
మరో జలియన్ వాలాబాగ్ ఉదంతం
వందల గొర్లమందలో వేలవేల తోడేళ్ళు
చుట్టుముట్టి కరుస్తుంటే
పిట్టలు రాలినట్టు ఆదివాసులు
హాహాకారాల మధ్య ఆడవాళ్ళూ మైనారిటీలూ

పోటా పోటీ యుద్ధం జరుగుతుందనుకుంటే
పోనీ -
ఆ భీభత్సాన్ని అలానే ఉండనీయాల్సింది
అక్కడ ఏం జరగనట్టు నాటకాలెందుకు?

భూమ్మీద
గుండ్ల వర్షం కురిసినట్టు
ఆకాశం చెబుతుంటే
అక్కడి అడవిలోని ఆకూ ఆకూ
కొమ్మా కొమ్మా గాయపడినట్టు
ఇది నియంతల రాజ్యమని రుజువు చేస్తుంటే
ప్రజాస్వామ్య దేశమని ఫోజులెందుకు?

కూడు లేనివాడికి కూడు
కూలిలేని వానికి కూలి దొరకడం అభివృద్ధికాని
నోటి లెక్కల మాయమాటలు అభివృద్ధి కాదు
అడవి సంపదను
బహుళజాతి కార్పొరేట్ కంపెనీలకు
ధారాదత్తం చేయడం అభివృద్ధి కాదు

అభివృద్ధి పేరిట అఘాయిత్యాలు
సహాయం చేసినట్టు అకృత్యాలు
ఒక దుశ్చర్య
ఒక దుర్నీతి
మేధావులారా!
అక్షరాలున్నది ఆడుకోడానికి కాదు
ఫజీల్లు నింపుకోడానికీ కాదు
అక్షరాల్లో అనంత శక్తి ఉన్నదని నమ్మినవాళ్ళం
ఆ జనం చావద్దని శాసనం చేద్దాం!
చావడానికి కారకులైన వారి మీద
కత్తిగట్టి
వాళ్ళ కంఠాలు మూగ పోయేట్టు
మన కలాలతో గొంతెత్తుదాం!!

# మమ్మల్ని కొంచెం ఆలోచించుకోనివ్వండి

*హిందీ కవిత: నిర్మలాపుతుల్*
*తెలుగు సేత: ఆర్. శాంత సుందరి*

మా అభివృద్ధికి అర్థం
మా గూడేలను కూల్చి కార్ఖానాలను నిర్మించడమే అయితే
చెరువులను పూడ్చేసి రాజ మార్గాలు వెయ్యడం
అడవుల్ని నరికేసి ఆఫీసులు కట్టడమే అయితే
ఇక పునర్నివాసాల పేరుతో
మమ్మల్ని మా ఊరి పొలిమేరల బైటికి
తరిమెయ్యడం మా మంచికి అని అంటే
మీ అభివృద్ధి ప్రధాన స్రవంతిలో
కలిసే ముందు
లక్షసార్లు ఆలోచించుకోవాలి మేము
మా గుడిసె బదులు మీ ఇళ్ళని స్వీకరించే ముందు
మీ ప్రతిపాదనలన్నిటినీ తరచి చూడాలి
మీరు నచ్చజెప్పే పద్ధతులతోబాటు
అర్థం కానివన్నీ అర్థం చేసుకోవాలి.
మీరు రోడ్డు వేస్తున్నది
నా ఊరిని ప్రధాన రహదారితో కలిపేందుకా
లేక మీరు నా ఊరిదాకా వచ్చేందుకా
అనేది నాకు తెలియాలి
మీ ఉద్దేశం
మాకు మార్కెట్టు అందుబాటులో ఉండేట్టు చెయ్యడమా
లేక మార్కెట్టు మాదాకా వచ్చేందుకు దారి వెయ్యడమా?
మా రాళ్ళని మాచేతే పగలగొట్టించడం
నగరానికి తరలించడం కోసమా
లేక ఒక కొత్త గని ఏదైనా ఉండవచ్చున్న ఆశతోనా?
మా అడవుల్లోని చెట్ల మీదా, ఊళ్ళోని ఆడ పిల్లల మీదా
పడిందా మీ కన్ను?
ఇవన్నీ స్పష్టంగా తెలుసుకోవాలి మేము.
నిజంగా మీరు మా అభివృద్ధి కోరుతున్నారా అన్నది
నాకు అనుమానమే
మీ మాటల అర్థాలని మాకు విడమర్చి చెప్పే
మీ చమ్చాల వికాసం కోసం కాని కాదు కదా?
నాకు తెలుసు
అసమ్మతి చాలా చేదుగా ఉంటుంది
మీ శత్రువుల జాబితాలో మరో పేరు చేరుతుంది
మీరు వాదిస్తారు... తర్కిస్తారు
మా వాళ్ళకీ నా మీద చాడీలు చెబుతారు
వాళ్ళ అభివృద్ధికి అడ్డుపడుతున్నానంటారు
వాళ్ళని
అనాగరికంగా వెనకబడి జంగ్లీల్లాగా ఉంచడమే
మా ఉద్దేశమని నమ్మిస్తారు
నాకు తెలుసు
మాటిమాటికీ అభివృద్ధి చెందినా దేశాల గురించీ
అక్కడి ప్రజల గురించీ
చెబుతారు వాళ్ళకి
వాళ్ళతో పోలిస్తే మేమెంత వెనకబడి ఉన్నామో
ఎదురుగా నిలబెట్టి మరీ నూరి పోస్తారు
కానీ
మా జీవితాల్లో అభివృద్ధి తేవడానికి
మీరు పెట్టే షరతుల గురించి మాత్రం
ఒక్క ముక్క చెప్పరు
చందమామని చూపించినట్లు చూపిస్తారు మీరు
అభివృద్ధి మాడల్ని
అందులోని ఎత్తు పల్లాల గురించీ, పరాన్న జీవనం గురించి మాత్రం
ప్రస్తావన ఉండదు మీ మాటల్లో
ఈ అభివృద్ధి మాడల్ వెనక
పని చేసే చురుకైన మెదడు ఎవరిదో
చెప్పకుండా దాస్తారని నాకు తెలుసు
అభివృద్ధి చెందిన దేశాల గురించీ
ఆ దేశ ప్రజల గురించి
రహస్యాలెన్నో దాస్తారని కూడా నాకు తెలుసు
మీ ద్వారానే మా నుంచి మా వనరులన్నిటినీ దోచుకుని
వాళ్ళు అభివృద్ధి శిఖరాలకి ఎలా చేరుకున్నారో తెలుసు
నాకంతా తెలుసు
క్షమించండి
పాట్నా, రాంచీ, ఢిల్లీ నుంచి తయారుచేసి మా కోసం తీసుకొచ్చిన
మీ అభివృద్ధి ప్రస్తావనని నిరాకరిస్తున్నాను!



కథ

# బాల గెరిల్లాలు

- యామిని

'ఒరేయ్ బచ్చు! ఇటు రారా!' వంటింట్లో నుంచి అమ్మ పిలుపు. 'ఆcc...' అంటూ అమ్మ పిలుపులు వినిపించుకోకుండా దూరంగా వస్తున్న దళాన్ని చూస్తూ తుర్రుమంటూ పరుగెత్తాడు బచ్చు.

'వడెప్పుడూ ఇంతే, అస్సలు మాటకందడంటూ' పొయ్యిలో మంట రాజేసి బయటవున్న నీళ్ళగిన్నె తీసుకురావడానికి వస్తూ గుమ్మంలో నిలబడే దూరంగా వస్తున్న దళాన్ని చూస్తూ ఉంది.

బచ్చు చురుకైన పిల్లవాడు 9 సంవత్సరాలు ఉంటాయోమో. 5వ తరగతి చదువుతున్నాడు. చదువులోనూ, ఆటల్లోనూ, పాటల్లోనూ హుషారే. పార్టీ అంటే అమితమైన ప్రాణం. దళం గ్రామానికి వచ్చిందంటే చాలు బడికి ఎగనామం పెట్టేసి అన్ని రోజులూ దళం దగ్గరే ఉండిపోతాడు. తన చిన్ని కంఠంతో పాటలు పాడుతుంటే ఇంత చిన్ని గొంతు ఆ రాగాలను ఎలా పలుకుతుందా? అని ఆశ్చర్యమేస్తుంది. ఎప్పుడూ తన చుట్టూ నలుగురు స్నేహితులతో కనపడుతుంటాడు.

ఏడు మందితో కూడిన దళం ఆ గ్రామానికి వస్తుంది. దానికి కమాండర్ నిర్మల. మంచి కలివిడి కలిగి ఎవర్నైనా ఇట్టే కలుపుకునే మనస్తత్వం. మిగతా కామ్రేడ్స్ మున్నాల్, భీయాల్, చందు, లక్ష్మి, సగ్గొంతి, బద్రులు కూడా ఈమెకేమీ తీసిపోనట్టుంటారు. మున్నాలైతే మరీనూ. ఈ ఊరివాడే కావడం వల్ల పిల్లకాయలందర్నీ వెంటేసుకొని వారికి చదువు, ఆట పాట నేర్పిస్తూ ఉంటాడు. నిర్మల దారిలో ఎవరో కలిస్తే మాట్లాడుతూ వస్తుంది. మున్నాల్ ముందు దారి తీస్తుండటంతో మున్నాల్‌ను గుర్తు పట్టిన బచ్చు గబుక్కున వచ్చి దళాన్ని లాల్‌సలామ్‌తో నిలబెట్టాడు.

'ఏరా! బచ్చు, ఎలా ఉన్నావ్?' మున్నాల్.

(మున్నాల్ వాళ్ళ కుటుంబంవాడే కావటంతో అప్పుడప్పుడు'రా' అని సంభోదిస్తుంటాడు.)

'మంచిగానే.....' తన తొర్రి పళ్ళతో కిలకిలనవ్వుతూ ఒకచేత్తో నిక్కరు పైకి దోపుకుంటూ చేతులు కలుపుతున్నాడు.

'ఏం బచ్చు? అంతా మంచేనా? మరి మేము అదుగో... ఆ పెద్ద చెట్టు దగ్గర ఉంటాంగానీ నీవెళ్ళి లచ్చుమన్ దాదాను పిలుచుకురా! ఆc ... అలాగే నీ దోస్తులను కూడా తీసుకురా!' నిర్మల.

'అలాగే!' అంటూ అక్కడ్నుంచి తుర్రున వెళ్ళిపోయాడు.

దళం చాలా దూరం నుంచి వస్తుండటంతో 'హమ్మయ్య' అనుకుంటూ కిట్లు దించుకున్నారు. నిర్మల రోల్‌కాల్ చేసి కవర్స్ చూపించి ఆ రోజు వర్కు గురించి మాట్లాడింది. బాగా అలసిపోయి ఉండటంతో టీ పెట్టడానికి అందరూ సిద్ధమవుతున్నారు. బచ్చు వెళ్ళి 10 నిమిషాలు కూడా కాలేదు. తన దోస్తులు జాగో, రామసింహ, రణోతి, లచ్చుమన్ దాదాలతో వస్తున్నాడు. దాదా ముందు నడుస్తుంటే నలుగురూ వెనుక మాట్లాడుకుంటూ, మధ్యమధ్యలో కిసుక్కున నవ్వుకుంటూ వస్తున్నారు.

అందులో జాగో, రణోతిలకు 7, 8 సంవత్సరాలు ఉంటాయేమో. నూనె లేకపోయినా నీటుగా దువ్విన తలతో, మోకాళ్ళ వరకు ఉన్న లంగాలతో ఉంటే, రామసింహ్ గుండీలులేని చొక్కాను పట్టుకొని అమాయకపు చూపులతో, ఒకింత సిగ్గుతో చేతులు కలుపుతూ దగ్గరికి వచ్చారు.

'ఏం జాగో? రోజూ ఎక్కడికెళ్తున్నావ్?' మున్నాల్.

'ఎద్దులు మేపటానికి' గొంతు నుండి బయటకు రాని సమాధానం ఇచ్చింది జాగో.

'రణోతి నువ్వో?'

మరింత సిగ్గుపడుతూ, తలను నేలకు వాల్చి కాలి బొటనవేలితో నేలను గీరుతూ పక్కనున్న వారిని చూస్తూ చెప్పాలా? వద్దా? అని సందేహిస్తుండగా, 'అర్రె... రణోతి చెప్పటం లేదు, ఏంటి స్కూల్ కెళుతున్నావా?' 'ఊహుcc... అమ్మా, నాన్నలతో చేనుకు వెళ్ళి అక్కడ బుడ్డ చెల్లిని ఆడిస్తున్నాను' రణోతి.

'అమ్మో!' ఇంకేం పెద్దదానివైపోయావన్న మాట.

అందరూ ఒకేసారి నవ్వుందించుకున్నారు.

'ఏరా! రామసింహ్ మరి నువ్వో?'

నవ్వుతూ.... 'నేనా చేలో పిట్టలు కంకులు తినకుండా కాపలాకి వెళ్తున్నా.'

'అయితే మీలో ఒక్కడేనా, స్కూల్‌కెళుతుంది. అరే! ఎట్లారా? మనం కనీసం 5 వరకన్నా చదువుకోవాలిరా! అప్పుడే మనకు చదవటం, రాయటం వస్తుంది. ఇప్పుడు చూడండి నన్ను. ఇంటి దగ్గర ఉన్నప్పుడు బడికి ఎగనామం పెట్టేవాణ్ణి. ఎప్పుడు ఇలా... ఎంత కష్టపడుతున్నానో' అంటూ తన వచ్చిరానీ రాతలను చూపిస్తుంటే అందరూ ఆ రాతలను ఆసక్తిగా చూస్తున్నారు.

నిజమే, మరి బడికి వెళ్ళాలనే తపన ఉన్నా ఇళ్ళల్లో ఉన్న సమస్యలు కట్టిపడేస్తున్నాయ్. బాల్య దశ నుంచే బాధ్యతలను మీదేసుకోవాల్సిన పరిస్థితులు రావటం, ప్రభుత్వాలు నిరక్షరాస్యత గురించి మాట్లాడుతాయి గానీ దాని నివారణ చర్యలు చేపట్టదు. ప్రభుత్వాలు దీనిమీద శ్రద్ధ పెడితే పలకా, బలపం పట్టుకున్న పిల్లలే మనకు కనిపిస్తారు.

'మరి రోజూ రేడియోలో వార్తలు వింటున్నారా?'

'ఊcc....' అందరూ ముక్త కంఠంతో అన్నారు.

'నిన్న మన వాళ్ళు చేసిన అంబుష్‌లో నలుగురు పిసిలు చచ్చారు కదన్నా.'

'ఓ... అయితే విన్నారన్నమాట. మంచిది. రోజూ రేడియో వినటం వలన ఎక్కడెక్కడో జరుగుతున్న మనఘటనలు తెలుస్తాయి. కొత్త, కొత్త విషయాలు కూడా అర్థమవుతాయి. ఇంతకుముందే చాలాసార్లు బాలల సంఘం గురించి మీతో మాట్లాడాను. గుర్తుందా? అయితే సరే! ఇప్పుడు అది పెట్టుకుందాం. అందుకని మీకు తోడుగా ఇంకా ముగ్గుర్ని తీసుకువస్తే నిర్మాణం చేద్దాం. 'ఏం బచ్చు?' అంటూ తనకు తెలిసిన రిపోర్టును బట్టి మెదక్ జిల్లాలో 'యాదగిరి' అనే 9 సంవత్సరాల చిచ్చర పిడుగు ఎలా

పని చేసిందీ చెప్పుకుపోతుంటే అందరూ ఆసక్తిగా వింటూ మధ్య మధ్యలో గుడ్లు మిటకరిస్తున్నారు.

మున్నాల్‌కు చిన్న పిల్లలుంటే బాగా ఇష్టం. పిల్లలు కూడా మున్నాల్‌ను బాగా ప్రేమిస్తారు. బాలల సంఘం నుంచే పనిచేస్తూ క్రమంగా పార్టీలోకి వచ్చాడు. అందుకే పిల్లలు అంతా అభిమానిస్తారు.

* * *

సాయంత్రమయింది. ఆకాశమంతా నీలం రంగులోకి మారిపోయింది. వర్షం వచ్చేలాగా ఉంది. పైరగాలి అమాంతం వచ్చి చెవులను తాకుతుంటే... ఆహాఁ.... గంగ పైరగాలికి తన పసుపు పచ్చని పూలతో నాట్యమాడుతుంది. ఆ చల్లని సాయంత్రం వేళలో చిక్కని టీతో మనసుకు స్వాగతం పలుకుతున్నారు. చిచ్చర పిడుగులు టీ తాగి సమష్టి అధ్యయనానికి వెళ్ళిపోయారు. నిర్మల గ్రామం నుంచి వచ్చిన వాళ్ళతో మాట్లాడుతుంది.

రాత్రి 8 గంటలు అయింది. భోజనాల సమయం. అన్నం తింటూ, 'ఏం బచ్చు, మున్నాల్ మాట్లాడాడా?' నిర్మల.

'నవ్వు......'

'మరయితే సంఘం పెట్టటమే లేటన్న మాట, అవును ఇప్పటికే చాలాసార్లు వాయిదా పడింది' నిర్మల.

'నిజంగా' జాగో.

'నిజమే జాగో! మీకు తోడు ఇంకొక ఇద్దరు వున్నారు కదా! వాళ్ళ పేర్లు ఎంటబ్బా!.... ఆఁ...... లచ్చి, లక్కు వాళ్ళిద్దర్ని కూడా తీసుకురండి!' నిర్మల.

అలా మాట్లాడుకుంటూ అన్నం తిని పడుకోవటానికి ఎవరి దేరాకు వాళ్ళు వెళ్ళిపోయారు. జాగో, రణోతిలు లక్ష్మి దగ్గరకు, బచ్చు, రామసింహలు మున్నాల్ దగ్గరకు వెళ్ళి పడుకున్నారు. పడుకున్నారేగానీ మాట్లాడకుండా ఉంటే కదా! సమయం 10 గంటలు అయింది. సెంట్రీ నుంచి పడుకోండని కాషన్ వచ్చింది. కాషన్ వచ్చిందని ఇంకా నెమ్మదిగా, గుసగుసగా మాట్లాడుకుంటూ కుసుక్కున నవ్వుతున్నారు.

అలా..... అలా..... మాట్లాడుకుంటూ ఎప్పటికో నిద్రపోయారు కానీ బచ్చుకు నిద్రరావటం లేదు. పరిసరాలన్నీ ప్రశాంతంగా ఉన్నాయి. కింద సూది పడితే వినిపించేంత నిశ్శబ్దం, చిక్కని చీకటి..... బచ్చు పడుకునే ఆకాశం కేసి చూశాడు. నల్లని ఆకాశంలో తెల్ల, తెల్లని నక్షత్రాలు మిణుకు మిణుకు మెరుస్తూ ఉన్నాయి. ఎటు చూసినా నక్షత్రాలే. లెక్కపెడదామని మొదలుపెట్టి చూస్తే...... 1, 2, 3, 4, 5 ............ అలా లెక్క పెడుతూనే ఉన్నాడు. ఊహుఁ.... పూర్తయితేనా? అసలు ఇన్నీ ఎక్కడి నుంచి వచ్చాయబ్బా! చూస్తుంటే మీదరాలి పడతాయేమో..... ఊహు....... అన్నీ చిన్న చిన్నవే...... మాలాగే....... తెల్లగా, స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాయ్ మా పార్టీలాగానే...... అనుకుంటూ నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారు జాము నాలుగు గంటలయింది. సెంట్రీ వచ్చి మున్నాల్‌ను లేపుతుంటే పక్కనున్న బచ్చు ఉలిక్కిపడి లేచాడు.

'ఏంటి, బచ్చు, అప్పుడే లేచావ్?' సెంట్రీ.

'తెల్లారిందనుకున్నా'.

'ఇంకా టైముందిలే, పడుకో'.

'మున్నాల్ సెంట్రీకెళ్ళాడు. కానీ బచ్చుకు నిద్రరావటం లేదు. ఎప్పుడు తెలవారుతుందా? ఎప్పుడు తనదోస్తులను తీసుకువద్దామా.... అయినా పొద్దునే వెళ్తేనే దొరుకుతారు. లేదంటే తమ చిన్ని చిన్ని బాధ్యతల్లోకి వెళ్ళిపోతారనుకుంటుండగానే ఐదు గంటలయింది. అప్పుడే ఒక్కొక్కళ్ళు లేస్తున్నారు. నిర్మల రోల్‌కాల్‌కు సిద్ధమవుతూ బచ్చు హుషారును గమనించి.

'ఏం బచ్చు, అప్పుడే లేచావా? మరి నీ దోస్తులను తీసుకొస్తావా!' అంటే, రామసింహను వెంటేసుకొని కాళ్ళకు పరుగు అందించాడు.

'అరేయ్! పడతారురా, కాస్త నిదానంగా వెళ్ళండంటుండగానే కనుచూపు మేర దాటిపోయారు.

10 నిముషాలు అవ్వకముందే ముగ్గుర్ని వెంటేసుకుని వచ్చారు. రావటంతోనే మున్నాల్ దగ్గరకు వచ్చి నవ్వు ముఖంతోనే చూపించాడు. వాళ్ళల్లో లక్కు, లచ్చి, సోనులు నవ్వు ముఖంతో నిలబడ్డారు.

అందరికీ చేతులు కలుపుతుంటే నిర్మల తదేకంగా వారినే చూస్తోంది. ఎంత అమాయకపు పిల్లలు వీరు. పార్టీ వచ్చిందంటే చాలు, పరుగెత్తుకుంటూ వస్తారు, అందరూ పేదరికం నుంచి వచ్చినవారే. పెద్ద, పెద్ద మాటలైన 'సిద్ధాంతం', 'రాజకీయాలు' అంటే అసలు తెలియవు. వారికి తెలిసిందల్లా ఒక్కటే. పార్టీ ప్రజలకోసం పని చేస్తుంది; సియాన్‌ల పెత్తనాన్ని కంట్రోలు చేస్తుందని. అంతే, దీంతోనే వారు పార్టీ వచ్చిందంటే స్కూల్, ఇళ్ళల్లో పనులు వదిలేసి దళం దగ్గరే ఉండిపోతారు. ఉన్న వాళ్ళల్లో లచ్చి మరీ పిల్ల. చురుకైనది కూడా. పిల్లి కళ్ళతో నవ్వితే బుగ్గల మీద సొట్టలు పడి మరీ అందంగా ఉంటుంది. వీళ్ళ గురించి ఆలోచిస్తున్న నిర్మల 'లాల్ సలామ్'తో ఈ లోకంలోకి వచ్చింది.

'ఆఁ..... లాల్‌సలామ్, మరి కూర్చుందామా ఇక'.

'ఓఁ......' నవ్వుతూ.

అందరూ పాలిథీన్ వేసుకొని రౌండ్‌గా కూర్చుని ఒక పక్క ఖాళీ ఉంచారు. కూర్చున్నారే గానీ నవ్వకుండా ఉంటేగా? లచ్చి, జాగో, రణోతిలు మూతికి చేయి అడ్డం పెట్టుకుని నవ్వుతున్నారు. విడి విడి సందర్భాల్లో ఎంతసేపైనా మాట్లాడుతారు గానీ మీటింగ్ వాతావరణం వచ్చేసరికి అమ్మో! పై ప్రాణాలు పైనే పోయేటట్టుంటాయి. నిర్మల వచ్చి బాలల సంఘం ఆవశ్యకత,పని విధానం గురించి అర్థం చేయించింది. మధ్యలో మున్నాల్ పిల్లల మీద పాట, అమరుల పాటలు పాడుతుంటే పిల్లలంతా వంత పలికారు.

'మరి ఈ సంఘానికి బాధ్యుడు ఎవరుంటే బాగుంటుందో' నిర్మల.

చూపులన్నీ బచ్చుకే సారించాయి. 'ఏరా! మరి బాధ్యుడెవరంటే?' మున్నాల్.

నిదానంగా, మెల్లిగా లో గొంతుతో 'బచ్చు' అని చెప్పింది. లచ్చి. లచ్చితో పాటే అందరూ గొంతులు కలిపారు. 'ఏం బచ్చు' అంటే మెలికలు తిరిగిపోతూ తొర్రిపళ్ళతో నవ్వుతున్నాడు. అసలే ముందు పళ్ళు లేకపోవడంతో నవ్వుతుంటే పళ్ళ సందులు కనిపించి అందరికీ నవ్వు తెప్పిస్తున్నాయి.

సంఘ బాధ్యుడిగా బచ్చు ఎన్నికైనాడు. సంఘ కర్తవ్యాలు ముఖ్యంగా శత్రు సమాచారం సేకరించటం, అలాగే చదువుకోవటం, చదువు చెప్పించుకోవటం, పరిశుభ్రతగా ఉండడం, మీలాంటి చిన్న పిల్లలను తయారుచేయటం..... మున్నాల్ మాట్లాడుతున్నంత సేపు శ్రద్ధగా వింటూ గుడ్లప్పగించి చూస్తున్నారు. లచ్చి అయితే మరీ ఒద్దికగా కూర్చొని మోకాళ్ళ మీద చేతులు పెట్టుకొని మధ్య మధ్యలో గాలికి మొఖం మీదకు వస్తున్న వెంట్రుకలను సర్దుకుంటూ వింటున్నది.

'ఏంటి, మరి రిపోర్టు సేకరిస్తారు కదూ!' మున్నాల్.

'ఓ..... సేకరిస్తాం' అందరూ.

అప్పటికే సూర్యుడు నడినెత్తి మీదకొస్తున్నాడు. ఎండ సుర్రుమంటున్నది. పైన ఎండ వేడిమి, లోపల ఎలుకల పరుగు. వీళ్ళ పరిస్థితి గమనించి నిర్మల 'ఇంకా చాలిద్దాము, అన్నం మనకోసం ఎదురుచూస్తుంది. తినకపోతే బాధ పడుతుందంటూ' లేచింది.

సాయంత్రం నాలుగు గంటలు అవుతుండగా అందరూ లాల్ సలామ్‌లతో విడిపోయారు.

* * *

దళం ఆ గ్రామానికి వచ్చినప్పుడల్లా గ్రామంలో ఉన్న శత్రువు పరిస్థితి గురించి రిపోర్టు తీసుకొచ్చేవారు. దళం చెప్పే విషయాలను శ్రద్ధగా వినేవారు. అలా నెలరోజులు గడిచిపోయాయి.

ప్లీనం ఏర్పాట్లలో భాగంగా 50 మందిమి కలిసి ఉన్నాము. ఒకరోజు ఉదయం తెల్లవారుజామున అప్పటికే అందరూ లేవలేదు. ఒక్కక్కరే లేస్తున్నారు. బచ్చు, లక్కు హడావిడిగా పరుగెత్తుకుంటూ డేరా దగ్గరకు వచ్చారు. ఇంత పొద్దునే హడావిడిగా వస్తున్నారని ఎదురువెళ్ళి 'ఏంటి, విషయం' అనబోయేంతలో 'పోలీసులు వచ్చారు. చాలా మంది ఉన్నారు. ఇద్దర్ని పట్టుకున్నారు. ఇప్పుడే ఈ అడవివైపు వస్తుంటే చూసి మేము వారి వెనుకనుండే ఇటు వచ్చాం' బచ్చు.

'ఎంతమంది ఉన్నారు? ఎటు నుండి వచ్చారు? 'క్యాంపు బాధ్యుడు. 'చాలా మందే ఉన్నారు, కనీసం 60 మంది ఉంటారేమో.

* * *

ఊరి నుంచి వచ్చినట్టున్నారు. రాత్రి అడవిలో పడుకొని తెల్లవారుతుండగా వచ్చినట్టున్నారు. అందరి దగ్గర ఎకెలు, ఎస్ఎల్ఆర్, ఇన్‌సాస్‌లున్నాయి.

'మరయితే మీరు వాళ్ళు ఎటువైపు నుంచి వస్తున్నారో, ఎక్కడ డేరా వేస్తున్నారో చూసిరండి. ఏ మాత్రం మీరు వారికి అనుమానం వచ్చే విధంగా ఉండొద్దు' క్యాంపు బాధ్యుడు.

'ఊcc.....' అంటూ వెళ్ళిపోయారు.

బచ్చు తను వేసుకున్న షర్టు తీసి గునియాల్ పట్టుకున్నాడు. లక్కు ఎంద్రకాయలు పట్టేవాడిలాగా ఆకులతో చిన్న డొప్ప తయారుచేసుకుని దారిలో దొరికిన ఒకటి, రెండు ఎంద్రకాయలను డొప్పలో వేసుకున్నాడు.

పోలీసులు మామిడి చెట్టు దగ్గర డేరా వేస్తున్నారు. ఛాయ్ పెట్టుకోవటానికి పొయ్యిరాళ్ళు తెస్తున్నారు. చెట్టు దగ్గరే ఒక వాగు ప్రవహిస్తూ ఉంది. లక్కు వాగు దగ్గరికెళ్ళి ఎంద్రకాయలు ఒకటి రెండూ పడుతూ తలపైకెత్తి చెట్టు దగ్గర 'ఎంతమంది వున్నారు?' 'ఏయే' తుపాకులున్నాయి? మనసులో లెక్కించుకుంటూ, వాళ్ళు చూసినప్పుడు 'అరే! తప్పించుకుపోయిందంటున్నాడు. లక్కును చూసిన పోలీసులు వాళ్ళ పనుల్లో వాళ్ళు వున్నారు గానీ లక్కును అస్సలు పట్టించుకోలేదు.

బచ్చు గునియాల్ పట్టుకొని సమాచారం కోసం వెళ్తుండగా లచ్చి చిన్న నీళ్ళగిన్నె తీసుకొని ఎదురుపడింది.

'ఏంటి లక్కి, మనవాళ్ళు ఎక్కడ?' అంటే,

'అcc.... రుగోల..... అంటూ దూరంగా ఉన్న తన దోస్తులను చూపించింది. బచ్చు వాళ్ళందర్ని కలసి మాట్లాడుతుండగా లక్కు ఎంద్రకాయల డొప్పతో కలిశాడు. 'ఎంతమంది ఉన్నారు? తుపాకులు, సెంట్రీ పరిస్థితి...... పూర్తి వివరాలు లక్కు చెప్పటంతో బచ్చు, రామసింహను తీసుకొని దళం దగ్గరకు వస్తున్నాడు.

ఇక్కడ దళం దగ్గర సామాన్లు సర్దేసి రిపోర్టుకోసం ఎదురుచూస్తున్నారు. చుట్టూ తిరిగి దళం దగ్గరకు చేరుకున్నారు. బచ్చు, రామసింహలు రావటంతోనే 'దాదా! మరక మర (మామిడిచెట్టు) దగ్గరైతే డేరా వేసేటట్లు లేరు. టీ పెట్టుకొని తాగారు. బయల్దేరటానికి సర్దుకుంటున్నారు. బహుశా మన సెంట్రీకి ముందు ఉన్నదారికి వచ్చేటట్టున్నారు. లక్కును అక్కడే పెట్టి వచ్చారు. వాడు బయల్దేరితే మన దగ్గరకు వస్తాడంటుండగా' లక్కు రానే వచ్చాడు.

'రొప్పుకుంటూ వచ్చి దాదా! వాళ్ళు బయల్దేరారు, అదిగో మనం నీళ్ళు తెచ్చే చెలిమ దగ్గరున్న పిల్లదారికి వస్తున్నారు అన్నాడు' లక్కు

అక్కడున్న బాధ్యులు వెంటనే ఒక టీమ్‌ను ఫైరింగ్ కోసం పంపించారు. వాడు మూడు ప్లాటూన్‌లతో వస్తున్నాడు. రెండు ప్లాటూన్‌లు ముందుకు వెళ్ళిపోయాయి. చివరి పిఎల్ వరిచేల గట్టు మీద నుంచి వెళ్తుంది. ఈ చివరి దానిపై ఫైరింగ్ చేయటానికి అనుకూలంగా ఉంది. మనవాళ్ళు ఫైరింగ్ ఓపెన్ చేశారు. ఊహించని విధంగా ఫైరింగ్ వచ్చేటప్పటికీ గందరగోళానికి గురై ఒకళ్ళ మీద ఒకళ్ళు ఆ బురద నీళ్ళల్లో పడ్డారు. బురద నీళ్ళల్లో పడేటప్పటికీ మొత్తం మొఖం, తుపాకులు కూడా బురద, బురద. ఏం చేయాలో అర్థం కానీ పరిస్థితి ఎదురైంది. ఫైరింగ్ శబ్దం విన్న ముందు ఉన్న రెండు పిఎల్‌లు అటు నుంచి అటే పరుగెత్తారు. చివరి పిఎల్‌లో ఉన్నవాడు మద్దతు రమ్మంటూ వాకీలో మొత్తుకుంటున్నాడు. వాడు ఎంత మొత్తుకున్నా 'బతికి పోయాం బాబాయ్!' అంటూ ముందుకే పరుగెత్తారు. ఇక చేసేదేమీ లేక గుడ్డిలో మెల్లగా ఫైరింగ్ చేస్తున్నారు. ఒకడైతే పెద్దగా అరుస్తున్నాడు. ఒకడైతే గావుకేకలు పెడుతున్నాడు. ఎవరి అరుపులు వారివే. ఒకళ్ళదొకళ్ళు వినిపించుకునే పరిస్థితి లేదు భయం, భయంతో ఉండుండి షెల్స్ వేస్తున్నాడు ఒకడు. అస్సలుకే సమన్వయం లేదు. బురదలో పడుకున్నవారు లేస్తే ఒట్టు. బాగా భయపడుతూ పరుగెత్తటం మొదలుపెట్టారు. పరుగెత్తేటప్పుడు బూట్లు బురదతో నిండి ఉండటంతో అంత బరువుగా ఉన్న బూట్లను మోయలేక పడుతూ, లేస్తూ...... పడుతూ, లేస్తూ పరుగెత్తుతుంటే, ఒకడైతే బురదలో పడిన బూటును కూడా తీసుకోకుండా ఒక బూటుతోనే 'బతుకు జీవుడా!' అంటూ పరుగెత్తుతున్నాడు. చూడ్డానికి మంచి మంచి తుపాకులు ఉన్నా మన గెరిల్లాల ఫైరింగ్ ముందు అంతా 'తుస్సే'.

వాడు వేసిన షెల్ ఒకటి మన కిచెన్ దగ్గర పడటంతో డేరాలో ఉన్న కొద్ది మందిమి డేరా ఖాళీ చేసి 1/2 గంట దూరం ఇవతలికి వచ్చి ఆగాము. ఒక గంట తర్వాత ఫైరింగ్ చేయటానికి వెళ్ళిన టీమ్ మాతో కలిసింది. అప్పటికే పోలీసులు వెళ్ళిపోయారు. ముందు వెళ్ళిన రెండు టీమ్‌లపై మన ఇంకొక టీమ్‌పై ఫైర్ చేసిన శబ్దం వినవచ్చింది.

రెండు గంటలు తర్వాత ఖాళీ చేసిన డేరా దగ్గరకు నిర్మల టీమ్ వెళ్ళింది. మన టీమ్ అక్కడికి వెళ్ళేటప్పటికే బచ్చు బ్యాచీ సామానుకు కాపలా వున్నారు. కిచెన్ దగ్గర ఇద్దరు బచ్చు, సెంట్రీ ప్లేస్ దగ్గర లక్కి, రామసింహ్ వీరికితోడు కుక్క ఏ మాత్రం అలికిడి అయినా కళ్ళను చురుగ్గా తిప్పుతూ..... చిన్న శబ్దం వస్తే చాలు మొరిగే కుక్కలు సైతం అలికిడి, వాసన గమనించగానే చెవులన్నీ నిక్కబొడిచి, తోకను పైకి లేపి, మొఖం ముందుకు సాచి మరీ రెప్పార్పకుండా చూస్తున్నాయి. కొంచెం కదలికలు కనిపించటంతో 'ఎవరు?' గద్దించాడు బచ్చు.

'ఎవరా ఈ పిల్లగొంతు? అనుకుంటూ, గొంతును గుర్తు పట్టి 'అc c...... మేమే' అంటూ వారి దగ్గరకు వెళ్ళింది నిర్మల టీమ్. మనం

కథ

# కుక్క

- పి. వరలక్ష్మి

ఆదివారం ఉదయం బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది. చలి ముదిరేకాలం కావటంతో ఎంతకూ చీకట్లు విచ్చుకోలేదు. ఎనిమిది కావస్తున్నా నిద్రమంచం దిగడానికి మనసొప్పని బద్ధకాన్ని మనసారా ఆస్వాదిస్తున్నారు మగవాళ్ళు. రోజూ ఉండే పనే అయినా పరుగులు పెట్టకుండా నింపాదిగా కదులుతున్నారు ఇళ్ళాళ్ళు. పిల్లలు మాత్రం ఎప్పుడో లేచి ఆటలకు తయారైపోయారు. స్కూళ్ళు లేకుంటేనే తొందరగా లేవబుద్ధౌతాది వెధవలకు అని పెద్దవాళ్ళు విసుక్కుంటున్నారు.

వీధి చివర పిల్లసైన్యం సమావేశమైంది. జట్లు జట్లుగా ఎవరి ఆటల్లోకి వాళ్ళు దిగిపోయారు. ఒక గుంపు కాస్త దూరంగా పోయింది. మూడు కర్రలు పాతారో లేదో ఎక్కడి నుండో సన్నగా ఒక వింత శబ్దం వినపడసాగింది.

'బాబోయ్ దెయ్యం'

బాలూ, బ్యాటూ పడేసి పరిగెత్తబోతుంటే ఒక పిల్లవాడు అటునుండే పరిగెత్తుకుంటూ వచ్చి 'అక్కడెవరో ఏడుస్తున్నార్రా' అని ప్రకటించేశాడు. వాళ్ళు పెద్దవాళ్ళు కాదు కదా. పోవాలో వద్దో నిర్ణయించుకోడానికి ఎక్కువ సమయం పట్టలేదు. రెండు నిమిషాల్లో శబ్దం వస్తున్నవైపుకు పరిగెత్తారు.

తుప్పల్లో నుంచి ఏదో మూలుగు వినిపిస్తోంది. క్షణాల్లో పదిపదైదు మంది పిల్లల గుంపు బిలబిలా పోగయ్యారు. కంపచెట్ల మధ్యలో ఉండలా చుట్టుకొని ఒక జీవి పడి ఉంది.

'కుక్కపిల్ల'

'కుక్కపిల్ల కాదు, కుక్కే'

నిజానికి దాని వయసు కుక్కపిల్లకూ, కుక్కకు మధ్యలో ఉంటుంది. ఇంగ్లిషులో చెప్పాలంటే పప్పీకీ, డాగ్‌కీ మధ్యలో. నలుపు, అక్కడక్కడా గోధుమరంగు కలిసిపోయిన దాని చర్మం అనేకచోట్ల దోక్కుపోయి ఎర్రగా కమిలిపోయి ఉంది. రక్తంకారి గడ్డగట్టుకు పోయిన చెవి ఎడమవైపు వేలాడుతోంది.

'ఇది రోజూ మన వీధిలో తిరిగే కుక్కేరా, పాపం ఏదో గుద్దేసింటాది. దెబ్బలు బాగా తగిలినాయ్'

ఒక పిల్లవాడు దాన్ని పోల్చుకున్నాడు.

'అవును. నిన్న మా మమ్మీ చెప్తే దానికి నేనే అన్నం పెట్టినా' అంది రెండు జడల అమ్మాయి.

'మా ఇంటి దగ్గరే మొరుగుతా ఉంటే ఎవరో కొట్టినారు. అది కుయ్యో, కుయ్యో అని చానా సేపు మొరిగింది. వాళ్ళలో కాస్త పెద్ద పిల్లవాడు చెప్పుకొచ్చారు.

ఆ పిల్లవాడు చెప్పింది నిజమే. పోయిన రాత్రి జనం కేబుల్ టీవిలు కట్టేసి నిద్రకుపక్రమించే సమయమది. ఆ వీధిలో అక్కడక్కడా మిగిలిపోయి పడేసిన అన్నం తిని చలికి ఉండచుట్టుకొని పడుకుందా కుక్క. తల్లిపాలు మానేసింతర్వాత ఆ వీధిలోకి ఎలాగో వచ్చి పడింది. అదే దాని ప్రపంచం అయింది. అది ఎదిగే కొద్దీ తిన్న అన్నానికి విశ్వాసం చూపించడం మొదలుపెట్టింది. కొత్తవాళ్ళని చూస్తే మొరగడం, ఈ మధ్య వెంటపడటం కూడా నేర్చుకుంది. అదే దాని చావుకొచ్చింది.

వంకరగా తూలుతూ వస్తున్న మనిషికేసి మొరిగింది. ఆ మనిషి అప్పుడు మనిషిలా లేదు. తాచుపాములా బుసలు కొడుతున్నాడు. చారల ఉన్నిచొక్కాలోంచి ఎగదన్నుకొచ్చిన బొర్రలో అతను అగ్నిపర్వతమే మోస్తున్నట్టున్నాడు. అతని కళ్ళు అగ్నిగోళాల్లా మండుతున్నాయి. అతని బండపెదాలు ముద్దముద్దగా ఏదో వదరుతున్నాయి. తక్కిన శరీరంతో

---

కనపడటంతో చిరునవ్వుతో ముందుకు వచ్చి చేతులు కలుపుతూనే వాళ్ళు వెళ్ళిపోయారు దీదీ! 'ఇవిగో సామాను' అంటూ ఒక చోట చేర్చిన సామానును చూపిస్తూ, 'మా వాళ్ళు ఇటువైపు ఉన్నారంటూ' వాళ్ళు ఉన్న వైపు చేయిపట్టి చూపించి, వాళ్ళను పిలవటానికి రెండడుగులు ముందుకు వేస్తుంటే,

'ఆగు బచ్చు! మన వాళ్ళు పిలుస్తారు లే! అయినా మీరెప్పుడూ వచ్చారిక్కడికి?' నిర్మల

'వాళ్ళు వెళ్ళిపోగానే మేమొచ్చేశాం. అసలు మీరు ఫైరింగ్ చేసేటప్పటికీ వాళ్ళకు పిచ్చెక్కినట్లయిపోయింది. ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ, తొక్కుకుంటూ అదుగో! ఆ బురదలో పడ్డారు. అసలు ఇద్దరే దీదీ ఫైర్ చేసింది, అది కూడా ఛస్తామనే భయంతో బురదలోనే పడుకొని కాల్చారు. అందుకే ముందు వున్న వాళ్ళు కూడా రాలేదు. ఇక వీళ్ళైతే ఒకటే పరుగులు. పడిపోతానే పరుగెత్తారు. ఒకడు బురదలో పడ్డ బూటును కూడా తీసుకోకుండా ఒక బూటుతోనే పరుగు లంకించుకుంటే, మరొకడు బురదతో నిండిన బూట్లతో పడుతూ, లేస్తూ ఒకటే పరుగో..... పరుగో.....' వాళ్ళు చూసినదంతా కళ్ళకు కట్టినట్లు చెప్తూ గల గల నవ్వుతున్నారంతా.

'అందరూ వెళ్ళిపోయాక ఇద్దర్ని ఊళ్ళో ఉంచి మేము వచ్చాం. గబగబ ఇక్కడికి వచ్చేసి సామానంతా సర్ది మేము తిని మీరు వస్తారేమోనని ఎదురు చూస్తున్నామని' చెప్పుకుపోతుంటే,

లచ్చి, రామసింహాలు మధ్యలో అందుకొని 'ఇవిగో! వాళ్ళు కాల్చిన తూటాలు' అంటూ జేబుల్లో వున్న తూటాలను చూపిస్తూ 'దీదీ! భయంతో చాలానే కాల్చారు గానీ బురదలో కలసిపోయి కనిపించలేదంటూ' చీముదు తుడుచుకుంటూ చెప్పుకుపోతున్నాడు.

వాళ్ళు అలా చెప్తుంటే అంతే చూడాలనిపిస్తుంది నిర్మలకు. అన్నం తిని వారితో మాట్లాడటం పూర్తయ్యాక చిరునవ్వుతో లాల్‌సలామ్ చెప్తుతుంటే బచ్చు ముక్కు ఆనందంతో పిండింది నిర్మల.

వీళ్ళు పిల్లలు కాదు పిడుగులు. నిజంగా గెరిల్లాలంటే వీళ్ళే కదా! వీళ్ళను చూస్తుంటే చైనా పుస్తకం బాల గెరిల్లాలులో చట్టిముక్కు, బండమొఖం గుర్తుకు వచ్చారు నిర్మలకు.



సంబంధం లేనట్టు అతని బలమైన చేతులు వెడెల్పాటి భుజాల నుండి ఊరికే అలా వేలాడుతున్నాయి. మొద్దుల్లాంటి కాళ్ళు చిత్రమైన భంగిమల్లో స్లోమోషన్‌లో నాట్యం చేస్తున్నాయి.

అంతకు ముందు గంట క్రితం ఆ మనిషి అచ్చం ఈ కుక్కలాగే పెద్దసారు ముందు నిలుచున్నాడు. తోకలేదు కాని తోకూపుతున్నట్టే నిలుచున్నాడు. అతని గలీజు మాటలకు మీదికి దూకాలని ఉన్నా తమాయించుకున్నాడు. ఆ రోజుకి ఇవ్వాల్సిన కాయితాలేవో ఇచ్చేసి బైకులో బర్రున ఇంటికొచ్చేశాడు.

ఇంట్లో ఉండబుద్ధికాక, తినబుద్ధికాక మండుతున్న ఒంటిని మరికాసేపు చలిగాలిలో చల్లబరిచాడు. సలసల కాలుతున్న మనసునూ సేదదీర్చడానికి కాలుతున్న కడుపులోకి ఏవేవో ఒంపుకున్నా పెద్దగా లాభం లేకపోయింది.

ఆ కుక్కకు ఇవేవీ తెలీవు. ఎవరితో పెట్టుకోవాలో ఎవరితో పెట్టుకోకూడదో విచక్షణ ఉండటానికి అది మనిషి కాదు కదా! దాని డ్యూటీ అది నిజాయితీగా చేస్తోంది.

అసలే అంతంత మాత్రంగా ఉన్న మనిషికైతే కడుపులో మంట పెట్రోలు పోసినట్లు భగ్గుమంది. చేతిలో ఏమీ లేదు కానీ, ఉండింటే ఆ కుక్కది కుక్కచావే. అయితేనేం, కసినంతా కూడదీసుకొని బూటుకాలితో దాని డొక్కలో బలంగా తన్నాడు.

అది కుయ్యో కుయ్యోమని కూలబడిపోయింది.

తృప్తి తీరలేదు. మళ్ళీ తన్నాడు.

అది మళ్ళీ కుయ్యో అంది. ఈసారి కూత పడిపోయింది.

'ఏం చూసుకునే నీకింత కొవ్వు...' నోట్లోంచి బూతుల వరద పారింది.

కానీ ఎదురుగా ఉన్నది కుక్క కదా. అతని గోల దానికి అర్ధం కాలేదు. తల తిప్పేసుకొని చిన్నగా మూలిగింది. అది అతనికి ధిక్కారంలా కనిపిస్తుందని దానికి తెలీదు.

ఆ మనిషి దాని తోక పట్టుకొని ఆరడుగులు పైకి లేపాడు. ఇద్దరి ముఖాలూ ఇప్పుడు ఎదురెదురుగా ఉన్నాయి.

అది కొటుకులాడింది. మళ్ళీ మొరిగింది. ఈసారి నరాలు బిగబెట్టినట్లు బాధగా.

అతడు నవ్వాడు. గట్టిగా నవ్వాడు. తృప్తిగా నవ్వాడు. దాని తోక అలాగే పట్టుకొని గిరగిరా తిప్పి వదిలేశాడు. ఇక అది కనిపించలేదు. అతడు దర్పంగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయాడు.

* * *

'ఒరేయ్, పాపం రా. చచ్చిపోతుందేమో!'

'ఏదో ఒకటి చేద్దాం రా'

అనుకున్నారేగాని కట్టుకట్టడానికైనా ఒకటీ అరా దెబ్బలు కావు.

ఆ వీధిలోనుండి అటుగా పోతున్న ఒక పెద్దాయన పిల్లల గుంపును చూశాడు. వాళ్ళ వాలకం చూసి ఆయకేదో అనుమానమొచ్చింది. ఏమైందని ఒక పిల్లవాడిని అడిగిన వెంటనే పిల్లలందరూ గోలగోలగా విషయం చెప్పారు. ఆయనను చూస్తే ఏమైనా చేయగలడనిపించింది వాళ్ళకు.

అతడు కుక్కకు దగ్గరగా పోయాడు. రెండు చేతులతో దాన్ని దగ్గరికి తీసుకున్నాడు. నీళ్ళు తెమ్మన్నాడు. నలుగురు వెళ్ళారు పరిగెత్తుకుంటూ. గుంపుగా చుట్టుకున్న పిల్లల మధ్యలో అతడు దాని నోట్లో కొద్దికొద్దిగా నీళ్ళు పోశాడు. అది సగం గ్లాసు కూడా తాగలేదు.

తాతా, డాక్టరుకు చూపిద్దాం. కుక్క డాక్టరుకు. అంది ఒక పిల్ల కుక్క డాక్టరు కాదు, పశువుల డాక్టరుకు. సవరించాడు ఇంకో పిల్లవాడు.

పెద్దాయన చిన్నగా నవ్వాడు. దానికి మందు తెప్పించాడు. గాయాలను శుభ్రం చేసి మందు రాయాసాగాడు.

ఇంతలో బర్రున శబ్దం చేసుకుంటూ ఒక బైకు వాళ్ళను దాటుకుంటూ దూసుకుపోయింది.

'అతనే', అన్నాడో పిల్లవాడు.

'అతనే నిన్న దీన్ని కొట్టింది' వేలుపెట్టి చూపించాడు.

అది బాధగా అరుస్తున్నప్పుడు బైటికొచ్చి చూసింది ఈ పిల్లవాడే.

పెద్దాయన అతన్ని పోల్చుకున్నాడు. కుక్కను తీసుకొని నేరుగా అతను పనిచేస్తున్న పోలీస్‌స్టేషన్‌కు పోయాడు. పిల్లలూ ఆయనను వెంబడించారు. కుక్కను కొట్టిన పోలీసాఫీసర్‌పై కేసు రాయమన్నాడు. అక్కడున్నవాళ్ళు అతన్ని వింతగా చూశారు. నవ్వారు.

'పనీపాటా లేకపోతే సరి. పోవయ్యాపో. కేసంట కేసు!' కసురుకున్నారు.

'కుక్కను కొడ్తే కేసా. ఇంతలావు మనుషులకు దిక్కులేదుగాని!' అన్నది ఎవరో నిజంగా దిక్కులేని మనుషులున్నట్టున్నారు.

పెద్దాయన పట్టుబట్టాడు. దేన్నయినా కొట్టే హక్కు ఎవరిచ్చారన్నాడు. హింస నేరం కాదా అన్నాడు. అడిగేవాడు లేదని కుక్కయితే మాత్రం చంపేస్తారా అని గట్టిగానే అడిగాడు. గట్టిగానే ఏమిటి, దిక్కులు దద్దరిల్లేలా అన్నాడు. జంతువుల్ని హింసించడం నేరమని ఏఏ చట్టాలు చెప్తాయో కూడా చెప్పాడు.

న్యూసెన్స్ భరించలేక అతన్ని బైటికి తోశారు. పిల్లలు గోలగోలగా అరిచారు.

ఆయనా ఊరుకోలేదు. స్టేషన్ ఎదురుగా రోడ్డుపై కూర్చున్నాడు. ఆయనకు తోడు పిల్లల గుంపు. విషయం తెలుసుకున్న జంతుహక్కుల సంఘాలవాళ్ళు నిమిషాల్లో అక్కడికి చేరుకున్నారు. పిల్లల అరుపులు, మీడియా హడావిడి తోడయ్యి ఆ ప్రాంతమంతా సందడిగా తయారయ్యింది. ఫలానా ఆఫీసర్‌పై కేసు నమోదు చేయాలి. ఫలానా ఆఫీసర్ బైటికి రావాలి అంటూ నినాదాలు మొదలయ్యాయి.

రోడ్డుమీద పోతున్నవారు చోద్యం చూస్తూ నిలబడటమో, చూపు ఇటుతిప్పి వేగం తగ్గించి నెమ్మదిగా పోవటమో చేస్తున్నరు. ఎవరోగానీ విచారించి విషయం తెలుసుకోవడం లేదు. తెలుసుకున్న వాళ్ళు నోళ్ళువెళ్ళబెడుతున్నారు.

దూరం నుండే చూపు లగ్నం చేసి వస్తున్న ఒకామె నేరుగా పెద్దాయన దగ్గరికే పోయింది. వయసు ముప్పైఅయిదు, నలభై మధ్యలో ఉంటుంది. మధ్యతరగతి వాలకం. సన్నగా పాలిపోయిన రంగులో ఉంది. ఏం జరిగిందని అడిగింది.

కుక్కను చూపించి విషయం చెప్పాడాయన. దానికి చేసిన సపర్యల వల్ల అప్పటికది కాస్త తేరుకుంది. బతికి బైటపడినట్లే.

పెద్దాయన చెప్పేది ఆమె ప్రశాంతంగా విన్నది. పెద్దగా ఆశ్చర్యపోలేదు. పైగా ఇలాంటిదేదో జరగవలసిందే అన్నట్టుగా ఉన్నాయి ఆమె భావాలు.

సాంతం విని, 'నిజమే పెద్దాయనా, నువ్వు చెప్పేది రైటే. కక్కయితే మాత్రం ఇంత దారుణంగా కొడ్తాడా. అడిగేటోళ్ళు లేరని!'

గల్పిక

# పరాయి ప్రాంతపోడు

- పి. చిన్నయ్య

ఎంత ప్రయత్నించినా నిద్ర రాకుండా ఉంది. దీనికంతటికి కారణం తన అహంకారం, అజ్ఞానమే గదా? పెట్టుబడిదారున్నయుండి ఎందుకింత తొందరపాటు? ఆ ప్రాంతపు వారిని అనవసరంగా నానా మాటలతో నోరు పారేసుకుంటి. తన చిల్లర చేష్టలకు జై తెలంగాణోళ్లు తిట్టినా, కొట్టినా ఓ కారణముంది, కాని తన ప్రాంతపువాళ్లు 'నీ వ్యాపారాల కోసం ఆ ప్రాంతపువాళ్లను తిడుతున్నవుగాని, ఈ ప్రాంతపు ప్రజల గురించి ఏమి పట్టించుకుంటున్నావు?' అని జై ఆంధ్రోళ్లు తిట్టబడితిరి. తన వ్యాపారాలేవో తను చూసుకోక రెండు ప్రాంతాలవారికి శత్రువు కావడం ఏమిటి? అతనితో మాట్లాడి అనుమానం తీర్చుకుంటే తప్పేమిటి? అతనేమి తనకు వర్గ శత్రువు కాదు కదా? అనుకున్న తడవుగా ఫోన్ చేశాడు.

'ఎలా ఉన్నారు కెసిఆర్‌గారు?'

'ఓ లగడపాటి, ఏంది ఏలాపాలా లేకుండా గింత రాత్రిల్లి చేసినవు, అంత నెమ్మదేనా?'

'నెమ్మదిగా ఉండేటట్టు చేశారా మీరు!'

'పిచ్చోడివా, ఇంతకుముందు చాలాసార్లు చెప్పిన, మళ్ళీ చెబుతున్న, తెలంగాణ వస్తే పైసా నష్టం రాదు, అసలు నీ బాధేంది?'

'తెలంగాణలో ఎన్ని పెట్టుబడులు పెట్టానో తెలియదా మీకు...' నిష్టూరంగా

'మెడకాయ మీద తలకాయున్నోళ్లందరికి తెలుసు, అయితే ఏంది? నీ ఒక్కనివి పెట్టుబడులు పెట్టినవా ఈడ? స్వదేశ, విదేశ బహుళజాతి కంపెనీలు, పక్కరాష్ట్రపోళ్లు, మీ ప్రాంతపోళ్లు మస్తుమంది పెడుతున్నారు. వాళ్లందరికీ లేని బాధ నీకెందుకు?'

'నా బాధంతా తెలంగాణొస్తే నక్సలైట్లు తిరిగి వస్తరేమోనని, వాళ్లు నా పెట్టుబడులకు ఏమైనా నష్టం...?'

'దిమాక్ లేకుండా మాట్లాడకు లగడపాటి, నక్సలైట్లు జోరుగున్న రాష్ట్రంలోనే నీ ప్రాజెక్టులున్నాయి. వాటికేమైనా నష్టం చేసింర్రా ఆడ?'

'అక్కడ వేరు, ఇక్కడ వేరు. మీ తెలంగాణ నాయకులంటే భయం లేదు, నా భయమంతా మీ ప్రాంత ప్రజల గురించి, పోరాటాల్లో ప్రపంచంలోని ఆరితేరినవారు, నా ఆస్తులను ఆక్రమిస్తారని భయం...'

'గా భయాలే వద్దు, గిదేమన్న వర్గ పోరాటమనుకుంటున్నావా?'

'నీవు ఎన్నయినా చెప్పు, నా భయం నాది కెసిఆర్, మీ ప్రాంతంల ఓ పెద్దాయన అంటుండేవాడు, 'పరాయి ప్రాంతపోడు దోపిడి చేస్తే పొలిమేరలదాకా తరిమేస్తమని! వినలేదా? ఆ మాటల్ని ఆచరణలో పెడితే?'

'గటువంటి మాటలు మస్తుగింటున్న చిన్నప్పటినంది, 'ఈ ప్రాంతపోడు దోపిడి చేస్తే ఈడనే పాతరపెడతం, ప్రపంచ పీడితులంతా ఏకం కావాలి' అని మస్తుగరుస్తుంటరు, అయితదా? అయిందానికి కాందానికి భయపడకు. నీ ఆస్తులకు ప్రమాదమొస్తే నా ఆస్తులకొచ్చినట్లు గాదా? నీ ఆస్తులకు నా ఆస్తులడ్డు – అయినా అక్కడిదాకొస్తే మన చట్టాలు, పోలీసులు, సైన్యం చూస్తూ ఊరకుండే పనికిమాలిన దద్దమ్మలా? పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోకు, అందరిలా పెట్టుబడులు పెట్టుకో, లాభాలు తీసుకో...'

'నిన్ను అర్థం చేసుకోలేకపోయా మిత్రమా, నేనన్న మాటలను మనసులో పెట్టుకోకు, నీ సహాయం వట్టిగేమి పోదు, గుడ్‌నైట్!' ఆనందంలో ఫోన్ పెట్టి ఆలోచనల పడ్డాడు.

'నిజమే! మిత్రుడు చెప్పినట్టు మూర్ఖంగా ఎందుకుండాలి? తెలంగాణొస్తే తనకొచ్చే నష్టమేమిటి? తన ప్రాజెక్టులు దేశ, విదేశాల్లో విస్తరించి ఉన్నాయి. అలాగే తెలంగాణ రాష్ట్రంల ఉంటాయి. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రమైతే ఏమిటి, ప్రత్యేక దేశమైతే ఏంటి? తనకు కావల్సింది తన పెట్టుబడులకు భద్రత, వాటికి లాభాలు.

పెట్టుబడిదారుని లక్ష్యం ఏమిటి? ఈ భూమండలం మీద ఏడ లాభమనుకుంటే ఆడ పెట్టుబడులు పెట్టుకుంటూ, లాభాలు తీసుకుంటూ పోవటమేగా! అటువంటిది బర్రెతోకను పట్టుకొని సిపిఎం పార్టీ ఈదినట్టు, భాషా ప్రయుక్త సిద్ధాంతాన్ని పట్టుకొని ఈదడమేమిటి? పెట్టుబడి ఓ కుల, ప్రాంత, భాషా, జాతి తేడాలేమిటి? అన్నింటిని తనలో కలుపుకొంటూ పొలిమేరలు లేని వ్యాపార సామ్రాజ్యాన్ని నిర్మించుకుంటూ పోవడమేగానీ...' ఆలోచనలన్నీ ఓ కొలిక్కి వచ్చాక తృప్తిగా నిద్రపట్టినట్టయింది లగడపాటికి!



---

'నువ్ బాగా అర్థం చేసుకున్నావ్మ్మా. ఇట్లాంటివి చూస్తా ఊరుకోగూడదు.' పెద్దాయన పక్కనున్న ఒక పెద్దమనిషి కళ్ళు పెద్దవి చేసి తల కిందికీపైకి ఊపుతూ అన్నాడు.

ఆమె అతనివైపు ఒకసారి చూసి అవునన్నట్టు తలూపి మళ్ళీ పెద్దాయన వైపు తిరిగింది.

'కుక్కను కొడ్తే ఇంత కొట్లాడ్తన్నారు గదా... నన్నయితే మా ఆయన రోజూ కుక్కను కొట్టినట్లే కొడ్తడు. నా బాధ ఎవరికి జెప్పన్లే పెద్దాయనా...! నిట్టూర్పు విడిచింది.

ఆమె కళ్ళలోకి ఆదరంగా చూశాడాయన 'ఎవరుమ్మా నువ్వు? యాడుంటావు? చెప్పు. నీ భర్త ఎవరు? ఏం చేస్తుంటాడు? చెప్పమ్మా.'

ఆమె మౌనం పాటించింది. ఆయన వదల్లేదు.

కుక్కనుకొట్టడమే తప్పంటన్నాం. మనిషిని, అందునా ఆడమనిషి కొట్టడం ఇంగెంత తప్పు అన్నాడు. ఓర్పు కూడా తప్పుల్ని ప్రోత్సహిస్తుందన్నాడు. ఆమె నోరు విప్పేవరకూ ఆయన వదల్లేదు.

'ఏం చెప్తానయ్యా! ఈ కుక్కను కొట్టినోడే రోజూ నన్ను కొట్టేది...!'

'ఆ...!!!'

'అయితే నువ్వు గూడా వచ్చి కూర్చోమ్మా.' వెంటనే తేరుకొని ఎటువంటి తడబాటూ లేకుండా అన్నాడు పెద్దాయన.

*(రాయలసీమ పౌరహక్కుల ఉద్యమకారుడు ఎం.జె.సుబ్బరామిరెడ్డి తడారని జ్ఞాపకానికి.)*



వ్యాసం

# గత ఎనిమిది నెలలుగా దండకారణ్యంలో ఏం జరుగుతోంది?

- వరవరరావు

గత జూన్ 27,28 తేదీల్లో దక్షిణబస్తర్‌లోని బీజాపూర్ సుకుమా జిల్లాల్లో బాసగూడ, కొత్తగూడ, రాజుపెంట మొదలైన గ్రామాల్లో మూడుచోట్ల విడివిడిగా సిఆర్‌పిఎఫ్ నాయకత్వంలో కోయకమాండోలతో సహా అర్ధసైనిక బలగాలు 20 మంది ఆదివాసీలను, ఒక మావోయిస్టుపార్టీ మిలీషియా సభ్యుడ్ని చంపిన ఉదంతం తర్వాత గత ఎనిమిది నెలలుగా దండకారణ్యంలో ఏం జరుగుతోందో బయటి ప్రపంచానికి విస్పష్టంగా తెలియరావడంలేదు. బాసగూడ మారణకాండగా ప్రచారంలోకి వచ్చిన ఆ ఏకపక్ష భద్రతాబలగాల కాల్పుల తర్వాత సిడిఆర్‌సి నాయకత్వంలో 34 మంది వివిధ ప్రజాసంఘాల వాళ్లు, హక్కులసంఘాల వాళ్లు వెళ్లివచ్చి బయటిప్రపంచానికి చెప్పినందువల్ల, స్వయంగా దక్షిణబస్తర్‌కు అప్పుడు అధికారప్రతినిధిగా ఉన్న విజయమాడ్కం మీడియాకు సమాచారం అందించినందువల్ల, ఆ తర్వాత రోజుల్లో మావోయిస్టుపార్టీ సెంట్రల్ రీజనల్ బ్యూరో అధికార ప్రతినిధి ఒక ప్రముఖ తెలుగు దినపత్రికలో రాసినందువల్ల ఆ మారణకాండ గురించి ఎంతో కొంత ప్రచారం జరిగింది. హైదరాబాదులో జులై9న ఆర్‌డిఎఫ్ ఏర్పాటుచేసిన రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌లో బొజ్జాతారకం, చిలకా చంద్రశేఖర్‌లు స్వయంగా వెళ్లివచ్చి చూసిన దృశ్యాలను కళ్లకు కట్టినట్టు వివరించారు. ఢిల్లీలో జులై31న జరిగిన ధర్నాలో కూడా వీళ్లతోపాటు దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి పాల్గొన్నవాళ్లు ఈ విషయంపై వెలుగును ప్రసరించారు. ఈ బృందంలో వెళ్లిన విరసం పాణి 'చింతల్నార్' పేరుతో ఒక సమగ్రమైన పుస్తకమే రాశాడు.

కాని ఈ ఎనిమిదినెలలుగా దండకారణ్యంలో ఏం జరుగుతుందో బయటి ప్రపంచానికి తెలిసే అవకాశాలు ఒక్కొక్కటే తగ్గిపోతున్నాయి. ఈ మారణకాండ నెత్తుటితడి ఆరకముందే ఈ విషయాన్ని మీడియా దృష్టికి తెచ్చిన విజయమాడ్కం ఒక ట్రాక్టర్ నడుపుతూ అమరుడయ్యాడు. ఈ మారణకాండ గురించి, దండకారణ్యంలో నిర్బంధం గురించి దేశమంతా తిరిగి ప్రచారం చేయడానికి హైదరాబాద్ బయలుదేరిన చేతన నాట్యమంచ్ సాంస్కృతిక కార్యకర్తలను చిన్నపిల్లలతో సహా హైదరాబాద్ బస్టాండ్‌లో అరెస్ట్‌చేసి ఆగస్టు మొదటివారంలో విడుదలయ్యాక తీసుకవెళ్లి అడవిలో వదిలివచ్చారు. ఏమైనా ఈ మారణకాండలో స్వయంగా సిఆర్‌పిఎఫ్ పాల్గొనడం వల్ల అప్పటికింకా పదవీవిరమణ చేయని సిఆర్‌పిఎఫ్ డిజిపి విజయకుమార్, హోంమంత్రి చిదంబరం చెప్పిన కట్టుకథలేవీ ప్రపంచం నమ్మలేని స్థితికి వచ్చి కేంద్రప్రభుత్వం చాలా బదనామీని మోయాల్సి వచ్చింది. ఇటువంటి సందర్భాల్లో సేఫ్టీవాల్వ్ పద్ధతులు ఉపయోగించే మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం హోంమంత్రిగా చిదంబరంను మార్చి సుశీల్‌కుమార్ షిండేను ఆ స్థానంలోకి తెచ్చింది. అయితే సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నేపథ్యంలో 1991 నుంచి చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకొని మన్మోహన్‌సింగ్, చిదంబరం వంటి బూర్జువా ఆర్థిక శాస్త్రజ్ఞులకు కీలకపదవులిస్తున్న కేంద్రప్రభుత్వం చిదంబరంను ఆర్థికమంత్రిగా చేసి హోంశాఖతో సహా ఏడు కీలకమైన శాఖలను ఆయన నాయకత్వం కిందికి తెచ్చింది.

ఈ మారణకాండ దగ్గర్నించే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఖనిజ (మైనింగ్) విధానం గురించి కేంద్ర గిరిజనశాఖామంత్రి కిషోర్‌చంద్రదేవ్ విమర్శనాత్మక వ్యాఖ్యానాలు చేస్తున్నాడు. ఆదివాసీ ప్రాంతాల్లో ఖనిజాల తవ్వకాల గురించి, బడా ప్రాజెక్టుల నిర్మాణం గురించి ఈ రెండు అంశాల్లోనూ కార్పొరేట్‌శక్తులతో ఒప్పందాల గురించి బహిరంగంగానే విమర్శిస్తున్నాడు. ప్రధానికి, పర్యావరణశాఖ మంత్రికి, రాష్ట్ర ప్రభుత్వానికి లేఖలు రాస్తూనే ఉన్నాడు. ముఖ్యంగా విశాఖపట్నంలో బాక్సైట్ తవ్వకాల గురించి చేసుకున్న ఒప్పందాలను రద్దుచేయాలని, ఈ విషయంలో రాష్ట్రగవర్నర్ తనకున్న రాజ్యాంగపరమైన ప్రత్యేక అధికారాలను వినియోగించుకోవాలని విజ్ఞప్తి చేసాడు. దేనికీ స్పందన లేకపోయేవరకు తాజాగా కేంద్ర గనులశాఖామంత్రికి కూడా ఈ ఒప్పందాలను రద్దు చేయాలని లేఖ రాసాడు.

అడవులు, పర్యావరణం నుంచి గ్రామీణాభివృద్ధిశాఖకు మారిన మరొక కేంద్రమంత్రి జైరామ్‌రమేశ్ ఆదిలాబాద్ నుంచి శ్రీకాకుళం వరకు అడవి పొడుగునా ఆదివాసీ గ్రామాలకు రోడ్లనిర్మాణానికి వేలకోట్ల రూపాయలు కేంద్రం కేటాయించిందని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి లేఖ రాసాడు. ఇందులో వంద ఇళ్లు ఉన్న ఆదివాసీ గ్రామానికి కూడా రోడ్డునిర్మాణానికి ఎంతపెద్ద మొత్తాన్ని కేటాయించారో కూడా వివరంగా పేర్కొన్నాడు. జైరామ్ రమేశ్ మొదటినుంచి 'అభివృద్ధి' పథకాల ద్వారా మావోయిస్టులనెదుర్కోవాలనే విధానాన్ని తనదైన శైలిలో చెప్తున్నాడు, ఆచరిస్తున్నాడు. జార్ఖండ్‌లోని సరండాలో గ్రామరాజ్యకమిటీలు పనిచేస్తున్న 20 గ్రామాల్లో ఈ పథకం విజయవంతమైందని చెప్తున్నాడు. కొందరు మేధావులు కూడా ఆ భ్రమలు కల్పిస్తున్నారు. చిదంబరం 'ఆక్రమించు, అభివృద్ధిపరుచు' అనే విధానానికి భిన్నంగా జైరామ్‌రమేశ్ 'ఆహారానికి అండగా భద్రతాబలగాలు' అనే కొత్తభాష మాట్లాడుతున్నాడు. అడవిని ఆక్రమించి, నీటిలో చేపల్లా ఉన్న మావోయిస్టులను వేరుచేయడానికి ఆదివాసులను నిర్వాసితులను చేసి మావోయిస్టులను నిర్మూలించి కార్పొరేట్ ప్రయోజనాలను అభివృద్ధి చేయాలి అన్న అమెరికా అందించిన చిదంబరం పథకం చాలా విమర్శకు గురైన నేపథ్యంలో రక్షణతో కూడిన అభివృద్ధి అనే

విధానాన్ని జైరామ్ రమేశ్ అమలు చేస్తున్నాడు. ఆదివాసులకు ఆహారమూ మొదలైన మౌలిక అవసరాలు లోతట్టు గ్రామాలకు అందించాలని, అవి అందించడానికి వెంట భద్రతాబలగాలు పోవాలన్నది జైరామ్‌రమేశ్ ఆచరిస్తున్న విధానం. ఈ విషయంలో దంతెవాడలోని అతని ఆశ్రమం తగలబెట్టి అతన్ని ఢిల్లీకి తరిమివేయకముందే హిమాంశుకుమార్ పోలీసులు లేకుండా రెవెన్యూ సివిల్ సప్లై శాఖల ద్వారా ఆదివాసులకు ఆహారం మొదలైన మౌలిక అవసరాలు పంపించేట్లయితే తాను వెంటవెళ్లి సహకరిస్తానని మావోయిస్టులు కూడా వ్యతిరేకించరు అని చెప్పాడు. మావోయిస్టులు కూడా ప్రజలకందే ఆహారం వంటి మౌలిక అవసరాల విషయంలో అది నేరుగా వాళ్లకందేట్లయితే వాటివెంట శత్రునిర్బంధం రానిమేరకు తాము అభ్యంతరపెట్టమని ఎన్నోమార్లు చెప్పారు. కానీ, అడవిలోకి ఏదీ విడిగా రాదు. రోడ్డువేయడానికి పబ్లిక్‌వర్క్స్ డిపార్ట్‌మెంట్ వాళ్లొస్తే వాళ్లవెంట సరిహద్దురోడ్డునిర్మాణ భద్రతాబలగాలు వస్తాయి. వాళ్లవెంట నిఘావిభాగాలొస్తాయి. సుకుమా జిల్లా కలెక్టర్ అభివృద్ధి గురించి మాట్లాడడానికి గ్రామసభ ఏర్పాటుచేయడానికి ఎంత పోలీసుబలగంతో వచ్చాడో మనం గమనించే ఉన్నాం. అడవిలోకి ప్రవేశం సిఆర్‌పిఎఫ్ క్యాంపులనుంచే. ఆదివాసీల సంతలు చివరకు పాఠశాలలు, ఆస్పత్రులు, సిఆర్‌పిఎఫ్ క్యాంపుల కనుసన్నల్లోనే. కనుక రోడ్డునిర్మాణాలంటే ఆర్థిక లక్ష్యం, కార్పొరేట్ శక్తుల ప్రభావం వాళ్లకండగా అర్ధసైనిక బలగాల ప్రవేశం అనేది మనకు తెలిసినా తెలియకపోయినా ఆదివాసీ ప్రజలకు స్పష్టంగా తెలుసు. పెట్టుబడితోపాటు నిర్బంధం ప్రవేశిస్తుంది. తమ తెగల్లో, తమ ప్రాంతాల్లో ఉన్న పెత్తందారీ భూస్వామ్య విధానంతో పోరాడి దండకారణ్య ప్రాంతంలో ప్రజలు ఆ అణచివేతను దాదాపుగా రూపుమాపారు. ఇప్పుడు సమస్య అక్కడ దళారీల ప్రవేశమే.

కొలంబస్ అమెరికాకు కనుగొన్న దారి అయినా వాస్కోడిగామా ఇండియాకు కనుగొన్న దారి అయినా ఆ తర్వాత యూరోపియన్ సామ్రాజ్యవాదులు వేసిన రోడ్లయినా, రైల్లయినా పెట్టుబడి ప్రవేశం కోసమే. వనరుల శ్రమ దోపిడీ కోసమే. దండకారణ్యంలో రాయపూర్ దాకా అంతర్జాతీయ విమానాశ్రయమైనా, రాజమండ్రి దగ్గరి మధురపూడి దగ్గర మానవరహిత విమానాల కోసం ఏర్పాటుచేసిన విమానాశ్రయమైనా ఆకాశమార్గాన పెట్టుబడి, సైన్యం అక్కడికి చొచ్చుకొని పోవడానికే. మహారాష్ట్రలోని గడ్చిరోలి, చత్తీస్‌గడ్‌లోని నారాయణపూర్, ఖమ్మం జిల్లాలోని భద్రాచలం డివిజన్ నుంచి రోడ్లు ప్రతినిత్యం మూడువైపుల నుంచి దండకారణ్యానికి అర్ధసైనిక బలగాలను మాత్రమే కాదు, సైన్యాన్ని కూడా తీసుకపోతున్నాయి. బాసగూడ, రాజుపెంట, కొత్తగూడ మూడుగ్రామాలు కలిపికూడా వంద, అరవై, యాభై మంది ప్రజలుండే గ్రామాలవలెనే చర్ల మండలం లోనైనా, గంగలూరు ప్రాంతంలోనైనా గ్రామమంటే 50, 60 మంది ప్రజలుండే ప్రాంతమని అర్థం. అక్కడిదాకా అర్ధరాత్రిపూట నేషనల్‌హైవేలుగా గర్వంగా చెప్పుకునే రోడ్లమీద అర్ధసైనికబలగాలు, కోయకమాండోలు ఇనుపబూట్ల పదఘట్టనలతో రావడం, రావడమే చాలు అది భద్రతకోసమా? భయభీతావహం కల్పించడం కోసమా ఊహించుకోవాల్సిందే.

ఇంచుమించు 2012 ఆగస్టు నుంచే బస్తర్‌లోని ప్రతిగ్రామంలో, గూడాలలో ప్రభుత్వ సాయుధ బలగాలు స్వైర విహారం చేస్తున్నాయి. ఎస్‌టిఎఫ్, సిఆర్‌పిఎఫ్, డిఎఫ్, సిఎఫ్, కోబ్రాకమాండో మొదలైన సంయుక్త బలగాలు నక్సలైట్ల క్యాంపుల మీద దాడులపేరుతో వస్తున్నాయి. ఒక శిబిరాన్ని ధ్వంసం చేసాయి కూడా. మావోయిస్టుల శిబిరంలో విస్ఫోటన సామాగ్రి, ఆయుధాలు, నక్సలైట్ సాహిత్యం, ఆహారధాన్యాలు, ఇతర వస్తువులు పెద్దయెత్తున దొరికాయని పోలీసు మీడియాకు సంచలనాత్మక సమాచారం కూడా ఇచ్చింది. కాని వాస్తవాలు అందుకు విరుద్ధంగా ఉన్నాయి.

కేంద్రంలో హోంమంత్రులు ఎవరు మారినా 2004 నుంచి తాను కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వంతో పొందుతున్న అండదండల వల్ల రమణ్‌సింగ్ ప్రభుత్వం బహుళజాతి కంపెనీలతో బడా కంపెనీలతో ఒప్పందాలు చేసుకోవడం మినహా ప్రజల యోగక్షేమాల గురించి ఏ విషయమూ పట్టించుకోవడం లేదు. ముఖ్యంగా రైతులు, కార్మికులు, విద్యార్థులు, ఆదివాసులు, ఉద్యోగులు, వాళ్ల సమస్యలు, ధరల పెరుగుదల, పేదరికం వంటి అంశాలు అతనికి పట్టనేలేదు. రాష్ట్రంలో 1 లక్షా 86వేల మంది అధ్యాపకులు ఆరవ వేతనసంఘం నివేదికను అమలుచేయాలని 38 రోజుల సమ్మె చేసారు. వాళ్లు తీవ్రనిర్బంధాన్ని మాత్రమే చవిచూసారు. 32వేల మంది అధ్యాపకుల నియామకాలు ఆపేశారు. పదివేల మందిని ఉద్యోగాల నుంచి తొలగించారు.

2013 జనవరి 20 నుంచి 23 వరకు ప్రభుత్వ సాయుధబలగాలు బీజాపూర్ జిల్లాలోని పీడియా, దోడి, తుమానార్ గ్రామాలమీద దాడిచేసి స్వైరవిహారం చేసారు. 12వందల మంది సిఆర్‌పిఎఫ్, డిఎఎఫ్, సిఎఎఫ్, ఎస్‌టిఎఫ్, కోబ్రాకమాండోలు గంగలూరు, బాసగూడల వైపు నుండి వచ్చి ఎనిమిది బృందాలుగా ఈ గ్రామాల మీద దాడిచేసారు. ప్రజలమీద నిర్విచక్షగా కాల్పులు జరిపారు. మోటార్‌సెల్స్ ప్రయోగించారు. అమరుల స్థూపాలను, రాకెట్‌లాంచర్లతో ధ్వంసం చేసారు. 20 ఇళ్లను కాలబెట్టారు. లక్షల రూపాయలు విలువచేసే ధాన్యమూ, బియ్యమూ, వస్త్రాలూ ఇంకా ఇటువంటి అవసర సామాగ్రిని తగులబెట్టారు. అన్నం వండుకునే సామాగ్రి, నీళ్లకుండలు, మొదలైన వస్తువులన్నీ ముక్కలు ముక్కలు చేసారు. వందలాదిగా కోళ్లను, మేకలను కోసుకుని తినగలిగినంత తిన్నారు, మిగిలినవి ఎత్తుకపోయారు. ప్రజల అరటితోటలను, కూరగాయల తోటలను ధ్వంసం చేసారు. ప్రజలకు సంవత్సరంపాటు వచ్చే ఆదాయవనరులన్నిటినీ నష్టం చేసారు. ఒకవైపు ఈ ప్రజావ్యతిరేక ప్రభుత్వం దోపిడీశాసనాలతో అణచివేతతో ఇటువంటి విధ్వంసం చేస్తూఉంటే ప్రజలు మావోయిస్టుపార్టీ నాయకత్వంలో పోరాడుతూ ప్రతిగ్రామంలోనూ ప్రత్యామ్నాయ క్రాంతికారీ జనతన సర్కార్‌ను ఏర్పాటుచేసుకుంటున్నారు. వీటి ఆధ్వర్యంలో స్వయంగా వాళ్లే ఎన్నోచోట్ల పాఠశాలలను, ఆశ్రమ పాఠశాలలను నెలకొల్పి ఆదివాసీ పిల్లలకు చదువులు చెప్తున్నారు. ఇది ప్రజా వ్యతిరేక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఎంతమాత్రమూ సహించరానిదిగా ఉంది.

జంపారకా, డోడి, తుంనార్, పీడియా గ్రామాల్లో ప్రజలు ఏర్పాటుచేసుకున్న ఈ ఆశ్రమపాఠశాలను పోలీసులు తగులబెట్టారు. ఈ పాఠశాలల్లో పెట్టిన పిల్లల పుస్తకాలను, కట్టుబట్టలను కప్పుకునే బట్టలను, పడుకునే అరుగులను, బియ్యం పప్పు, వండుకునే బోళ్లు, తినేకంచాలు అన్నిటినీ తగులబెట్టారు. పోలీసులు మీడియాకు చెప్తున్న మావోయిస్టు శిబిరంమీద దాడి అంటే ఇదే. మరొకవైపేమో ప్రభుత్వం దంతెవాడ దగ్గర జాముగా అనేచోట ఎడ్యుకేషన్‌హబ్ పెద్దయెత్తున ఏర్పాటుచేస్తున్నట్టు ఆర్భాటంగా ప్రచారం చేస్తోంది..

బీజాపూర్ జిల్లా నూకాన్‌పాల్ పంచాయితీ బోగ్గా గ్రామంలో నవంబర్ 2న మాడవి హిడ్మాను, నవంబర్ 4న గోంగ్లా గ్రామంలో గాలి పన్నాలాల్‌ను, డిసెంబర్ 17న కాచలారాం పంచాయతీకి చెందిన పోడియం బుదరాంను పోలీసులు బూటకపు ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చిచంపారు. ఆంధ్రా గ్రేహౌండ్స్‌తోపాటు చత్తీస్‌గడ్ పోలీసులు బీజాపూర్, సుకుమా జిల్లాల్లో భద్రకాళి, ఉసూర్, పామేడు, చర్ల, గోలపల్లి, కుంటా వరకు నిఘా, గాలింపులు గత నవంబర్ నెల నుంచి నిరంతరం కొనసాగిస్తున్నారు. ఈ దమనకాండలో రెండు రాష్ట్రాల ప్రత్యేక బలగాలు, కోబ్రా కమాండో ఫోర్స్, ఎంఐ-17 సైనిక హెలికాప్టర్‌ను, యుఎవి విమానాన్ని కూడా వాడుకుంటున్నారు. ఈ విధంగా ఈ అర్ధసైనిక బలగాలకు సైన్యం కూడా తోడ్పడుతోంది.

2013 జనవరి 19న సుకుమాజిల్లా తిమిల్‌వాడ దగ్గర ఎంఐ హెలికాప్టర్ నుంచి సైన్యం పిఎల్‌జిఏ మీద కాల్పులు జరిపింది. ఆత్మరక్షణ కొరకు వాళ్లు హెలికాప్టర్‌పై కాల్పులు జరిపారు. ఇది సాకుగా వేలకొలది అర్ధసైనిక బలగాలు దోర్నాపాల్, తిమిల్‌వాడ, చింతాగుఫ పోలీస్‌స్టేషన్ ప్రాంతాల్లో అర్ధ సైనిక శిబిరాలు ఏర్పాటుచేసారు. వేలాదిమందిని అరెస్టుచేస్తున్నారు. ఈ పద్ధతి ఒకరకంగా చర్లమండలంలో గత ఎనిమిదినెలలుగా కొనసాగుతూనే ఉంది. భద్రాచలం డివిజన్‌లో, ముఖ్యంగా చర్లమండలంలో చత్తీస్‌గడ్ సరిహద్దు గ్రామాల నుంచి వందలాదిమంది ఆదివాసులను అరెస్టుచేసి రోజులతరబడి పోలీసుక్యాంపుల్లో చిత్రహింసలు పెట్టి యుఎపిఎ కేసుల్లో ఇరికించి ఖమ్మం, వరంగల్ జైళ్లకు పంపుతున్నారు. నెలల తర్వాత విడుదలైతే మళ్లీ జైలు ముందే అరెస్టుచేసి కొత్తకేసులు పెట్టడమే కాదు, జమానతులు ఇచ్చిన రక్తబంధువుల[illegible] తమవాళ్లను తోడ్కొని వెళ్లడానికి వచ్చిన రక్తబం[illegible]లు కూడా కేసులుపెట్టి జైళ్లలో పెడుతున్నారు [illegible]బాదు నుంచి ఖమ్మం దాకా గోదావరినది పొడుగునా అర్ధసైనిక బలగాలతో దిగ్బంధం చేసి గ్రేహౌండ్స్ గాలింపు చర్యలు నిర్వహిస్తున్నారు. భద్రాచలం డివిజన్లో ఆదివాసీ గ్రామాల్లో ప్రజలందరినీ నిర్బంధంగా ఒకచోట గుంపుచేసి తెలంగాణ రైతాంగ పోరాట కాలంలో నంజప్ప, పళనియప్పన్‌లు అమలు చేసినటువంటి నిర్బంధాన్ని, చిత్రహింసలను అమలుచేస్తున్నారు. ఆంధ్రాసరిహద్దులవతల ఆదివాసులను చంపివేసి ఎన్‌కౌంటర్ అని ప్రకటించడం నిత్యకృత్యమైంది.

లోతట్టు ప్రాంతాల్లో మావోయిస్టుల ప్రాబల్యం నుంచి గ్రామాలను తమ ప్రాబల్యంలోకి తెచ్చుకోవాలని 'ఏరియా డామినేషన్' అనే విధానాన్ని భద్రతా బలగాలు అమలుచేస్తున్నాయి. ఈ ప్రాబల్యదాడులు పలురూపాల్లో ఉండి ప్రజలు చెప్పలేని చిత్రహింసలు, యాతనలు అనుభవిస్తున్నారు. ఇది వర్షాకాలంలో కూడా కొనసాగింది. ఒకవైపు బాసగూడ మారణకాండ తర్వాత కూడా గుండెధైర్యం చెదరకుండా ఆదివాసీ ప్రజలు లక్షలాదిమంది సమష్టిగా భూమిచదను కార్యక్రమంలో పాల్గొంటున్నారు.

ఈ ఫిబ్రవరి 3 నుంచి 6 దాకా బీజాపూర్ జిల్లా ఊసూరు ప్రాంతంలోని సింగం, కోమాటి, లింగం, తుముడం, కోండపాడు గ్రామాల మీద అటు నుంచి సిఆర్‌పిఎఫ్ కోయ కమాండోలు, ఇటు నుంచి గ్రేహౌండ్స్ దళాలు దాడులు చేసి ప్రజలను చిత్రహింసలు పెట్టాయి.

ఇటీవల గడ్చిరోలి జిల్లాలో జరిగిన 'ఎన్‌కౌంటర్' పై నిజనిర్ధారణకు వెళ్లిన ఎపిసిఎల్‌సి వల్ల అక్కడి పరిస్థితులు కొంచెమైనా వెలుగు చూసాయి కాని గత ఎనిమిది నెలలుగా ఇటు భద్రాచలం, బీజాపూర్‌ల మధ్యన దండకారణ్యంలో దందహ్యమానంగా ఉన్న పరిస్థితిపై ఏ మీడియా కూడా తగినంత వెలుగు ప్రసరించకపోవడం విషాదం. పిడియా, రేంగం గ్రామాలను పూర్తిగా తగులబెట్టిన దృశ్యాలు ఇటీవల రెండుమూడు తెలుగు టీవీఛానల్స్ మాత్రం ప్రదర్శించాయి.

*(దండకారణ్య స్పెషల్‌జోనల్ కమిటీ కార్యదర్శి రామన్న మీడియాకు విడుదల చేసిన ప్రకటన, సిడి ఆధారంగా)*



---

Statement about ownership and other particulars of periodical **ARUNATARA** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Vijayawada |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 4. Publisher's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 5. Editor's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 6. Name and addresses of Individuals who own the newspaper | : | Chalasani Prasad |

I, Chalasani Prasad, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
(Chalasani Prasad)
Signature of the Publisher

Date : 1st March, 2013

వ్యాసం

# 'నిర్భయ'కు నివాళి-నినదించాల్సిన కోర్కెలు

- డా. నళిని

ఆడ పిల్లలు ఒంటరిగా నిద్ర పోవాలంటే భయం. రాత్రిపూట బస్సు ఎక్కాలంటే భయం. పరిచయం ఉన్న చోటైనా రోడ్డు మీద నడవాలంటే భయం. ఇది ఇవాళ ఆడ పిల్లల్లో, వారి తల్లిదండ్రుల్లో కనిపిస్తున్న భీతి, భయం. 2012 డిసెంబర్ 16 మనదేశం సిగ్గుతో తల దించుకున్న రోజు. డిసెంబర్ 29 దేశమంతటా శోకమనే చీకటి అలుముకున్న శనివారం.

ఢిల్లీ అత్యాచారం ఘటనలాంటివి మన దేశానికి కొత్త కాదు. అది ఇవాళ మొదటిసారిగా జరిగింది కాదు. కానీ అనేక అసంతృప్తులు, అభద్రతలు, నిర్బంధాలు, నిరాశలు ముప్పిరిగొన్న యువత మేల్కొని, భయాన్ని వదిలి కార్యోన్ముఖులయ్యారు. ఇది ఎంతో ఆశాజనకమైన పరిణామం. యువతరం మీద ఆశ ద్విగుణీకృతమైన తరుణం. వారు వెళ్ళగక్కుతున్న కోపంతో నేడు భారతదేశం అట్టుడికిపోతోంది. 'ఇండియా ఇజ్ ఆంగ్రీ!' 'వీవాంట్ జస్టిస్', 'హమారీ బహన్ కో చాహియే ఆజాదీ, మాకో చాహియే ఆజాదీ, హర్ ఔరత్ కో చాహియే ఆజాదీ', 'స్త్రీ పురుష సమానత్వం కావాలి', అంటూ అన్ని వయసుల వారు వీధుల్లో నినదిస్తున్నారు. గొంతులు చించుకుంటున్నారు. న్యాయం కోసం ఉద్యమిస్తున్నారు. ఏ ఇద్దరు కలిసినా ఇదే చర్చ. ఏ మీటింగులో చూసినా ఇదే ఎజెండా. ఏ పత్రిక తెరిచినా ఇవే వార్తలు. ఏ ఛానల్ చూసినా ఇవే ప్రసారాలు.

అయితే, ఈ అకృత్యాలు మనకి కొత్తా? ఇలాంటి అఘాయిత్యాలు మనం ఎప్పుడూ చూడలేదా? దేశ విభజన కాలంలో మతం పేరుతో మూకుమ్మడి అత్యాచారాలు జరిగాయి. రక్తం ఏరులై పారింది. స్త్రీల రోదనలు మిన్నంటాయి. తెలంగాణ సాయుధ పోరాటంలో రాజ్యహింస పరంపరలో మానభంగం ఒక సాధనమయింది. కాశ్మీర్, ఈశాన్య భారతం, గుజరాత్ వాకపల్లి మొదలైనవి మాయని మచ్చలుగా మిగిలాయి. ఇందిరాగాంధీ చనిపోయాక సిక్కు మహిళలు ఇదే బాధను చవి చూశారు. ఇవికాక, ప్రతి పట్టణంలో, పల్లెలో, ఇంట్లో, వీధిలో, స్కూల్లో, హాస్టల్లో, ఆఫీసులో, రైల్లో, బస్సులో, నేల మీద, నీటిలో, ఇలా ఒక చోటని లేక, అనేక చోట్ల రకరకాల వేధింపులు, అత్యాచారాలు, అవమానాలు మహిళకి ఎదురవుతూనే ఉన్నాయి. ప్రతిసారీ నిరసన తెలిపినాగానీ, ఈ విధమైన మూకుమ్మడి నిరసన 70, 80వ దశకాల తర్వాత మళ్ళీ ఇప్పుడే మొదలయింది. ఇది ఎంతో మంచి పరిణామం. ఆశాజనకమైన ముందంజ.

ఇలాంటి సంఘటనల్లో 0.04 శాతం మాత్రమే చట్టం పరిధిలోకి వస్తున్నాయంటే, ప్రజల్ని ఇంకా ఎంత చైతన్యపరచవలసి వస్తుందో అర్థమవుతుంది. ఈ దిశగా ఎక్కడికక్కడ నిరసన సభలు, చర్చా వేదికలు జరుగుతున్నాయి.

ఇటీవల డిసెంబర్ 30న 'యూత్ ఫోరమ్' పేరుతో హైదరాబాదులో 'లామకాన్'లో ఒక సమావేశం జరిగింది. తమకు తామే ప్రశ్నలు వేసుకుంటూ, సమాధానాలు వెతుకుతూ స్త్రీల సమానత్వం దిశగా అక్కడ కొన్ని సూచనలు చేశారు. మొదటి ప్రశ్న-మానభంగాలు ఎవరు చేస్తారు? బలయ్యేది ఎవరు? అసలు అత్యాచారం అనేది కేవలం లైంగిక చర్య కాదని, అది అధికారం, హింసల ప్రతిబింబమని అందరూ అంగీకరించారు. పిల్లలు, వయసు పై బడినవారు, అసహాయులు, పొలాల్లో పనిచేసేవారు, రాజకీయ నిర్బంధానికి గురైనవారు సాధారణంగా బలి పశువులవుతారు. అధికార మదం, పురుషాహంకారం, ప్రతీకారం, హింసాత్మక ధోరణులు కలిగి ఉన్న ప్రతివారు నిందితులు కాగలరు. స్త్రీని ఆస్తిగా చూసి, సాంస్కృతికంగా ఆమె పరిధిని కుదించివేయడం వల్ల ఈ నేరాలు జరుగుతున్నాయి. కాబట్టి స్త్రీని ఆస్తిగా చూడరాదని, ఆడ మగ సమానత్వం గురించి పసితనం నించే పిల్లలకి పాఠాలు నేర్పాలని, వారిని చైతన్యపరచాలని అందరూ భావించారు.

ఇలాంటి నేరాలకి ఉరిశిక్షే సరైనదా లేక వేరే మార్గాలున్నాయా అనే రెండో ప్రశ్నకి అందరూ ఉరిశిక్షని వ్యతిరేకించారు. నేరస్తుడిని అంత తేలిగ్గా వదలకూడదని, అతనికి నొప్పి తెలియని అతి స్వల్పమైన శిక్ష ఉరిశిక్ష అని అన్నారు. ఏళ్ళతరబడి అతన్ని నిర్బంధించి, మానవ... కాలరాసిన నొప్పిని అతను క్షణక్షణం అనుభవించేలా చేయాలని అన్నారు. ఈలోపు అతని మనస్తత్వంలో మార్పు కోసం కౌన్సెలి... వంటి చర్యలు చేపట్టవచ్చు. కులం, వర్గం పేరుతో జరుగుతున్న హింస... అరికట్టడానికి కూడా ఇలాంటి చర్యలే కావాలన్నారు.

అసలు మహిళలు మానభంగాలకి ఎందుకు గురవుతున్నారనే మూడవ ప్రశ్నకి పితృస్వామ్యం, అసభ్య చిత్రాలు, వ్యవస్థీకృతమైన మతం, పురుషాధిక్యతని ధిక్కరించే ధోరణుల వల్ల కలిగిన కసి, స్త్రీలు అధములని చాటే మనుధర్మ శాస్త్రాలు, సాంస్కృతిక పోకడలు కారణాలనే సమాధానం వచ్చింది.

మన కుటుంబాలు, సామాజిక మద్దతు గ్రూపులు అలాంటి బాధితులకి ఏ విధంగా సాయం చేయాలనే ప్రశ్నకి, వారి మీద జాలి చూపవద్దని యువత కోరారు. తప్పు చేసిన వాడిని వెలివేయాలి. బాధితురాలికి చేయూతనివ్వాలి. నిందితులని గుర్తించి, వారికి శిక్షపడే విధంగా బాధితురాలు ధైర్యంగా నిలబడాలి. ఆమెకి సమాజంపై నమ్మకం కలిగేలా మనం వ్యవహరించాలి. ఆమెకి నైతికంగా చేదోడుగా నిలిచి, చట్టపరమైన మద్దతు అందించాలి. స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించాలి.

ఇంత పెద్ద ఎత్తున పురుషులు ఎందుకు ముందుకు వస్తున్నారనే ప్రశ్నకి యువకులు సమాధానం చెప్పారు. ఆ సంఘటన ఘాతుకత్వం తమని కలచివేసిందని, తమ సున్నితత్వాన్ని ప్రశ్నించిందని, భద్రతా భావాన్ని వెక్కిరించిందని, పురుషులలో దాగి ఉన్న అపరాధభావాన్ని అది బయటికి లాగిందని వారు భావించారు.

మొత్తం మీద ఇలాంటి సంఘటనలు నివారించే విధంగా సత్వర చర్యలు చేపట్టాలని, దీర్ఘకాలిక చర్యలు, ప్రణాళికలుకూడా అవసరమని అందరూ అంగీకరించారు.

వ్యాసం

# స్త్రీగా జీవించడం ఇంత కష్టమా?!

- అపరిచిత

మహిళల మీద మూకుమ్మడి అత్యాచారాల ఘటనలు వినడం కొత్త కాకపోయినప్పటికీ మన మనసులు, భావోద్వేగాలు కించపడి, కుంచించుకుపోయి బాధపడడం మనకు అలవాటైపోయినప్పటికీ దేశ రాజధాని నడి వీధుల్లో మెడికల్ విద్యార్థినిపై జరిగిన మూకుమ్మడి అత్యాచార ఘటన... మళ్ళీ మళ్ళీ మనసుని కలిచివేసే దురంతంగా నన్ను వెంటాడుతోంది. ఈ ఘటన గురించి చదువుతుంటేనో, వింటుంటేనో మనకే భరించలేనంత బాధ, కసి, కలుగుతోంటే ఇదంతా నిస్సహాయంగా భరించిన ఆ యువతి మానసిక, శారీరక పరిస్థితి ...

'జననాంగ విధ్వంసం' ఈ పదమెక్కడో చదివాను. లైంగిక అత్యాచారాన్ని కేవలం శారీరక విధ్వంసంగా చూడగలమా? ఎన్నో భావోద్వేగాలను తుదకంటూ పెరికి పారవేసే విక్రతక్రీడ కాదూ?! మనస్సు పొరల్లో పాతుకుపోయి బహుశా బాధితురాలు చనిపోయేదాకా వెంటాడే భయంకరమైన భయం! అభద్రతా భావం!! మనిషి మీద మరో మనిషికి ఉండే నమ్మకాన్ని, మానవత్వపు విలువల్ని మరెన్నటికీ విశ్వసించనివ్వని దారుణం!!!

కొన్నిసార్లు కాకతాళీయంగా కొన్ని సంఘటనలు మీడియాలో ముఖ్య విషయంగా ప్రసారమవుతాయి. ఢిల్లీ సంఘటన మీద దేశ వ్యాప్తంగా నిరసనలు హోరెత్తుతూ ఉండగానే, ముఖ్యంగా ఢిల్లీలో యువత అన్ని రకాల నిబంధనలు తోసిరాజని పెద్ద ఎత్తున ఆందోళనా ఉద్యమాలు జరుపుతుండగానే, పేపర్లలో ఎలక్ట్రానిక్ మీడియాలో కూడా మహిళల మీద జరుగుతున్న రకరకాల సంఘటనలు వెలుగులోకి వస్తూనే ఉన్నాయి. ప్రతిరోజూ ఇటువంటి దారుణాలు మనల్ని పలకరిస్తూనే ఉన్నాయి. మహిళల మీద హింసని వ్యక్తిగతంగా కాక సామాజిక భద్రతాంశంగా చూసినపుడు మాత్రమే మనం ఇటువంటి చర్యలకు సరైన పరిష్కారాలు కనుక్కోగలం.

మహిళలపై పెరుగుతున్న అత్యాచారాల గురించి మాట్లాడడమంటే సమాజంలో రోజు రోజుకి తరిగిపోతున్న విలువల్ని గురించి మాట్లాడడమే! స్త్రీని కేవలం లైంగిక వస్తువుగా, అవయవాల కుప్పగా, అవమానించడానికి తగిన ఒక శరీరంగా చూసే సంస్కృతిని ఖండించడమే!!

---

- సత్వర న్యాయం అందించే విధంగా ప్రత్యేక కోర్టుల్ని ఏర్పరచాలి.
- పది రోజుల లోపే న్యాయం అందాలి.
- అత్యాచారాన్ని బెయిలు లేని నేరంగా పరిగణించాలి.
- నిందితుల్ని శిక్షించడానికి చట్టాలను పటిష్టం చేయాలి.
- మరెప్పుడూ ఎవరూ ఇలాంటి నేరాలు చేయని విధంగా శిక్షలను కఠినతరం చేయాలి.
- రాజకీయ ప్రక్షాళన జరగాలి.
- నేరస్తుల్ని రాజకీయాల్లోకి రాకుండా నిషేధించాలి.
- పోలీసులకి, రాజకీయ నాయకులకి విషయ పరిజ్ఞానం పెరగాలి.
- వారు బాధితుల పట్ల సానుభూతితో వ్యవహరించాలి.
- నేరస్తుల పట్ల కఠినంగా ఉండాలి
- మహిళల నడత మీద, దుస్తుల మీద అమానవీయ వ్యాఖ్యలు చేసే పెద్దలందరినీ గర్హించాలి.
- ప్రజలకి క్షమాపణ చెప్పించాలి.
- ఉన్నతమైన పదవుల్లో ఉండి అలా మాట్లాడితే వెంటనే రాజీనామా చేయాలి.

దీర్ఘకాలిక చర్యల మాటకొస్తే...

- స్త్రీ పురుష సమానత్వంపై పిల్లలకి చిన్న వయసు నుంచే సరైన అవగాహన పెంచాలి. స్త్రీని గౌరవించడం నేర్పాలి. ఆడ పిల్లల్లో ధైర్యం పెంచాలి. నిజాలను నిర్భయంగా బయటపెట్టి న్యాయాన్ని పొందే సమరశీలత వారిలో పెంపొందాలి.
- స్త్రీలని కించపరిచే సినిమాలను, సీరియళ్ళను నిషేధించాలి. వాటిని ప్రసారం చేసే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలి.
- టి.విల్లో, సినిమాల్లో అభ్యంతరకరమైన ఘట్టాలను సెన్సారు బోర్డు ఖచ్చితంగా కత్తిరించాలి. ప్రజల మనోభావాలను గౌరవించాలి.
- పురుషస్వామ్య భావజాలాన్ని ఖండించాలి.

తరతరాలుగా స్త్రీని చిన్నచూపు చూసే సమాజం ఒక్కసారిగా మారిపోదు. కానీ ప్రజల ఆగ్రహం మార్పుని కోరుతోంది. స్త్రీలకి భద్రతని డిమాండ్ చేస్తోంది. చట్టాలను స్త్రీలకి అనుకూలంగా సవరించి న్యాయం చేయడం ఒక ఎత్తు. సమాజంలో స్త్రీల స్థానాన్ని మెరుగుపరిచి, పురుషుడితో సమానంగా చూడడం రెండవ ఎత్తు. స్త్రీ అధమురాలని, ఆమెది రెండవ శ్రేణి పౌరసత్వం అని నమ్మేవారందరికీ సరైన శిక్షణనివ్వాలి. నేరస్తులకి కూడా శిక్షణతోపాటు శిక్షణ అవసరం. పోలియో నివారణ కోసం జరిగే విస్తృత క్యాంపెయిన్‌లాంటిది స్త్రీల స్థితిగతులపై జరగాలి. అడుగడుగునా సమానత్వంపై అవగాహనని ప్రచారం చేయాలి. ఇంటా, బయటా చిన్న వయసు నుంచే ఈ భావాలని ప్రేరేపించాలి. అమానుషత్వానికి గురైె కూడా ధైర్యంగా నిలిచిపోరాడుతున్న మహిళని ఆదర్శవంతంగా చూపాలి. ఆడ పిల్లలందరికీ ఆత్మ రక్షణ నేర్పాలి. జాగ్రత్తలు చెప్పాలి.

దిగజారిపోతున్న సాంస్కృతిక విలువల్ని ప్రక్షాళన చేసి ఆరోగ్యవంతమైన సమాజాన్ని రూపొందించడంలో రచయితలు, కళాకారులు, విద్యావేత్తలు, తల్లిదండ్రులు ప్రముఖ పాత్ర వహించాలి. సిగ్గుచేటుగా మిగిలిన దశ నుంచి దేశాన్ని రక్షించి మహోన్నతంగా నిలబెట్టడంలో ప్రతి ఒక్కరూ పాలుపంచుకోవాలి. యువతరం చూపిస్తున్న తెగువ, పరిపక్వత ఎంతో ఆశాజనకంగా ఉంది. దేశ పురోభివృద్ధికి వారే వెన్నెముక. వారే అందరి ఆశ.

*(2013 జనవరి 5న యువత చేపట్టిన 'అర్ధరాత్రి కవాతు' జయప్రదమైన సందర్భంగా)*



మన సమాజం ఎటువైపు పోతోంది? ఈ ఒక్క ఘటనే కాదు, మానవత్వపు విలువలు లేని ఏ సంఘటనైనా సరే ఎందుకు జరుగుతోంది? విచ్చలవిడి సంస్కృతి, వికృతత్వం, అశ్లీలత్వాన్ని పెంచిపోషిస్తూ మన చుట్టూ వాతావరణం, డబ్బుకు తప్ప భావాలకు విలువనివ్వని తనం....

'ఎంజాయ్‌మెంట్, కొత్తదనం' ఇటువంటి పదాలను విరివిగా ప్రయోగిస్తూ, ప్రచారం చేస్తూ మార్కెట్‌ను విస్తరించుకుంటున్న వినియోగదారీ ప్రపంచం..' 'కన్స్యూమరిజం'... తమ ఉత్పత్తులకు మార్కెట్‌ను సృష్టించుకోవడం కోసం స్త్రీ శరీరాన్ని సాధనంగా వాడుకుంటున్న వాణిజ్య విలువలు మన చుట్టూ అల్లుకుపోయి, ముడులు బిగిసిపోయాయి. రోజు రోజుకి వ్యాపార మయమైపోతున్న ఈ సమాజంలో ప్రాకృతిక విలువల్ని, మానవ సహజమైన భావోద్వేగాలను వికృతం చేస్తున్న సంస్కృతి పెరిగిపోతోంది. స్త్రీల పట్ల గౌరవ భావం సరే అదలా ఉంచండి! స్త్రీని ఒక మనిషిగా చూసే ధోరణి కూడా తగ్గిపోతోంది. ఎక్కడ చూడండి; డబ్బు, సినిమాలు, సెక్స్, ఎంజాయ్‌మెంట్... టి.వి. ఆన్ చేయగానే.. ఇద్దరు వ్యక్తుల ఏకాంతానికి పరిమితమవ్వాల్సిన దృశ్యాలు కళ్ళముందు లైవ్‌లోలాగా కన్పిస్తుంటాయి. 'మసాలా' సినిమాలు ప్రత్యేకంగా 'యువత' కోసం అంటూ విరివిగా సమాజం మీద వెదజల్లుతున్న సినిమా ప్రపంచం. మీరు పెర్‌ఫ్యూమ్ వాడినా, లేక ఫలానా కంపెనీ రేజర్‌తో షేవింగ్ చేసుకున్నా దారినపోయే స్త్రీలందరూ మీ మీద పడిపోతారనే ప్రచారమో, లేదంటే ఫలానా కంపెనీ ఫెయిర్‌నెస్ క్రీమ్ పూసుకుని అందాన్ని ఎరగావేసి ఉద్యోగాన్ని సంపాదించమనో లేదా పెళ్ళికొడుకుని ఆకర్షించమనో చెప్పే వ్యాపార ప్రకటనలు.. ఇవన్నీ కూడా స్త్రీని వ్యక్తిత్వం లేని ఒక మాంసపు ముద్దగా చూపిస్తున్నాయే తప్ప.. అవకాశం ఉంటే లేదా అవకాశాల్ని సృష్టించుకుని అయినా స్త్రీలు తమ లక్ష్యాన్ని అధిగమించగలిగే వ్యక్తిత్వ మూర్తులుగా చూడలేకపోవడమే!

21వ శతాబ్దం... పోటీ ప్రపంచం... స్త్రీలు, పురుషులతో సమానంగా అన్ని రంగాల్లోకి దూసుకుపోతున్నారని రోదసీలో ప్రయాణిస్తున్న మహిళల్నో లేదా కార్పొరేట్ సంస్థల అధిపతుల్నో, అదీకాక వేళ్ళ మీద లెక్కపెట్ట తగినంత మంది రాజకీయ పార్టీల మహిళా ప్రముఖుల్నో నిదర్శనంగా చూస్తున్నాయే తప్ప-

పిల్లలకు పట్టెడు మెతుకులు పెట్టడం కోసం ఎర్రటి ఎండలో ఆరుగాలం కష్టపడే అక్క చెల్లెళ్ళ చెమట చుక్కల తడి మనల్నెందుకు తాకలేకపోతోంది?

కుటుంబావసరాల్ని తీర్చడం కోసమో లేదా కనీసావసరాలైన కూడు, గుడ్డ, గూడు కోసం తమ శరీరాల్ని ఫణంగా పెట్టి దుర్భరమైన జీవితం గడుపుతున్న నిస్సహాయ స్త్రీల ఆవేదనల్ని మనం ఎందుకు చూడలేకపోతున్నాం?!

ఆర్థిక బాధలు తాళలేకనో, మగని అనుమానపు అవమానాల్ని భరించలేకనో ముక్కుపచ్చలారని పసికందుల్ని చంపి, తాము చచ్చిపోతున్నవారి గురించి మనం ఎందుకు ఏమీ చేయలేకపోతున్నాం?

మీరనవచ్చు, ఇలాంటివి విన్నప్పుడో, చదివినప్పుడో బాధ పడకుండా ఎలా ఉండగలం అని! కేవలం బాధ పడడమొక్కటే కాదు ఇక్కడ కావల్సింది సమస్య మూలాల్ని వెతకడం... పరిష్కారాల్ని అమలులో పెట్టడం మనం చేయవలసిన తక్షణ కర్తవ్యం!

కుటుంబ హింస స్త్రీని ఒక పక్క అణచివేస్తోంటే, రాజ్యహింస, సామాజిక హింస స్త్రీల జీవనశాఖల్లోని శక్తిని హరించివేస్తున్నాయి. హింస స్వరూపం మారుతుందేమో కాని దాని స్వభావం ఒక్కటే..

ఎవరి మీదనైనా ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నపుడో లేదా ఎవరినైనా తిట్టాలనుకున్నపుడో ఆ వ్యక్తికి సంబంధించిన స్త్రీల మీదనే బూతు ప్రయోగాలన్నీ.. ఆ వ్యక్తి కుటుంబానికి సంబంధించిన స్త్రీల మీద దాడి లేదా లైంగిక అత్యాచారం చేస్తేనో ఆ వ్యక్తి మీద పగ తీర్చుకున్నట్లుగా భావించే భూస్వామ్య సమాజంలో బతుకుతున్నాం మనం..

స్త్రీల విలువల్ని వలువల్ని ఊడదీసి ఫ్యాషన్ షోల పేరుతో ముప్పాతిక నగ్నంగా ర్యాంప్‌వాక్ చేయించే పెట్టుబడిదారీ విషవలయంలో మన జీవన చక్రం నిర్విరామంగా తిరుగుతోంది.. ఉదాహరణలు చెప్పుకుంటే పుస్తకాలే పట్టనన్ని సంఘటనలు మనం చూస్తూనే ఉన్నాం.. కానీ.. మనల్నందర్నీ బాగా కదిలించి... కొన్ని సంవత్సరాల వరకు వెంటాడి.. ఇప్పటికీ మానని గాయంలా మిగిలిపోయిన 'గుజరాత్ మారణ హోమం' వికృత రాజకీయ క్రీడలో భాగంగా పాశవికంగా స్త్రీల మీద లైంగిక అత్యాచారాలు చేసి, నిండు గర్భిణి పొట్టను చీల్చి, ఇంకా కనులు తెరవని పసికందుని (గర్భంలోని పిండాన్ని) ఎగరేసి మరీ కత్తితో నరికిన దుర్మార్గం...

బిడ్డల ముందు తల్లిని, భర్త ముందు భార్యని, తండ్రి ముందు కూతుర్ని, అన్న ముందు చెల్లెల్ని సామూహికంగా అత్యాచారం చేసి ముస్లింలకు తగిన బుద్ధి చెప్పామనుకునే కర్కోటకులున్న సమాజం మనది.. ముస్లిం స్త్రీల మీద లైంగిక అత్యాచారాలు చేయడం ద్వారా హిందూ సంతతిని పెంచాలనే మతతత్వ పార్టీల (బి.జె.పి., ఆర్.ఎస్.ఎస్., సంఘ్ పరివార్, వి.ఎచ్.పి) రహస్య ఎజెండాకు బలైపోయిన ఆ స్త్రీల గుండె మంట ఎప్పటికైనా చల్లారుతుందా?! వారి జీవితాల్ని, అనుభూతుల్ని, బాల్యాన్ని ఛిద్రం చేసిన రాజ్యహింస, మతతత్వ హింస తాలూకు భయంకర అనుభవాలు ఆ పసి పిల్లలు ఎప్పటికైనా మరిచిపోగలరా?! పైగా ఇటువంటి ఘోరమైన మారణకాండకు బాధ్యుడైన నరేంద్రమోడి, అతగాడిననుసరించే రాజకీయ నాయకులు మూడోసారి విజయగర్వంతో విర్రవీగుతున్న ఈ రాజ్యంలో మహిళల రక్షణ, భద్రత.. నీటి మీద రాతలు కాదా?! అసలు ఆశించగలమా?!

ఇదంతా నాణేనికి ఒక వైపైతే మరో పక్క. 'గ్రీన్‌హంట్' పేరుతో ఆదివాసులను వారి జీవితాల్నుండి నిర్వాసితుల్ని చేస్తూ, వారి ప్రకృతిని వారి నుండి దూరం చేస్తూ, వికృతంగా ఆదివాసీ మహిళల మీద లైంగిక అత్యాచారాలు చేస్తున్న రాజ్యం.. మనం ఎన్నుకున్న 'గౌరవనీయ ప్రభుత్వమే'... నక్సలైట్లకు సహకరిస్తున్నవారినో, లేదా నక్సలైట్లనో అణచివేయాలనే పేరుతో ఆ సాకుతో 'సల్వాజుడుం' లాంటి గూండాల్ని తయారు చేసి ప్రభుత్వమే వారికి ఆయుధాలిచ్చి, జీతాలిచ్చి పోషిస్తూ, వారి వేలుతో వారి కన్నే పొడిచినట్లుగా ఆదివాసులను ఆదివాసులపైకి ఉసిగొల్పుతూ, పసిపాపల నుండి ముదిమి మీద పడిన ముసలమ్మల మీద కూడా అత్యాచారాలు చేయిస్తూ, రాజ్యాంగాన్ని ప్రజాస్వామ్యయుతంగా అమలు జరుపుతున్నామని ప్రచారం చేసుకుంటున్న భ్రష్ట రాజకీయాలు నడుపుతున్న నేతలున్న దేశం మనది...

పసిబిడ్డ తల్లిని, వదిలివేయండని ప్రాధేయపడుతున్నా బాలింతరాలి రొమ్ములు పిండి పాలు వస్తున్నాయా లేదా అని పరీక్షించగలిగిన మృగత్వం ధైర్యంగా తలెత్తుకు తిరుగుతున్న సమాజం ఇది... పైగా ఇంత పాశవికతను, వికృతత్వాన్ని పెంచి పోషిస్తున్నది ఈ ప్రభుత్వమే!

ఈ రాజకీయ నాయకులేే!! ఈ రాజ్యమే!!! రాజకీయ నాయకులంటే గుర్తొచ్చింది.. కొన్ని నెలల క్రితం ఒక తెలుగు దినపత్రికలో ఒక వార్త వచ్చింది.. ఈ వార్త ఎందుకో ఎక్కువగా ప్రచారంలోకి రాలేదనుకుంటా లేదా నేను మిస్సయ్యానేమో తెలియదు. వార్తేమిటంటే.. 'ఈజిప్టులో' చనిపోయిన భార్య శవం మీద కూడా భర్తకి హక్కుంటుంది. కాబట్టి చనిపోయిన ఆరు గంటల వరకూ భార్య శరీరంతో భర్త శారీరక సంబంధం పెట్టుకోవచ్చు'. దీన్ని ఒక చట్టబద్ధ హక్కుగా చేసే ప్రతిపాదన చేశాడో ప్రబుద్ధ రాజకీయ నాయకుడు... అతనిలాంటి రాజకీయ నాయకులు కొందరు దీన్ని చట్టంగా తెచ్చే ప్రయత్నాలు కూడా చేస్తున్నారట... సహజంగానే అంతర్జాతీయ హక్కుల సంఘాలు, ఇంటర్నేషనల్ ఉమెన్ కౌన్సిల్ ఇటువంటివన్నీ తీవ్రంగా వ్యతిరేకించాయి. అక్కడి విపక్షాలు కూడా వ్యతిరేకిస్తున్నాయి కూడా! అయితే ఇది చట్టమవుతుందా? కాదా? అన్నది కాదు ప్రశ్న..! ఇలాంటి చెత్త ఆలోచనలు చేయగల మనుషులు... రాజకీయ నాయకులు మనల్ని ఏలుతున్నారే అని సిగ్గుపడాలి మనందరం! తనతో జీవితాన్ని అనుభూతుల్ని పంచుకున్న సహచరి తనకెప్పటికీ కనిపించనంత దూరం వెళ్ళిపోతోంటే... ఆమె నిర్జీవ శరీరంతో లైంగిక సంబంధం పెట్టుకోవాలనే ఆలోచన రావడమంటే స్త్రీల పట్ల ఇటువంటి వ్యక్తులకు ఎటువంటి అభిప్రాయాలున్నాయో మనకు స్పష్టంగా అర్థమవుతోంది.

స్త్రీల మీద లైంగిక అత్యాచారాలు జరుగుతున్నాయంటే 'ఆ స్త్రీల వస్త్రధారణ సరిగ్గా లేదనో, కవ్వించే విధంగా వారి ప్రవర్తన ఉండి ఉంటుందనో, లేదా ఆడపిల్లలు రాత్రుళ్ళు ఒంటరిగా ఎలా తిరుగుతున్నారనో' ఇలా... ఎంత బుద్ధి తక్కువ అభిప్రాయాలో అనిపిస్తుంది. వీటిని వింటూంటే! పది సంవత్సరాలు నిండని పసిపాపలు.. నడుం వంగి, చర్మం ముడుతలు పడిన ముదివగ్గులు ఈ అత్యాచారాలకు వేధింపులకు పరిష్కారాలేమిటి, ఎలాంటి వస్త్రధారణ చేసుకుంటారు?

ఆలోచిస్తే...

మొన్న ఢిల్లీలో జరిగిన మూకుమ్మడి అత్యాచార ఘటనే కానివ్వండి... వావి వరుసలు లేకుండా, వయసుతో సంబంధం లేకుండా స్త్రీల మీద జరుగుతున్న లైంగిక అత్యాచారాలు కానివ్వండి.. సమాజాన్ని కేన్సర్ వ్యాధిలా బాధిస్తున్నాయి.. ఇటువంటి సంఘటనలేమైనా జరిగినప్పుడు చాలా మంది వ్యక్తులు, ప్రజా సంఘాలు, వివిధ రకాల సంస్థలు తమ నిరసనను, ఖండనను అనేక రకాలుగా వెలిబుచ్చుతున్నాయి. కొన్నిసార్లు ఈ ఆందోళనలు ఉద్యమరూపాన్ని సంతరించుకుంటున్నాయి కూడా! వేల మంది ప్రజలు వీధుల్లోకి వచ్చి ఐక్యమై నిరసన తెలియజేయడం, ఉద్యమించడం అనేది ఆహ్వానించదగిన పరిణామమే! అయితే ఇక్కడ గమనించదగిన విషయమేమంటే 'వీటి ప్రభావం ఎంతవరకు ఉంటుంది? ఈ వికృతత్వాన్ని పునరావృతం కాకుండా ఎంత వరకు అడ్డుకోగలవు? అని!

ఉదాహరణకు ఢిల్లీ ఘటన మీద ఇంత మిలిటెంట్‌గా, ఉధృతంగా ఉద్యమాలు నిరసనలు జరుగుతుండగానే మరెన్నో సామూహిక అత్యాచార ఘటనలు వెలుగులోకి వచ్చాయి, వస్తూనే ఉన్నాయి.

ఇటువంటి దారుణమైన సమాజంలో మన పసిపాపల్ని మనం కాపాడుకోవాలి,.. మనల్ని మనం కాపాడుకోవాలి... మన పిల్లలకు డబ్బు విలువలు నేర్పించడం కాదు మానవత్వపు విలువల్ని నూరిపోయాలి. సాటి మనుషుల పట్ల దయగా, ప్రేమతో వ్యవహరించడం నేర్పించాలి. సమాజం పట్ల బాధ్యతను తెలియచెప్పాలి... స్త్రీలను గౌరవించడం అనేది చాలా సహజమైన అనివార్యమైన విషయంగా తోచేంతగా నేర్పించాలి.

పోటీ ప్రపంచంలో ర్యాంకుల, మార్కుల వరదలో కొట్టుకుపోతూ సామాజిక బాధ్యతలంటే ఏంటో తెలియని యువతరానికి సరియైన దిశా నిర్దేశం చేయగల ప్రజాస్వామిక సంఘాలను, సంస్థలను ప్రోత్సహించి వారితో కలసి పని చేయడం ద్వారా సమస్య తీవ్రతను కొంత మేరకు తగ్గించవచ్చు.

స్త్రీలకు కావల్సిందిప్పుడు నిర్వేదం కాదు.. ఆయుధం! తనను తాను రక్షించుకోగలిగే ఆత్మవిశ్వాసం... ఎప్పుడు ఎటువైపు నుండి ఏ ఆపద వచ్చినా తనను తాను రక్షించుకోవడమే కాదు.. ఇతరులను కూడా రక్షించగలిగే సత్తా... కావాలి. మన ఆలోచనల్ని, భావాల్ని సాధనాలుగా మార్చుకోవాలి. సమాజంలో పెరిగిపోతున్న వికృత విలువల్ని తుదకంటూ మూలాల నుండి పెరికి పారవేయాలంటే సామాజిక మార్పొక్కటే శాశ్వత పరిష్కారం.. అటువంటి సామాజిక మార్పుల్లో భాగంగా స్త్రీ విముక్తి నినాదంతో పనిచేసే సంఘాలలో కలిసి పని చేయడం ద్వారా సమాజ మార్పుకు వేసే సరికొత్త పునాదిలో మనవంతు సహకారం అందించాలి.

ఈ సమస్యలకు తాత్కాలిక పరిష్కారాల రూపంలో మనం కొన్నింటిని చెప్పుకోవచ్చు.

**1. సామాజిక బహిష్కరణ..**

అటువంటి తప్పులకు పాల్పడిన వ్యక్తులను బాగా ప్రచారం చేసి అవమానించి సమాజం నుండి ఛీత్కరించి తరిమికొట్టాలి... ఎక్కడికెళ్ళినా.. అతనికి స్థానం లేకుండా చేయడం ద్వారా కొంత మేరకు శిక్ష విధించవచ్చు.

**2. నేర తీవ్రతను బట్టి ప్రజలే బహిరంగంగా శిక్ష అమలు జరపడం..**

ఉదాహరణకు.. కొన్నేళ్ళ క్రితం నాగపూర్ కోర్టులోనే ఒక రౌడీ రేపిస్టును ప్రజలందరూ ముఖ్యంగా మహిళలంతా ఏకమై కొట్టి చంపారు... ఇటువంటి శిక్షలు అమలు జరపడం ద్వారా ఇటువంటి ఆలోచనలు ఎవరైనా చేయాలంటే కూడా భయం పుట్టాలి. అన్ని సందర్భాల్లో చంపడమే అని కాదు కాని తీవ్రంగా కొట్టడం, కొన్ని సందర్భాల్లో కాళ్ళు, చేతులు విరగ్గొట్టడం, నేర తీవ్రతను బట్టి మహిళల పట్ల గౌరవ భావం పెంచే విధంగా అనేకరకాలుగా శిక్షలు వేయవచ్చు..

అయితే వికృతత్వం, అశ్లీలత్వం, రాజ్యహింస, కుటుంబ హింస, మతతత్వ హింస పెనవేసుకుపోయి జటిలమైపోయిన ఈ సమాజంలో ఇవేవీ కూడా శాశ్వత పరిష్కారాలు కావు. సమస్య పరిష్కారానికి కావలసింది 'మూలాల్ని మార్చడం'. మానవత్వపు విలువల్ని పెంపొందించడం! అంతిమంగా సమాజాన్ని మార్చడం!! సమాజాన్ని మార్చడానికి కృషి చేయడమే మన ముందున్న లక్ష్యం...

మన మధ్య ఉన్న కుల, మత, ప్రాంత, లింగ భేదాల్ని అధిగమించి స్త్రీ పురుషులందరూ సమానమైన జీవన విలువలతో కూడిన జీవితాన్ని శ్వాసించే సమసమాజం దిశగా మనం కదం కలిపి పోరాడాలి!

పల్లె, పట్టణం ఎక్కడున్నా కానివ్వండి ప్రతి మహిళా సాయుధమవ్వాలి... వికృత సమాజపు కబంధ హస్తాల్నుండి మన బిడ్డల్ని రక్షించుకోవాలంటే పోరాటమే మార్గం!!

సమ సమాజమే సమస్యలన్నింటికీ
పరిష్కారం!!!!



వ్యాసం

# అఫ్జల్‌గురు ఉరి - మీడియాలో హిందుత్వం

- పాణి

అద్వానీ ప్రధాని అయితే తప్ప తనకు 'విముక్తి' దొరకదని ఎదురు చూసిన అఫ్జల్‌గురును ఉరి తీసే అవకాశం కాంగ్రెస్‌పార్టీ వదులుకోదు. బి.జె.పి హిందుత్వ కార్డును రాబోయే సార్వత్రిక ఎన్నికల్లో ఎంత జోరుగా వాడుకోదల్చుకున్నదో పసిగట్టిన కాంగ్రెస్ ఉరుకులు పరుగుల మీద తన హిందుత్వాన్ని చాటుకోడానికి ఓ కాశ్మీరీ ముస్లింను ఉరి తీసి తన దేశభక్తిని ప్రకటించుకున్నది. ఈ దేశంలో దేశభక్తి అన్నా, సార్వభౌమాధికార పరిరక్షణ అన్నా హిందుత్వమే అని మరోసారి తాజాగా రుజువైంది. పార్లమెంట్ మీది దాడి కేసులో అఫ్జల్‌గురుపై నేరారోపణలు రుజువు కాకపోయినా ప్రజాభీష్టాన్ని పరిగణనలోకి తీసుకొని న్యాయ వ్యవస్థ ఉరి శిక్ష ఖరారు చేసింది.

పార్లమెంట్ మీద దాడి జరిగినప్పుడు కొందరికైనా చాలా సహజంగానే భగత్సింగ్ పార్లమెంట్‌లో బాంబు వేసిన ఘటన గుర్తుకు వచ్చి ఉంటుంది. ఆ తర్వాత ఆయన ఆ బాంబు దాడి గురించి ఇచ్చిన విశ్లేషణ కూడా గుర్తొచ్చే ఉంటుంది. అప్పటికీ, ఇప్పటికీ పార్లమెంట్ విషయంలో 'భారతీయుల' అభిప్రాయాలు మారి ఉండవచ్చుగాని, కాశ్మీరీలకైతే ఏ మార్పూ లేదు. పార్లమెంట్ మీద దాడి ఘటనలో జన నష్టం బాధాకరమే అయినా, అవాంఛనీయమే అయినా భారత సార్వభౌమాధికారానికి ప్రతీకగా చెప్పుకొనే ఆ కట్టడం మీద కాశ్మీరీలు ఎందుకు దాడి చేశారు? అనేది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఆ దాడిలో బాధిత కుటుంబాల మనోభావాలను అర్థం చేసుకోగలం.. కానీ ఆనాటి నుంచి అఫ్జల్‌గురు ప్రస్తావన వచ్చినప్పుడల్లా మీడియా ప్రతిస్పందనను ఎలా అర్థం చేసుకోవాలి? ఆయన ఉరి వార్తను మీడియా ఎంతో ఆనందోత్సాహాలతో ప్రసారం చేసింది. ఒక వేళ ఆయనను ఉరి తీయడం ప్రజాభీష్టమని న్యాయ వ్యవస్థవలె ఈ నాలుగో మూల స్తంభం కూడా భావించిందా? అదే నిజమైతే ప్రజాస్వామ్యంలో మిగతా మూడు వ్యవస్థలకు ప్రజల తరఫున కాపలా కుక్కలా ఉండాల్సిన పత్రికా, మీడియా వ్యవస్థ కూడా వాటిలో కలిసిపోయినట్టు కాదా? అప్పుడు ప్రజాస్వామ్యానికి? అవకాశమేముంది?

అఫ్జల్‌గురును ఉరి తీయడం ఒక సత్కార్యమని, అది చాలా కాలం వాయిదా పడిందని, ఎట్టకేలకు ఈనాటికి అది అమలైందని ఊగిపోతూ ప్రచారం చేసింది. మీడియాలో పని చేసే వ్యక్తులకు సొంత అభిప్రాయాలు ఏవైనా ఉండవచ్చు. కానీ వార్తా ప్రసార రంగం మొత్తంగానే చాలా స్పష్టంగా ఉరి అనుకూల వైఖరి తీసుకున్నదని పత్రికలు, టి.వి. ఛానల్స్ నిరూపించుకున్నాయి. అందువల్లే సంఘపరివార్‌వలె మీడియా కూడా అఫ్జల్‌గురు ఉరిని సంబరం చేసుకున్నది. పాకిస్తానీ కాబట్టి కసబ్ విషయంలో మరింత ఉన్మత్తంగా సెలబ్రేట్ చేసుకొని ఉండవచ్చుగాని, అఫ్జల్‌గురు విషయంలో కూడా తక్కువేం లేదు. చరిత్ర తెలియకపోవడం, లేదా దాన్ని ఘోరంగా వక్రీకరించడం సంఘపరివార్ సొత్తు. మీడియాకు కనీసం తన రంగానికి సంబంధించిన ఎథిక్స్‌పట్ల కూడా ఎందుకు పట్టింపు లేకుండా పోయింది? రకరకాల ఘటనల్లో ముస్లింలను ఉరి తీసినప్పుడల్లా దేశభక్తి పూనకంతో పౌర సమాజానికంటే ఎక్కువగా ఎందుకు ఊగిపోతోంది? ఈ సందర్భాలన్నిటిలో దేశభక్తి అంటే హిందుత్వ అనే సంగతి ప్రత్యేకంగా చెప్పాల్సిన పనే లేదు గదా.

ఈ ఆనందోత్సాహ వార్తా ప్రసారం, వార్తా రచనతోపాటు తెలుపు నలుపులో అందరికీ పంచిపెట్టిన రెండు ముఖ్యమైన విషయాలు ఉన్నాయి. ఉరికంబం ఎక్కడానికి ముందు కూడా అఫ్జల్‌గురులో ఎలాంటి పశ్చాత్తాపం కనిపించలేదని పత్రికలు రాశాయి. ఏ విషయంలో ఆయన నుంచి పశ్చాత్తాపం కోరుకున్నాయి? పార్లమెంట్ మీది దాడి కేసులో నేరస్తుడు కాకపోయినా, సాక్ష్యాధారాలు లేకున్నా... ఉరికంబం ఎక్కుతున్న వ్యక్తికి ఆ విషయంలో ఎందుకు పశ్చాత్తాపం ఉంటుంది? నిజానికి పశ్చాత్తాపానికి గురి కావాల్సింది ఈ దేశంలోని రాజ్యాంగ వ్యవస్థలు. ఎంత దుర్మార్గమైన నేరం చేసినవాళ్ళనైనా ఉరి తీసి వాళ్ళ జీవించే హక్కును కాలరాయడం నాగరికమనిపించుకోదు.. ఇది ప్రజాస్వామ్యానికి అవమానకరమని అవి సిగ్గుపడాలి. శిక్షాస్మృతి అంబులపొదిలో దాగి ఉన్న అమానుష ఉరి శిక్షను రద్దు చేయించలేకపోతున్న ప్రజాస్వామికవాదులు ఆవేదన పడాలి. కానీ పత్రికలకు ఈ సోయి లేకపోగా ఆయన పశ్చాత్తాపం చెందలేదనే అదనపు చార్జిషీట్‌ను ఆయన మీద మరణానంతరం కూడా రికార్డు చేశాయి. దీనికి కారణం ఏమంటే-పత్రికలు ఆయనను దారి తప్పిన వ్యక్తిగా భావిస్తున్నాయి. అలాంటి కథనాలు కూడా రాశాయి. దారి తప్పిన వాడికి ఈ చివరి క్షణాల్లో అయినా తన దారి పట్ల పశ్చాత్తాపం కలగాలని కోరిక.

అఫ్జల్‌గురు ఎంచుకున్న మార్గం పట్ల ఎవరికైనా భిన్నాభిప్రాయాలు ఉండవచ్చు. కానీ కాశ్మీరీల పోరాటాన్ని అర్థం చేసుకోకపోతే ఈ ఉరి శిక్ష కూడా అర్థం కాదు. అప్పుడు ఆయన కళ్ళలో పశ్చాత్తాపం కోసం వెతకరు. ప్రజా ప్రాతినిధ్య ప్రక్రియ ద్వారా పార్లమెంట్‌కు వెళ్ళిన నాయకులు అక్కడ కూర్చొని నిత్యం దేశ ద్రోహానికి, ప్రజాద్రోహానికి పాల్పడుతున్న దానికంటే పార్లమెంట్ మీద దాడి ఘోరమైన అపచారం అవుతుందా? తమ జాతిని విధ్వంసం చేస్తున్న భారత పార్లమెంట్‌ను శత్రు సంకేతంగా భావించడం కాశ్మీరీల ప్రతిఘటనా చైతన్యమే అవుతుంది కాని నేరమవుతుందా? భగత్సింగ్ స్ఫూర్తిని స్వీకరించినవాళ్ళకు ఈ

ప్రకటన:

# అఫ్జల్‌గురు ఉరిశిక్ష అప్రజాస్వామికం, అనాగరికం భారత శిక్షాస్మృతి నుండి ఉరిశిక్షను తొలగించాలి

భారత ప్రభుత్వం అఫ్జల్‌గురును ఉరితీసి చంపడం అప్రజాస్వామిక, అనాగరిక చర్య. పార్లమెంటుపై దాడి కేసులో అఫ్జల్‌గురు ప్రమేయంపై ఎటువంటి ఆధారాలు లేవని చెప్పూనే సుప్రీంకోర్టు కేవలం దానికి పౌరసమాజపు సమ్మతి ఉందని, ఉరిశిక్ష విధించడం ఏ విధంగా చూసినా చట్ట విరుద్ధమే. చివరికి న్యాయాన్ని క్షమా'భిక్ష'కు వదిలేయడం ఎటువంటి ప్రజాస్వామ్యమో ప్రభుత్వమే చెప్పాలి. లక్షలాది మంది తమిళులను ఊచకోత కోసి, తమిళ ఈలం ఆకాంక్షను అణచివేసిన ఫాసిస్టు రాజపక్షేకు ప్రజావ్యతిరేకత మధ్యనే ఘన స్వాగతం పలుకుతూ, కశ్మీర్ జాతి ఆకాంక్షను వక్తం చేసిన అఫ్జల్‌గురును ఏ ఆధారాలు లేనప్పటికీ తన ముస్లిం వ్యతిరేక ఫాసిస్టు రాజకీయాలలో భాగంగా భారత ప్రభుత్వం హత్య చేసింది.

కార్పొరేట్, అంతర్జాతీయ పెట్టుబడికి బద్ధుడైన రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ టెర్రరిజంపై పోరాటం పేరుతో అమెరికా దాని చమురు ప్రయోజనాల కోసం చేస్తున్న దుర్మార్గ యుద్ధంలో భాగంగానే దాని నమ్మకమైన బంటుగా ఉరిశిక్షలు ఖరారు చేస్తూ పోతున్నాడు. వలసకాలం నుండి ప్రజల పక్షాన పోరాడేవారిపై తీవ్రవాద ముద్రే వేసి హత్యలు చేయడం ఒక విధానంగా వస్తోంది. కశ్మీర్ ప్రజల జాతీయ ఆకాంక్ష విషయంలో ప్రజాస్వామిక సూత్రాలను, ఐక్యరాజ్యసమితి సూచనలను పక్కనపెట్టి మిలిటరీ పాలన చేస్తూ ఎన్నో దుర్మార్గాలకు పాల్పడుతున్న ప్రభుత్వం 1948 నుండి కశ్మీర్‌ను ఆరని చిచ్చు చేసింది. అక్కడి జాతీయ ఉద్యమం గురించి అటు మీడియాగాని, ఇటు రాజకీయ పార్టీలుగాని ప్రజలకు నిజాలు చెప్పకుండా దాచి కుహనా దేశభక్తిని అర్థం లేని సెంటిమెంట్లను రెచ్చగొడుతూ వచ్చాయి. అవకాశం వచ్చినప్పుడల్లా దేశ భద్రత పేరు చెప్పి దోపిడీ పాలక విధానాల నుండి ప్రజలను పక్కదారి పట్టిస్తున్నాయి. ఎన్నికల ముందు, బడ్జెట్‌లో కీలక నిర్ణయాలు తీసుకునే ముందు, హిందుత్వ ఫాసిస్టు శక్తుల రాజకీయాలకు తానేమీ తక్కువ కాదని చెప్పడానికి సంఘ్‌పరివార్‌తో పోటీ పడుతోంది కాంగ్రెస్ ప్రభుత్వం. అందుకే అటు సంఘ్‌పరివార్ కుంభమేళా రాజకీయాలు చేస్తుంటే, ఇటు కాంగ్రెస్ కూటమి ఒక ముస్లింను చట్టబద్ధంగా చంపి తనేమిటో నిరూపించదలచుకుంది. ఈ ప్రభుత్వ ఫాసిస్టు విధానాలను ఖండిస్తూ, భారత శిక్షాస్మృతి నుండి ఉరిశిక్షను రద్దు చేయాలని విప్లవ రచయితల సంఘం డిమాండ్ చేస్తోంది.

పి. వరలక్ష్మి,
కార్యదర్శి,
**విప్లవ రచయితల సంఘం**



పార్లమెంట్ దాడిలో జరిగిన మానవ నష్టం పట్ల విచారం తప్ప ఒక రాజకీయ చర్యగా అందులో దోషం ఏం కనిపిస్తుంది? ప్రజాస్వామ్యం పట్ల, చరిత్ర పట్ల కనీస అవగాహన ఉండకపోవడం వల్ల మీడియాలో పని చేసేవాళ్ళు.. ఉరిశిక్షను వ్యతిరేకించేవాళ్ళతో ఈ ఉరిని మీరెట్లా ఖండిస్తారు? అని మొదలుపెట్టారు. ఉరిశిక్షను ఖండించడం తప్పు అనే అభిప్రాయం ఉన్నందువల్లే ఆ రెండు రోజులు మీడియా, పత్రికలు అట్లా వ్యవహరించాయి. దేశ సార్వభౌమాధికారంపట్ల వల్లమాలిన మమకారంతోపాటు, దానికి కాశ్మీరీలే ప్రతిబంధకమనే అభిప్రాయం కూడా ఉన్నందువల్లే ఈ వైఖరి ఏర్పడింది.

అఫ్జల్‌గురు విషయంలో న్యాయ వ్యవస్థవలె మీడియా కూడా ఈ వైఖరి సాధికారికంగా తీసుకోడానికి సమాజంలో ఒకప్పటికంటే నానాటికీ పెరుగుతున్న హిందుత్వ వ్యక్తీకరణే కారణం. అట్టడుగు ప్రజల రోజువారీ మౌలిక సమస్యలు వేరే ఉన్నా వాళ్ళు తమను తాము హిందువులుగా గుర్తించుకొనే ధోరణి పెరుగుతోందని గమనించాలి. పాలక శక్తుల దుష్ప్రచారమే కారణమైనా, సామాజిక మార్పులు కూడా ఆ దిశగా నడిపిస్తున్నాయి.

భారత రాజ్యాంగ వ్యవస్థలన్నీ ముస్లింలపట్ల, మావోయిస్టులపట్ల ముక్తకంఠంతో ఒకే వైఖరితో ఉన్నాయి. రాజకీయ పార్టీలేవైనాసరే.. వాళ్ళలో వాళ్ళకు ఎన్ని భిన్నాభిప్రాయాలున్నా ఏకాభిప్రాయం ఈ ఇద్దరి విషయంలోనే ఉంది. ఉరి శిక్షలతో, నిషేధాలతో, నిర్బంధాలతో, దుష్ప్రచారాలతో వాళ్ళను తీసేస్తే తప్ప అఖండ హిందుస్తాన్‌ను నిర్భీతిగా పాలించుకోలేమని భారత పాలకవర్గాలు భావిస్తున్నాయి. అఫ్జల్‌గురు ఉరిశిక్ష భారత పాలకవర్గాల స్వభావాన్ని మాత్రమేగాక, దానికి ప్రత్యక్ష పరోక్ష సమ్మతిని అందిస్తున్న సమాజ మార్పులను కూడా మరోసారి చర్చనీయాంశం చేస్తోంది. ఈ మొత్తంలో ప్రగతిదాయమైన మార్పు దిశగా ప్రజాస్వామ్యంలోని మిగతా మూడు వ్యవస్థలపై మీడియా విమర్శ పెడుతుందా? లేక వాటి స్వరంతోనే తానూ మాట్లాడుతుందా? పార్లమెంట్ పవిత్రత, సార్వభౌమాధికారం అనే మేలి ముసుగుల దాపున హిందుత్వను ఆ గొంతుక అట్లాగే వినిపిస్తుందా? అనే ప్రశ్నలు వేయక తప్పదు. అందరినీ, అన్నిటినీ విమర్శిస్తున్నట్లు కనిపించే మీడియా కూడా దారి తప్పితే దాని మీద సమాజంలో నుంచి విమర్శ వినిపించాల్సిందే. భావ ప్రకటనా స్వేచ్ఛకు ప్రాణం పెట్టే మీడియాలో తన మీది విమర్శకు అనుమతి ఉంటుందా? లేదా? అనేదే దాని ప్రజాస్వామ్య తత్వానికి గీటురాయి.



# బతికించే వృత్తి నుంచి ఉరికంబం దాకా..

- వరవరరావు

**అఫ్జల్‌గురు ప్రస్థానం అతని మాటల్లోనే...**

నేను పెరుగుతున్న కాలంలో కశ్మీర్ రాజకీయంగా కల్లోలంగా ఉన్నది. మక్బుల్‌భట్‌ను ఉరి తీశారు(1984 ఫిబ్రవరి11).పరిస్థితి చాల ఉద్రిక్తంగా ఉంది. ప్రజలు కశ్మీర్ సమస్యను మరొక్కసారి శాంతియుతంగా పరిష్కరించుకోవడానికి ఎన్నికల యుద్ధంలో పోరాడాలని నిర్ణయించుకున్నారు. కశ్మీర్ ముస్లింల మనోభావాలకు ప్రాతినిధ్యం వహించే ముస్లిం ఫ్రంట్ (ఎంయూఎఫ్)ను ఏర్పాటు చేసుకున్నారు. ఢిల్లీ పాలకులు ఈ ఎంయూఎఫ్‌కు వస్తున్న ప్రజాస్పందనను చూసి బెంబేలెత్తారు. దాంతో ఇంతకుముందెన్నడూ లేనంతగా ఎన్నికల్లో రిగ్గింగ్ జరిగింది. ఎన్నికల్లో అత్యధిక మెజారిటీతో గెలిచిన నాయకులను అరెస్టు చేశారు. అవమానపరిచారు, జైళ్ళలోపెట్టారు. దీని తర్వాతనే ఆ ఎంయూఎఫ్ నాయకుడు సాయుధ ప్రతిఘటనకు పిలుపునిచ్చాడు.

వేలాదిమంది యువకులు, విద్యార్థులు ఈ పిలుపునందుకొని సాయుధ పోరాటంలోకి దిగారు. నేను శ్రీనగర్‌లోని 'జీలం వ్యాలీ' మెడికల్ కాలేజీ నుంచి ఎంబిబిఎస్ చదువు వదిలేసి జమ్మూ కశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ (జేకేఎల్ఎఫ్)లో చేరాను.'లైన్ ఆఫ్ కంట్రోల్' దాటి అటువైపు కశ్మీర్‌లో ప్రవేశించాను. పాకిస్థాన్ రాజకీయ నాయకులు కూడా భారత రాజకీయ నాయకుల్లాగనే వ్యవహరించడాన్ని చూసి కశ్మీరీల పట్ల వాళ్ల వైఖరీ, ప్రవర్తన చూసి భ్రమలన్నీ కోల్పోయాను. కొన్ని వారాల తర్వాత తిరిగి వచ్చాను. భారత భద్రతా దళాల ముందు లొంగిపోయాను. బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్(బీఎస్ఎఫ్) నాకు 'లొంగిపోయిన మిలిటెంట్' అని సర్టిఫికేట్ కూడా ఇచ్చింది.నేను కొత్త జీవితాన్ని ప్రారంభించాను. నేను డాక్టర్‌ను కాలేకపోయినా ముందులు, శస్త్రచికిత్స చేసే పరికరాల 'కమిషన్ డీలర్' వ్యాపారం మొదలుపెట్టాను.

ఒక డొక్కు స్కూటర్‌ను కొన్నుక్కున్నాను.'తబస్సుం'తో పెళ్లి కూడా జరిగింది. కాని ఒక్కరోజు కూడా రాష్ట్రీయ రైఫిల్స్ నుంచి కానీ, స్టేట్ టాస్క్‌ఫోర్స్ (ఎస్‌టిఎఫ్) నుంచి గానీ వేధింపులు లేకుండా గడవలేదు. కశ్మీర్‌లో ఎక్కడ మిలిటెంట్ల దాడి జరిగినా వాళ్లు గ్రామీణులందరినీ ఒక చోట గుంపుజేస్తారు. నెత్తుర్లు చిందగా చిత్రహింసలు పెడుతారు. నావంటి లొంగిపోయిన మిలిటెంట్ పరిస్థితి అంతకన్నా భయంకరమైనది. ఎన్నో వారాలపాటు నిర్బంధంలో ఉంచి తప్పుడు కేసుల్లో ఇరికిస్తామని బెదిరించి పెద్ద మొత్తంలో లంచాలు ఇస్తే తప్ప వదిలేవాళ్లు కాదు. ఇటువంటి సందర్భాలు నా జీవితంలో ఎన్నిసార్లు వచ్చాయో.. ఇరవై రెండవ రాష్ట్రీయ రైఫిల్స్‌కు చెందిన మేజర్ రాంమోహన్‌రామ్ నా రహస్య అంగాలకు కరెంట్ షాక్‌లిచ్చాడు. ఎన్నోసార్లు చల్లటి నీళ్ళలో మంచువలె గడ్డ కట్టేదాక పడేశారు. పెట్రోల్‌లో ముంచి తీశారు. మిరపకాయల కుప్పల్లో పొగబెట్టి ఒదిలేశారు. నాతో మరుగుదొడ్లు శుభ్రం చేయించేవారు.

క్యాంపులు ఊడిపించేవారు.'హుంహోం ఎస్‌టిఎఫ్ చిత్రహింసల క్యాంపు నుంచి తప్పించుకోవడానికి నేను భద్రత దళాలకు నా దగ్గర ఉన్నదంతా ఊడ్చి ఇవ్వాల్సి వచ్చింది. వినయ్‌గుప్త, దావిందర్‌సింగ్ అనే డిఎస్‌పిలు చిత్రహింసలన్నింటిని పర్యవేక్షిస్తుండేవాళ్లు. శాంతిసింగ్ అనే చిత్రహింసల నిపుణుడైన ఇన్‌స్పెక్టర్ లక్ష రూపాయాల లంచాన్ని ఒప్పించడానికి మూడు గంటల పాటు కరెంట్ షాక్‌లిచ్చాడు.నా భార్య తన మీద ఉన్న నగలన్నీ అమ్మింది. వాళ్లు నా స్కూటర్ కూడా అమ్మేసు కున్నారు.

ఆర్థికంగానూ, మానసికంగానూ నేను పూర్తిగా చితికిపోయాను. ఛిద్రం అయిపోయాను. ఆరు నెలలపాటు బయటకు వెళ్లలేనంతగా శరీరం అదుపు తప్పిపోయింది. నా పురుషంగానికి విద్యుత్ షాకులివ్వడం వల్ల ఆరు నెలలపాటు నేను కాపురం కూడా చేయలేకపోయాను. ఇన్ని సంఘటనల తర్వాత నేను నేర్చుకున్న పాఠమేంటంటే.. ఎస్‌టిఎఫ్ క్యాంపులలో ఇట్లా నిరంతరం చిత్రహింసలైనా భరించాల్సింటుంది. ఇంకా భరించడం, ప్రతిఘటించడం సాధ్యంకాకపోతే గుడ్డిగా ఎస్‌టిఎఫ్‌కు సహకరించవలసి ఉంటుంది. నా ముందు ఇంకొక దారిలేదు.

డిఎస్‌పి దావిందర్‌సింగ్ నన్ను ఓ పని చేసిపెట్టమన్నాడు.'చాలా చిన్న పని' అన్నాడు. ఒకాయనను ఢిల్లీకి తీసుకువెళ్ళాలని అన్నాడు. అతడికి అక్కడ ఇల్లు చూసి పెట్టాలన్నాడు. ఆ మనిషిని మొదటిసారి చూశాను. అతడు 'కశ్మీరీ' మాట్లాడడు కాబట్టి అతడు బయటివాడని అర్థమైంది. అతడు నాతో తన పేరు మహమ్మద్ అని చెప్పాడు. (పార్లమెంట్ మీద దాడి చేసిన ఐదుగురిలో అతడ్ని మహమ్మద్‌గా పోలీసులు గుర్తుపట్టారు. ఆ దాడిలో భద్రతా దళాలు ఐదుగురిని చంపేశాయి.) నేను ఢిల్లీలో ఉన్నప్పుడు మహమ్మద్‌కు, నాకు దావిందర్‌సింగ్ నుంచి ఫోన్లు వచ్చేవి. మహమ్మద్ ఢిల్లీలో చాలమందిని కలుస్తున్నట్లుగా కూడా నేను గమనించాను. అతడు ఓ కారు కొనుక్కున్నాక 'నీవు ఇక వెళ్లిపోవచ్చు'అని నాకు 30వేల రూపాయల బహుమానం ఇచ్చాడు.

నేను 'ఈద్'కు శ్రీనగర్ బస్టాండ్ నుంచి సుఫోర్ పోవడానికి బస్సు ఎక్కుతున్నప్పుడు నన్ను పోలీసులు అరెస్టు చేసి ఫరెన్‌షార పోలీస్‌స్టేషన్‌కు తీసుకుపోయారు. అక్కడ నన్ను చిత్రహింసలు పెట్టి అక్కడి నుంచి ఎస్‌టిఎఫ్ హెడ్ క్వాటర్స్‌కు తీసుకుపోయారు. అక్కడి నుంచి ఢిల్లీ పోలీసులు స్పెషల్ సెల్ టార్చర్ చాంబర్‌లో నాకు మహమ్మద్ గురించి తెలిసిందల్లా చెప్పమన్నారు. చెప్పాను. కానివాళ్లు నన్ను మా బంధువు షౌకత్ భార్య నౌజత్ ఎస్ఎఆర్ గిలానీతో కలిసి పార్లమెంట్ మీద దాడి వెనుక ఉన్నామని చెప్పమని ఒత్తిడి చేశారు. మీడియా ముందు కూడా మీడియా వాళ్లు నిజమే అనుకునేంతగా సహజంగా చెప్పాలని ఒత్తిడిపెట్టారు. నేను ఒప్పుకోలేదు. కానీ వాళ్లు 'నా కుటుంబం కూడా వాళ్ల నిర్బంధంలో ఉన్నదని, వాళ్లు చెప్పమన్నట్లు చెప్పకపోతే వాళ్లను చంపేస్తా' మని బెదిరించారు. నాతో వాళ్లు ఎన్నో తెల్లకాగితాల

మీద సంతకాలు చేయించుకున్నారు.

పార్లమెంట్ మీద దాడికి బాధ్యత వహిస్తూ మీడియాకు చెప్పాలని పోలీసులు నాతో ఒక విషయాన్ని ఎన్నోసార్లు రిహార్సల్ చేయించారు. నాకు మీడియా ముందు చెప్పక తప్పలేదు. కానీ ఒక జర్నలిస్టు ఈ దాడిలో ఎస్ఏఆర్ గిలాని పాత్ర ఏమిటని అడిగినప్పుడు నేను 'గిలానికి ఏ సంబంధం లేద'ని చెప్పాను. వెంటనే మొత్తం ఆ మీడియా ముందరే ఎసిపి రజ్‌బీర్‌సింగ్ బిగ్గరగా అరుస్తూ 'మేం చెప్పమన్న దానికి భిన్నంగా చెప్తున్నావ'ని హెచ్చరించాడు. వాళ్లు చెప్పమన్న కథనం నుంచి నేను అట్లా పక్కకు జరగగానే వాళ్లు చాలా ఆందోళన పడిపోయారు. నేను 'గిలానికేం సంబంధం లేద'ని చెప్పిన అంశాన్ని బ్రాడ్‌కాస్ట్ చేయొద్దని జర్నలిస్టులను వేడుకున్నాను. మరుసటి రోజు రజ్‌బీర్‌సింగ్ నాకు నా భార్యతో మాట్లాడుకునే అవకాశం ఇచ్చాడు. ఆమె ముందే నా భార్య కొడుకు బతికి ఉండాలంటే తమకు సహకరించాలని హెచ్చరించాడు. ఈ ఆరోపణలను అంగీకరించి, వాళ్లు చెప్పమన్నట్లు చెప్పడం తప్ప నాకు ఇంకోదారి లేకపోయింది.

స్పెషల్ సెల్ ఆఫీసర్లు నా కేసును బలహీనపరచి కొద్దికాలం పోయిన తర్వాత నన్ను విడుదల చేయిస్తామని వాగ్దానం చేశారు. ఆ తరువాత వాళ్లు నన్ను చాలా చోట్లకు తీసుకుపోయారు. మహమ్మద్ వివిధ వస్తువులు కొన్న మార్కెట్లో తిప్పారు. ఈ విధంగా కేసుకు సాక్ష్యాలు అల్లారు. పార్లమెంట్ మీద దాడికి వ్యూహకర్తలు ఎవరో కనుక్కోవడంలో తమ వైఫల్యానికి వాళ్లు నన్ను బలి పశువును చేశారు. వాళ్లు ప్రజలను వంచించారు. పార్లమెంట్ మీద దాడి చేయాలన్న వ్యూహం, కుట్ర ఎవరిదో ప్రజలకు ఇప్పటికీ తెలియదు. నన్ను ఈ కేసులో కశ్మీరీ ఎస్‌టిఎఫ్ ఇరికించింది. ఢిల్లీ పోలీస్ స్పెషల్ సెల్ పకడ్బంది రచన చేసింది. మీడియా నిరంతరం ప్రసారం చేసింది. ఢిల్లీ హైకోర్టుగానీ, సుప్రీంకోర్టుగానీ ఈ సాక్ష్యాన్ని నమ్మలేదు. 'నేరపూరిత కుట్రకు ప్రత్యక్షమైన సాక్ష్యం ఏమీలేదని' అభిప్రాయపడింది. 'ఇది జాతినంతా కదిలించింది కనుక సమాజ సామూహిక ఆత్మను సంతృప్తి పరచడానికి మరణశిక్ష విధించక తప్పడం లేదని' భావించింది. నాకు ఉరి శిక్షను ఖరారు చేసింది. పోలీసు అధికార్లకు అవార్డులు వచ్చాయి.

నేనిప్పుడు ఉరి కంబం మీద ఉన్నాను.. (అధారం: తీహార్ జైల్లో 2006లో అఫ్జల్‌గురు 'కరవాన్' పత్రికకు ఇచ్చిన మొట్టమొదటి ఇంటర్వ్యూ..) తీహార్ జైలులో విషాద ఛాయలు.. దేశంలో ఒక భావధోరణి వాళ్ళందరూ అఫ్జల్‌గురు ఉరిశిక్షను వేడుక చేసుకుంటూ ఉంటే.. తీహార్ జైల్లో మాత్రం విషాదఛాయలు అలుముకున్నాయి. ఉరికంబం దగ్గరికి తీసుకపోయే సమయంలో కూడా జైలు సిబ్బంది అందరినీ పేరు పేరునా వినమ్రంగా పలకరించాడు. ఉరితీసే ముందు ఎవరినైనా 'మీ ఆఖరి కోరిక ఏమిటి'? అని అడుగుతారు. 'ముఝే ఉమ్మీద్ హై ఆప్ ముఝే దర్ సహ కరాహోగే' (మీరు నాకు నొప్పి కలిగించరని నా విశ్వాసం) అని మాత్రమే కోరుకున్నాడు. తలారి ఆయనకు ఆ ఆశ్వాసాన్నిచ్చాడు. అఫ్జల్‌గురు ముఖం మీద నల్లగుడ్డ కప్పే ముందు అతడు అఫ్జల్‌గురు కళ్ళల్లోకి భావోద్వేగంతో కాస్సేపు చూస్తూ ఉండిపోయాడు.

అఫ్జల్‌గురు అల్విదా అన్నాడు. అతడు కూడా మళ్ళీ అవే మాటలతో వీడ్కోలు చెప్పి 'మీ ప్రయాణం సుఖవంతం అవుతుంది' అన్నాడు. అది సుఖవంతం అయింది. ఒక్క నిమిషంలోనే చనిపోయాడు. కాని అతని మృతదేహం జైలు నియమాల ప్రకారం అట్లా ఒక అరగంటసేపు గాలిలో వేల్లాడుతూనే ఉంది. ఆ మృతదేహాన్ని ఉరికంబం మీంచి తొలగించి మత విశ్వాసాలకనుగుణంగా జైలు నంబరు మూడు కుడివైపున కాశ్మీరీ వేర్పాటువాద నాయకుడు మక్బుల్ భట్ గోరీ పక్కన ఖననం చేసారు.

అఫ్జల్‌గురు తనను పార్లమెంట్ దాడి కేసులోకి అక్రమంగా ఇరికించారనీ చెప్పేవాడని, ఎప్పుడూ భారతదేశాన్ని లంచగొండితనం, అవినీతి నుంచి బయటపడాలని చెప్తుండేవాడనీ జైలుసిబ్బంది అన్నారు. జైలు నియమాల ప్రకారం ఉరి తీయబోయే వ్యక్తికి 24 గంటల ముందు ఆ విషయాన్ని జైలు అధికారులు చెప్పాల్సి ఉంది. ఆయన ఆఖరి కోరిక ఏమిటి? ఎవర్ని కలవాలనుకుంటున్నారు? అని కూడా తెలుసుకోవాల్సి ఉంటుంది. కానీ అఫ్జల్‌గురుకు మాత్రం ఆరోజు ఉదయమే అంటే, కేవలం గంట ముందే ఆ విషయం చెప్పారు. కొన్ని పత్రికలలో వచ్చినట్లుగా అంతకు ముందు రోజు సాయంత్రం చెప్పలేదు. లాకప్ తీసాక ఆయనకు ఒక కప్పు చాయ్ ఇచ్చి ఈ విషయం చెప్పారు. ఆహారమేమీ ఇవ్వలేదు. కాని ఆయన ఎంత మామూలుగా ఉన్నాడంటే.. ఈమాట చెప్పి ఆహారం ఇచ్చినా తీసుకునేవాడేమో అన్నట్లుగా ఉన్నాడు. ఈ విషయం చెప్పే ముందు షెరాన్ అని పిలిచే కాశ్మీరీ గౌను వేసుకుని ఉన్నాడు.

చెప్పాక స్నానం చేసి తెల్లటి కుర్తా పైజామా వేసుకుని నమాజు చేసాడు. తీహార్ జైలులో ఇప్పటికి 25 ఉరిశిక్షలు అమలై ఉంటాయి. తీహార్‌జైలు సీనియర్ అధికారులు కనీసం పది ఉరిశిక్షలు చూసి ఉంటారు. కాని వీరిలో ఒక్కరు కూడా ఇంత గంభీరంగా, నిర్మలంగా, ప్రశాంతంగా కాస్సేపట్లో వచ్చే మరణం గురించి చీకు, చింతలేనట్లుగా కనిపించలేదు. అఫ్జల్ జీవితంలోని ఆఖరి గంటలు కొందరు జైలు అధికారులతో గడిపాడు. జీవితం, మరణం పట్ల ఉండే ఆలోచనలు పంచుకున్నాడు. ఆయన విశ్వజనీన సౌభ్రాతృత్వం గురించి మాట్లాడాడు. మానవజాతి ఐక్యతను గురించి మాట్లాడాడు. ఏ మనిషీ చెడ్డవాడుకాదు. ఎందుకంటే అందరి ఆత్మలు దైవసృష్టే. సత్యమార్గంలో నడవడం ఒక్కటే ఎంతో గొప్ప కార్యసాఫల్యాన్ని సాధించినట్లు అని విశ్వసించేవాడు. ఆ ఉదయం ఆయన ఎంత ప్రశాంతంగా ఉన్నాడంటే ఒక కాగితం తీసుకుని తన ఆలోచనలు రాసుకున్నాడు.

సంతకం చేసి తారీకు సమయం వేసాడు. 'మీ కుటుంబం గురించి ఏమి ఆలోచిస్తున్నారు, నీ తరువాత వాళ్ళని ఎవరు చూసుకుంటార'ని అడిగితే..మనందరినీ చూసుకునేవాడు దేవుడే కనుక వాళ్ళను ఆయనే చూసుకుంటాడని అన్నాడు. ఆయన విద్యావంతుడు, జ్ఞాని, ఇస్లాం గురించి ఎంత తెలుసునో హిందూమతం గురించి కూడా అంత తెలుసు. రెండు మతాల్లో ఉండే పోలికల గురించి తరచు చెప్పేవాడు.

జైలులో నాలుగు వేదాలు చదివాడు. ఎంతమంది హిందువులు వేదాలు చదివారు? అఫ్జల్ వంటి పవిత్ర ఆత్మ మనని వదిలిపోతే అది ఎక్కడో విషాదపు గాయాన్ని చేస్తుంది. ఉరితీయబోతున్నాం అని చెప్పినప్పుడు, ఉరికంబానికి తీసుకపోయేటప్పుడు ఆందోళన చెందడం చూసిన జైలు సిబ్బంది చిరునవ్వుతోనూ ప్రశాంతంగానూ చివరిదాకా ఉన్న అఫ్జల్‌ను చూసి చిరునవ్వుతో ఉరికంబం ఎక్కినవాళ్ళ గురించి విన్న గాథలు గుర్తుకు వచ్చాయన్నారు. ఉరి తీసిన ఇతరులకు అఫ్జల్‌కు ఉన్న తేడా గురించి చెబుతూ..అందరూ మత సంబంధమైనవో, రాజకీయమైనవో నినాదాలు ఇచ్చేవారు..కానీ అఫ్జల్ మాత్రం అటువంటివేమీ లేకుండా తన సెల్ నుంచి వంద అడుగుల దూరంలో ఉన్న ఉరికంబం దాకా నడిచినంత దూరం చుట్టూ ఉన్న వాళ్ళకు అభివందనలు తెలుపుతూ నడిచాడు...

*(ఫిబ్రవరి 16, నమస్తే తెలంగాణ దినపత్రిక సౌజన్యంతో...)*

వ్యాసం

# సమతారావుకు జోహార్లు

- వి. చెంచయ్య

సమతారావు మరణవార్త, నెల రోజులు ఆలస్యంగా తెలియడం బాధాకరంగా ఉంది. జనవరి 7న జరిగిన సంఘటన ఫిబ్రవరి 5 దాకా తెలియలేదు. జనవరి 11, 12 తేదీలలో రాష్ట్ర వ్యాప్తంగా వచ్చిన 400 మంది ప్రతినిధులతో జరిగిన విరసం సాహిత్య పాఠశాలలోనూ ఎవరూ అనలేదు. ప్రసార సాధనాలూ, టెక్నాలజీ ఇంతగా పెరిగిన ఈ రోజుల్లో ఇది బాధాకరం. ప్రకాశం జిల్లా చిలకపాడులో తన రెండవ కుమారుడి దగ్గర కొంతకాలంగా ఉంటున్న సమతారావు 87 ఏళ్ళ వయసులో అనారోగ్యంతో ఒంగోలులో ఒక హాస్పిటల్‌లో చేరి, చివరకు మనల్ని శాశ్వతంగా వదిలిపోయారు.

ఏడెనిమిదేళ్ళ క్రితం గుంటూరులో ఒక సాహితీ సభలో కలిసినప్పుడు తాను గుంటూరు జిల్లాలోనే పిట్టలవానిపాలెం వృద్ధాశ్రమంలో ఉంటున్నానని అన్నప్పుడు కొంత ఆశ్చర్యం, కొంత బాధ కలిగాయి. ఈ రోజుల్లో ఇది ఎవరికయినా తప్పదేమో అనిపించి సమాజంపైన ఆగ్రహం కలిగింది. ఇలాంటి సమస్యలకు కూడా పరిష్కారం కనిపించే సోషలిస్టు వ్యవస్థ కోసమే సమతారావు అర్ధ శతాబ్దంగా కలంతో పోరాడుతూ వచ్చారు.

ఆ తర్వాత ఒకసారి నేను పిట్టలవానిపాలెం ఆశ్రమానికి వెళ్ళి సమతారావును కలిశాను. అయిదారు గంటలసేపు ఉన్నాను. నేను మాట్లాడింది అరగంట కూడా ఉండదు. తక్కిన సమయమంతా ఆయనే మాట్లాడారు. తన గురించీ, అంతకు కొద్ది రోజుల ముందే చనిపోయిన తన జీవిత సహచరి గురించీ చెప్పారు. తన కవితల్ని కొన్ని చదివి వినిపించారు. ఇంకా ఎన్నెన్నో చెప్పారు. వీలయినప్పుడు మళ్ళీ మళ్ళీ రమ్మన్నారు. ఓపిక ఉన్న రోజుల్లో జనంలో కలదిరిగిన మనిషి అలా ఒక మారుమూల గ్రామంలో ఆశ్రమంలోనే ఉన్నా, ఒంటరితనంతో ఉండడం, పాత నమ్మకాలుంటే ఏ పూర్వజన్మలోనో చేసుకున్న పాపం అనుకునే పరిస్థితి. కానీ ఆయనలో ఉన్న ఆత్మవిశ్వాసం, తానలా ఉండడమే కరెక్టు అనే నిశ్చితాభిప్రాయం చూసిన వారికెవరికయినా ఆశ్చర్యం కలగక మానదు.

సమతారావు అసలు పేరు రామచంద్రరావు. 1926వ సంవత్సరం ఫిబ్రవరి 5వ తేదీన గుంటూరు జిల్లా కొల్లిపర గ్రామంలో పుట్టి, అదే జిల్లాలోని కనగాల గ్రామవాసులైన చావలి రామయ్య, పద్మావతమ్మ దంపతుల దగ్గర దత్తపుత్రునిగా పెరిగారు. అందువల్ల చావలి రామచంద్రరావయ్యారు. పదేళ్ళ వయసులో వారి కుటుంబం నెల్లూరుకు వలస వెళ్ళడంతో, అక్కడ పొట్టి శ్రీరాములుతో పరిచయం ఏర్పడడం, వందేమాతరం, మాకొద్దీ తెల్ల దొరతనమూ వంటి పాటలు నేర్చుకుని కాంగ్రెసు సభలలో పాడడం, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో సంబంధాలేర్పడడం, అమ్మ, మాలపల్లి వంటి నవలలేగాక ఇతర అభ్యుదయ సాహిత్యంతో పరిచయం ఏర్పడడం వగైరా కారణాలతో చిన్నతనంలోనే సామాజిక బాధ్యత గల వ్యక్తిగా తయారయ్యారు. పుచ్చలపల్లి సుందరయ్య, డాక్టర్ రామచంద్రారెడ్డిగార్ల పరిచయంతో కమ్యూనిస్టు సిద్ధాంతం కూడా వంట బట్టించుకున్నారు. ఆ క్రమంలో రచనా వ్యాసంగం చేస్తూ చావలి రామచంద్రరావు సమతారావుగా మారారు.

బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించిన పుస్తకాలతోబాటు, మరికొన్ని రాజకీయ సిద్ధాంత గ్రంథాలను సేకరించి ఆ రోజుల్లో ఒక రహస్య గ్రంథాలయాన్ని నడిపారు. 1941లో జర్మనీ సోవియట్ రష్యాపై మెరుపుదాడి చేసినప్పుడు భారత సోవియట్ మిత్ర మండలి ఆధ్వర్యంలో నెల్లూరులో జరిగిన సభలో ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడాలంటూ తొలిసారిగా సమతారావు ఒకపాట రాసి పాడి వినిపించారు. 1943లో బ్రిటిష్ ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరించి మరికొంతమందితో కలిసి ఊరేగింపు, బహిరంగ సభ జరిపినందుకు తొలిసారి అరెస్ట్ అయ్యారు. ఆరు నెలల కారాగార శిక్ష అనుభవించారు. కొంతకాలం కమ్యూనిస్టు పార్టీ హోల్‌టైమర్‌గా పని చేశారు. 1943లోనే తెనాలిలో జరిగిన అభ్యుదయ రచయితల మహాసభకు వెళ్ళారు. తర్వాత అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడయ్యారు. కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాలు, ఉద్యమాలు ఆయన కలాన్ని పదునెక్కించాయి. విస్తృతమైన పుస్తక పఠనం చేశారు. దేశభక్తి భావంతో జాతీయ భాష హిందీని నేర్చుకుని ప్రేంచంద్, రామ్‌ధారీ సింహ దినకర్‌వంటి హిందీ అభ్యుదయ రచయితల సాహిత్యాన్ని చదివారు.

నెల్లూరు జిల్లా ఉదయగిరిలో హిందీ పండిట్‌గా ఉద్యోగం చేస్తున్న రోజుల్లో యువజన నాట్యమండలిని స్థాపించారు. ఆత్రేయ 'ఎన్‌జిఓ' నాటకాన్ని ప్రదర్శించారు. దాంతో వచ్చిన డబ్బుతో అభ్యుదయ గ్రంథాలయం నడిపారు. 1950ల నుండే బాల గేయాలు రాయడం ప్రారంభించారు. బాల సాహిత్య రచయితగా తగిన గుర్తింపు పొందారు. స్వతంత్ర రచనలతోపాటు, హిందీ నుండి అనువాద రచనలు కూడా చేశారు. ప్రేంచంద్ కథలు, 'మంగళ సూత్రం' నవల, దినకర్ 'కురుక్షేత్ర' ఆయన అనువాదాలలో ముఖ్యమైవి. విశాలాంధ్ర ప్రచురించిన 5 సంపుటాల బాలసాహిత్యం, 'ఇదీ ఆంధ్రం-ఇదీ భారతం', అనేక ప్రభోధ గేయాలు ఆయన కలం నుండి వెలువడ్డాయి.

సమతారావంటే గుర్తుకొచ్చే విషయాల్లో మరొకటి ఉపాధ్యాయ ఉద్యమ జీవితం. ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్‌లో చిరకాలం సభ్యులుగా ఉండి ఉపాధ్యాయ ఉద్యమంతో మమేకం చెందారు. ఎ.పి.టి.ఎఫ్. పతాక గేయాన్ని రాశారు.

1948లో గాంధీ హత్య జరిగినపుడు ఆ హత్యను ఖండిస్తూ, మతోన్మాదాన్ని నిరసిస్తూ ఒక పాట రాసి, విజయవాడలో పుచ్చలపల్లి సుందరయ్య అధ్యక్షతన జరిగిన సభలో పాడారు. ఆ సందర్భంలో ఆర్‌ఎస్‌ఎస్‌తో జరిగిన ఘర్షణల కారణంగా చాలా మంది కమ్యూనిస్టు కార్యకర్తలతోపాటు సమతారావునూ అరెస్టు చేశారు. నాలుగు నెలల తర్వాత ఆ కేసులో నిర్దోషిగా విడుదలయ్యారు.

ఆ తర్వాత చాలా కాలానికి 1973లో గాంధీ తత్వాన్ని, సిద్ధాంతాన్ని

వ్యాసం

# వెనిజుయెలా :
# ఎన్నికలు-చావేజ్ అనంతరం '21వ శతాబ్దపు సోషలిజపు' భవిష్యత్తు

- ఫెడిరికో ఫ్యూయెంటస్

అక్టోబర్ 7న వెనిజుయెలా అధ్యక్షుడిగా చావేజ్ తిరిగి ఎన్నిక కావడానికి (55 శాతం ఓట్లతో) రెండు కారణాల రీత్యా ప్రాధాన్యత ఉంది. మొదటిది - నయా - ఉదారవాద మితవాదులు తిరిగి అధికారంలోకి రాకుండా వెనిజుయెలా ప్రజలు అడ్డుకున్నారు. వాళ్ళే కాని గెలిచి ఉంటే అమెరికా అండదండలున్న ఈ శక్తులు 1998లో చావేజ్ మొదటిసారి ఎన్నికైనప్పటి నుండి మెజారిటీ ప్రజలైన పేదల కోసం చేపట్టిన ముఖ్యమైన చర్యలన్నింటినీ వెనక్కి తిప్పేవాళ్ళు.

ప్రభుత్వం పెద్ద ఎత్తున చేపట్టిన ప్రజాసంక్షేమ కార్యక్రమాలు (విద్య, వైద్యం, గృహ నిర్మాణం), కీలక పరిశ్రమల జాతీయీకరణ, కమ్యూనిటీలలో పనిస్థలాల్లో ప్రజా భాగస్వామ్యాన్ని ప్రోత్సహించడం వంటివెన్నో వెనుకపట్టు పట్టేవి. రెండవది - చావేజ్ పునః ఎన్నిక అంటే ప్రపంచంలో బహుశా ఈ రోజు కొనసాగుతున్న అత్యంత విప్లవకర, పెట్టుబడిదారీ వ్యతిరేక ప్రణాళికకు మరోసారి ప్రజామోదం లభించినట్టు.

వెనిజుయెలాలో నయా - ఉదారవాదం వల్ల నెలకొన్న సంక్షోభానికి ప్రతిస్పందనగా, సోషలిజానికి కాలం చెల్లిపోయిందనుకుంటున్న సమయంలో ముందుకు వచ్చిన ఈ వెనిజుయెలా బొలివేరియన్ విప్లవం మరింత విప్లవకరమౌతూ తన లక్ష్యం '21వ శతాబ్దపు సోషలిజం'గా ప్రకటించుకుంది.

**నేపథ్యం :**

బొలివేరియన్ విప్లవోద్యమం గురించి అర్థం చేసుకోవాలంటే ఆ దేశంలో ఉన్న చమురు సంపదను చరిత్రతో కలిపి చూడాల్సిందే.

1920లలో చమురు ఉత్పాదన పెరగడంతో వెనిజుయెలా ఆర్థిక వ్యవస్థ ఒక పెనుమార్పుకు గురయింది. పెట్టుబడి అంతా చమురు రంగానికి పోవడంతో అప్పటిదాకా ఆర్థిక వ్యవస్థకు మూల స్తంభమైన వ్యవసాయ ఉత్పాదన విపరీతంగా పడిపోయింది. రాజ్యకోశాగారానికి చమురు ఆదాయం వేగంగా చేరడంతో అధికారం, సంపద ప్రభుత్వం / రాజ్యంతోనే కేంద్రీకృతమైంది. దాంతో రాజ్యవనరులను తమ బొక్కసంలో నింపుకొని ధనవంతమయ్యే పరాన్నభుక్కు పెట్టుబడిదారీ వర్గం పెరిగింది. ఈ పరిణామాల ప్రభావం వెనిజుయెలాలో నూతన వర్గాల ఆవిర్భావానికి, పెరుగుదలకు దారి తీసింది. ప్రజలు పెద్ద ఎత్తున గ్రామీణ ప్రాంతాలు వదిలేసి పట్టణాల బాట పట్టారు. దీంతో పెద్ద సంఖ్యలో చిన్న చిన్న వాడలు (బొరియోలు) వెలిశాయి. ఈ వాడల్లో దారిద్ర్యంలో నివసించే అసంఘటిత కార్మికులు పోగుపడ్డారు. విభిన్న రాజకీయ పార్టీలు ప్రభుత్వ నిధులను ఉపయోగించి వీరి మద్దతు సంపాయించేందుకు పోటీ పడేవారు. వీటన్నింటితో వెనిజుయెలాలో లంచగొండితనం విపరీతంగా పెరిగింది.

1970ల నుండి ప్రపంచ ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేసిన చమురు ధరల పెరుగుదల, ఆర్థిక సంక్షోభాలు ఈ రాజకీయ వ్యవస్థను సంక్షోభంలో పడవేశాయి. 1976లో చమురు జాతీయీకరణ ఈ ధోరణిని ఇంకా తీవ్రతరం చేసింది. ప్రభుత్వ చమురు కంపెనీ పి.డి.వి.ఎస్.ఎ. దాదాపు ఏ ప్రభుత్వపు అదుపులో లేకుండా 'ప్రభుత్వంలో మరో ప్రభుత్వం' లాగా పనిచేసేది. పి.డి.వి.ఎస్.ఎ.లో ప్రభుత్వ

---

ప్రశ్నిస్తూ శ్రీశ్రీ రాసిన 'ఓ మహాత్మా! ఓ మహర్షీ!' గేయం ప్రేరణతో సమతారావు కూడా అదే శీర్షికతో, అదే గేయ ఛందసులో ఒక పాట రాశారు. 'రోత బట్టిన సమాజంలో/భక్తిగా నీ నీతి సూత్రం/నీవు కాదు మరెవ్వరైనా/నిజంగా పాటించగలరా?' అని ప్రశ్నించారు.

'అందుకే మరి ఓ మహాత్మా / అసలు గుట్టును విప్పుతున్నా
జగతి సంపద సకలమునకూ / శ్రమలు శ్రమలే మూలతత్వం
సంపదల ఉత్పత్తి సొంతం / శ్రామికుల శ్రమ శక్తి సొంతం
కష్ట జీవుల శ్రమల ఫలితం / కొద్ది మంది పరాన్న భుక్కుల
భుక్తమవటం నిత్యకృత్యం / కష్టమొకరిది ఫలితమొకరిది
చెడుగులన్నిటి మూల సూత్రం'

అని నిక్కచ్చిగా వివరించారు.

సమతారావు రచనల్లో ఒక ఆవేశం, ఉద్వేగం ఉంటాయి. ఆయన దానికనువయిన గేయ ఛందస్సులనూ, వచనాన్నీ అనుసరించారు. 'ఇదీ ఆంధ్రం-ఇదీ భారతం' అన్న ఆయన గ్రంథం వచన కవితా వ్యాసంగా కొనసాగింది. తెలుగులో వచన కవితా విధానంలో ఖండకావ్యాలు తప్ప మహాకావ్య రచన జరగలేదని, దినకర్ 'కురుక్షేత్ర' కావ్యాన్ని వచన కవితా పద్ధతిలో అనువదించి విమర్శకుల మెప్పు పొందారు. ఇన్ని పనులు చేసినా, తనలో సామర్థ్యం కంటే ఉత్సాహమే ఎక్కువగా ఉందని వినయంగా చెప్పుకున్నారు.

ఆరు శతాబ్దాల సాహితీ సృజన జీవితంగల సమతారావు గురించి ఇలా ఎంతయినా చెప్పుకోవచ్చు. సమతారావులోని ఆశ, ఉత్సాహం, ఆత్మ విశ్వాసం చివరి దశ వరకూ ఆయనకు దూరం కాలేదు.

2007లో ఒకసారి కలిసినపుడు ఉన్నట్టుండి ఒక ప్రశ్న వేశారు-నాకు విరసం సభ్యత్వం ఇస్తారా? అని ఊహించని ప్రశ్న అది. నా సమాధానం కోసం చూడకుండా ఆయనే అన్నారు-'విరసం సభ్యుడిగా ఉండడం గౌరవ ప్రదంగా భావిస్తాను' అని. అలా 2008 జనవరిలో గుంటూరులో జరిగిన విరసం సభలలో ఆయన విరసం సభ్యుడయ్యారు. శారీరకంగా కదల్లేకపోయినా, మానసికంగా ఆయన జీవిత ప్రస్థానం విరసందాకా కొనసాగింది.

తన జీవితంలో తను సంపాదించిన దాంట్లో చివరకు మిగుల్చుకోగలిగిన మొత్తాన్ని తనకిష్టమైన సంస్థలకు విరాళంగా ఇచ్చారు. అలా విరసానికి కూడా పాతిక వేలు ఇచ్చారు. ఒక మంచి పుస్తకానికి దీన్ని వినియోగించమన్నారు. ఇటీవలే వచ్చిన 'విరసం సాహిత్య విమర్శ 2004-2012' అనే గ్రంథానికి ఆ మొత్తాన్ని ఉపయోగించాం.

ప్రగతిశీల సాహితీ పథంలో క్షణం కూడా విశ్రాంతి లేకుండా ముందుకు సాగిన బాటసారి సమతారావు. ఆయన అమరత్వానికి విరసం జోహార్లర్పిస్తోంది.



వనరులను ప్రైవేటు బొక్కసాల్లో నింపుకోవడం పెరిగింది. మరోవైపు అమెరికా కార్పొరేషన్లు చమురు ఉత్పాదనపై నియంత్రణ కొనసాగించాయి. మరొకవైపు ప్రభుత్వ ఆదాయం విపరీతంగా పడిపోయింది. 1975లో ప్రతి వ్యక్తికి 1500 డాలర్లు ఉన్న ఆదాయం 1999 నాటికి 350కి పడిపోయింది.

ప్రభుత్వ ద్రవ్య సంక్షోభాన్ని పరిష్కరించడం కోసం భారాన్ని ప్రజలపైకి నెట్టెయ్యమని అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు వెనిజుయెలా పాలకులకు సలహానిచ్చాయి. 1989 ఫిబ్రవరిలో ఐ.ఎం.ఎఫ్ సూచించిన పొదుపు ప్యాకేజీతో ఒక్కరోజులో చమురు ధరలు ఆకాశాన్నంటాయి. దీంతో ప్రజల అసంతృప్తి ఒక్కసారి కట్టలు తెంచుకుంది. నాలుగు రోజుల పాటు రాజధాని కారకస్‌లో తిరుగుబాటు జరిగింది. అక్కణ్ణుంచి ఇతర ఎన్నో పట్టణాలకు, నగరాలకు వ్యాపించింది.

దారుణ అణచివేతతో అది సమసిపోయినా లోతైన ఆర్థిక, రాజకీయ, ప్రభుత్వ సంక్షోభాల్లో కూరుకుపోయిన సమాజం మళ్ళీ వెనక్కి తిరిగి చూడలేదు.

వాడల్లో చురుకైన నూతన స్థానిక సంస్థల ఆవిర్భావంతో తదుపరి దశాబ్దమంతా దాదాపు 7000 నిరసనలు జరిగాయి.

జాతీయ సంపదను నియంత్రించడంలో ప్రభుత్వానిదే ప్రధాన పాత్ర కావడంతో ప్రజల డిమాండ్లన్నింటికీ ప్రభుత్వమే కేంద్రంగా మారింది. క్రమంగా ఇది ఒక మహా వెల్లువ రూపం దాల్చింది.

**చావేజ్ ఆవిర్భావం :**

ఈ నేపధ్యంలో, వెనిజుయెలా సాయుధ బలగాల్లో రహస్యంగా వ్యాపిస్తున్న ఒక తిరుగుబాటు ధారకు లెఫ్టినెంట్ కల్నల్ హ్యూగో ఛావేజ్ నాయకత్వం వహించాడు. 1992లో ఈయన నాయకత్వంలో జరిగిన తిరుగుబాటు విఫలమైనప్పటికీ ప్రజా బాహుళ్యానికి ఒక ఆశా కిరణంలా కనిపించాడు.

ఆ తిరుగుబాటు తర్వాత రెండేళ్ళ పాటు నిర్బంధించబడినా, విడుదలయ్యాక 1998 అధ్యక్ష ఎన్నికల్లో పోటీ చేసాడు.

నిజమైన స్వాతంత్ర్యం సంపాదించాలన్నా, పేదరికాన్ని రూపుమాపాలన్నా ప్రజలకు అధికారమివ్వడమొక్కటే మార్గమని వాదిస్తూ దేశమంతటా ప్రచారం చేశాడు. తాను స్వయంగా మూవ్‌మెంట్ ఫర్ ఏ ఫిఫ్త్ రిపబ్లిక్ (ఎం.వి.ఆర్.) అనే కొత్త పార్టీని స్థాపించడమే కాక, తనను సమర్ధించే పార్టీలు, సంస్థలన్నీ ఐక్యమై పేట్రియాటిక్ పోల్ (పి.పి.)ను స్థాపించాలని పిలుపునిచ్చాడు.

వెనిజుయెలాలో తీవ్ర అసంతృప్తితో ఉన్న ప్రజావర్గాలను, విభిన్న వామపక్షాలను ఐక్యం చేయడానికి చావేజ్ పిలుపు తోడ్పడింది.

డిసెంబర్ 6, 1998లో 56.2 శాతం ఓట్లతో చావేజ్ అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. అయితే ఎన్నికల్లో గెలవడం, రాజ్యాధికారాన్ని చేపట్టడం ఒకటికాదని ప్రారంభం నుండే స్పష్టంగా ఉండింది.

పి.డి.వి.ఎస్.ఎ. పాత సంపన్న వ్యాపార వర్గపు బలమైన నియంత్రణలోనే ఉంది. ఎటువంటి విప్లవకర మార్పుకైనా సైన్యంలోని విశాల సెక్షన్ల మద్దతు ఏపాటి ఉంటుందో అగమ్యంగానే ఉండింది.

నూతన ప్రభుత్వానికి ఉన్న ప్రజా మద్దతు ఇంకా బలమైన సామాజిక సంస్థల్లో సుసంఘటితం కాలేదు. 'చావిస్మో'కు చెల్లా చెదురుగా ఉండే అసంఘటిత స్వభావం ఉంది. అందువల్ల అన్ని మార్పులకు కేంద్రకంగా పనిచేసేది 'కార్య నిర్వాహక వర్గపు' అధికారమే.

దాంతో, సంస్కరణలన్నీ అనివార్యంగా పై నుంచే చేపట్టవలసి వచ్చింది. అయితే, ప్రతి ముందడుగుతో - చావేజ్ తన సామాజిక పునాదిని బలపరచుకోవడానికి, సంఘటిత పరుచుకోవడానికి ప్రయత్నించాడు.

చావేజ్ చేపట్టిన మొదటిచర్య - ఒక నూతన రాజ్యాంగాన్ని రచించడం కోసం ప్రజాస్వామికంగా ఎన్నికైన రాజ్యాంగ సభను ఏర్పాటు చేయడం. ఈ చర్యతో పాత రాజకీయ వర్గానికి అనుకూలంగా ఉన్న రాజ్యాంగాన్ని మార్చగలిగాడు.

దశాబ్దాల పాటుగా అధికారాన్ని సంపద్వర్గాల గుప్పిట్లో పెట్టుకోవడానికి దోహదపడిన 'ప్రాతినిధ్య' ప్రజాస్వామ్యం స్థానంలో ఈ నూతన రాజ్యాంగం 'భాగస్వామ్య, క్రియాశీల' (participatory and protagonist) ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించింది. ఇందులో అధికారం ప్రజల చేతుల్లో ఉంటుంది.

ఈ నూతన భావాలు, ఆలోచనలకు వాస్తవరూపం కల్పించడం బొలివారియన్ శక్తుల ముందున్న సవాలు. అలా చేయడమంటే అమెరికా వెన్నుదన్నులతో ఉండే సాంప్రదాయ శక్తులతో ముఖాముఖి తలపడడమే.

మూడేళ్ళలో ఈ రెండు పరస్పర విరోధ కూటములూ మూడు సార్లు తలపడ్డాయి. ప్రతిసారీ కూడా విప్లవానుకూల శక్తులు విజయం సాధించి, సైనికంగా, ఆర్థికంగా, రాజకీయంగా తమ ఆధిపత్యాన్ని సుసంఘటితం చేసుకున్నాయి.

**ముఖాముఖి :**

మొదటిసారి చావేజ్ వ్యతిరేక శక్తులు 11 ఏప్రిల్ 2002 నాడు చావేజ్‌తో తలపడ్డాయి. చావేజ్‌కు వ్యతిరేకంగా చేపట్టిన ఒక ప్రదర్శన ఒక సైనిక విద్రోహంగా మారి చావేజ్‌ను కూలదోసి ఆ దేశపు చాంబర్ ఆఫ్ కామర్స్ ప్రముఖుణ్ణి అధ్యక్ష పదవిలో కూచోబెట్టాయి.

అయితే ఈ సైనిక విద్రోహాన్ని పౌర-సైనిక తిరుగుబాటుతో ప్రజలు ఓడించారు. సైనిక విద్రోహంలో coup పాల్గొన్న, మద్దతునిచ్చిన వందలాది ఆఫీసర్లను తొలగించి పాత సంపన్నవర్గపు చేతుల్లోంచి సైనిక నియంత్రణను తప్పించారు.

అదే సంవత్సరపు చివర్లో మళ్ళీ ఒకసారి చావేజ్‌ను పదవీచ్యుతుణ్ణి చేసే ప్రయత్నం జరిగింది. పి.డి.వి.ఎస్.ఎ. మేనేజ్‌మెంట్, బడా పెట్టుబడిదారులు, కార్పొరేట్ మీడియా, భ్రష్టులైన ట్రేడ్ యూనియన్ నాయకులు కుమ్మక్కై వ్యూహాత్మకమైన చమురు రంగంలో ఉత్పాదనను నిలిపి వేయాలని ప్రయత్నించారు. ఇందుకు జవాబుగా పి.డి.వి.ఎస్.ఎ. కార్మికులు, సైనికులు, కమ్యూనిటీ కార్యకర్తలు కదిలి అధికారుల సమ్మెను నడ్డి విరగ్గొట్టారు.

కింది నుండి జరిగిన ఈ సమీకరణతో వెనిజుయెలా ప్రభుత్వం పి.డి.వి.ఎస్.ఎ.లో తిష్టవేసుకున్న మితవాద బ్యూరోక్రట్లను తొలగించి వేసి కంపెనీ యాజమాన్యాన్ని పూర్తిగా ప్రభుత్వ అదుపులోకి తెచ్చేందుకు వెసులుబాటు కల్పించింది.

ఈ పోరాట సందర్భంగా కార్మికులు, కమ్యూనిటీలు పెద్ద ఎత్తున సంఘటితం కావడం, ప్రతిపక్షం ఆగస్టు 2004లో చావేజ్‌ను రికాల్ చేయడానికి నిర్వహించిన రెఫరెండాన్ని ఓడించడంలో కీలకపాత్ర వహించింది. ఇది ప్రతిపక్షపు మూడవ పెద్ద దాడి.

నూతన రాజ్యాంగం ప్రవేశపెట్టిన ప్రజాస్వామిక సంస్కరణలు చావేజ్ ప్రజాస్వామిక స్వభావానికి అద్దం పట్టేవి కావడంతో ఈ రెఫరెండంలో ఛావేజ్ గెలుపు సాధ్యమైంది.

సైన్యం, పి.డి.వి.ఎస్.ఎ.లపై నియంత్రణ సాధించడం, సామాజిక

పునాది సుసంఘటితం కావడంతో చావేజ్ 2003 – 2005 కాలంలో ప్రజల అధికారాన్ని మరింత పటిష్టం చేసే ఎన్నో ప్రయోగాలను చేపట్టడం సాధ్యమైంది.

ఉచిత విద్య, వైద్యం అందించే సామాజిక సంస్థలు; కో-ఆపరేటివ్స్, కార్మికులు నడిపే ఫ్యాక్టరీలు వంటి ఆర్థిక ఎంటర్‌ప్రైజ్‌లు వంటి వాటితో పేదరికంతో పోరాడగలగడమే కాకుండా ప్రజలు సంఘటితపడే సామర్థ్యాన్ని కూడా పెంచింది.

2006లో చావేజ్ మళ్ళీ ఎన్నికల్లో నిలబడే నాటికి బొలివేరియన్ విప్లవానికి లాటిన్ అమెరికా ప్రాంతమంతటా ప్రగతిశీల, వామపక్ష ప్రభుత్వాల కూటమి మద్దతు కూడా లభించసాగింది. బొలివేరియన్ విప్లవపు కీలక లక్ష్యమైన ప్రాంతీయ సహకారం; ప్రాంతీయ స్థాయిలో సమీకృతం కావడానికి అవసరమైన మార్గాన్ని తెరిచింది.

అయితే ఈ విప్లవం ఇంకా కార్పొరేట్ అధికారాన్ని నిర్ణయాత్మకంగా కూలదోయలేదనేది స్పష్టం. అట్లాగే కార్పొరేట్ అధికారానికి ఊడిగం చేసే పాత లంచగొండి రాజ్యం స్థానంలో కింది నుంచి నూతన ప్రజా అధికారాన్ని నిర్ణయాత్మకంగా నెలకొల్పలేదనేది కూడా స్పష్టమే.

**పెట్టుబడి వ్యతిరేక దాడి :**

డిసెంబర్ 2006 ఎన్నికలలో గెలిచాక చావేజ్ మరో పెట్టుబడి వ్యతిరేక దాడి చేపట్టాడు. జనవరి 8న జరిగిన ప్రారంభోత్సవం నాడు చావేజ్ ప్రజలకు 'రాజకీయ, సామాజిక, ఆర్థిక అధికారాన్ని బదిలీ చేయడాన్ని' నూతన టర్మ్ లక్ష్యంగా ప్రకటించాడు. అలా చేయాలంటే పాత రాజ్యాన్ని ధ్వంసం చేయడం తప్పనిసరి.

'21వ శతాబ్దపు సోషలిజాన్ని' సాకారం చెయ్యాలంటే ఒకేసారి మూడు రంగాల్లో ముందుకు సాగడం అవసరమని చావేజ్ అన్నాడు. ఉత్పాదక సాధనాలపై సామాజిక యాజమాన్యాన్ని పెంచడం; పనిస్థలంలో ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించడం; సామాజిక అవసరాలకు అనుగుణంగా ఉత్పత్తి చేయడం.

ఈ ఎజెండాను పరిపూర్తి చేయడానికి ఒక ఐక్య విప్లవపార్టీ 'యునైటెడ్ సోషలిస్టు పార్టీ ఆఫ్ వెనిజుయెలా' (పి.ఎస్.యు.వి.)ని స్థాపించేందుకు తోడ్పడవలసిందిగా చావేజ్ పిలుపునిచ్చాడు. ప్రారంభపు రిక్రూట్‌మెంట్ క్యాంపెయిన్‌లో 45 లక్షల మంది ఇందులో చేరారంటే ఈ ప్రయత్నానికి ఉన్న మద్దతు ఎటువంటిదో అర్థమవుతుంది.

తదుపరి ఆరేళ్ళలో చావేజ్ ప్రభుత్వం చమురు, విద్యుత్తు, టివి కమ్యూనికేషన్ రంగం, బ్యాంకింగ్, ఉక్కు, సిమెంట్, ఆహార ఉత్పాదన రంగాల్లో ఎన్నో జాతీయకరణ చర్యలు చేపట్టి ఆర్థిక వ్యవస్థపై జాతీయ అదుపును స్థాపించింది.

ఆర్థిక వ్యవస్థలోని కీలక రంగాల్లో అవసరమైన నియంత్రణ సాధించడంతో ఉత్పాదనా లక్ష్యాలను నిర్ధారించగలిగే స్థితిలోకి ప్రభుత్వం వచ్చింది. ఇందుకు సహకరించని కంపెనీలు మొదలైన వాటిని జాతీయం చేస్తారనే భయం పనిచేయసాగింది. వరుసగా జరిగిన జాతీయీకరణ పేదల అవసరాలకనుగుణంగా ప్రభుత్వ చొరవతో జరిగినవే కానీ కార్మికుల పోరాటాల వల్ల జరిగినవి కావు. 'జాతీయీకరణ మాత్రమే సోషలిజంతో సమానం కాదు' అని చావేజ్ పదే పదే అన్నాడు.

కార్మికుల భాగస్వామ్యాన్ని ప్రేరేపించేందుకు సాయం చేయడానికి ప్రభుత్వం ఉక్కు, అల్యూమినియం, విద్యుత్తు కంపెనీల వంటి ప్రభుత్వ కంపెనీల్లో కార్మికుల నియంత్రణకు చర్యలు చేపట్టింది.

అట్టడుగున పనిచేసే కమ్యూనల్ కౌన్సిళ్ళు వాటి పైన కమ్యూన్ల ఏర్పాటును (కమ్యూనల్ కౌన్సిళ్ళ నుండి ఎన్నికైన ప్రతినిధులతో కమ్యూన్లు) ప్రోత్సహించింది ప్రభుత్వం. అస్తిత్వంలో ఉన్న వివిధ రకాల కమ్యూనిటీ సమూహాలను ఒకదానితో మరొక దాన్ని జోడించి, వాటిపైన మరింత ఉన్నత స్థాయిలో పనిచేసే ఉద్దేశ్యంతో కమ్యూనిటీ కౌన్సిళ్ళను ఏర్పరిచారు. వీటి బాధ్యత ఆయా కమ్యూనిటీలు ఎదుర్కొంటున్న సమస్యలను విశ్లేషించి వాటిని పరిష్కరించడానికి ఒక ప్లాను రూపొందించడం. వీటికి నిధులు ప్రభుత్వం సమకూరుస్తుంది కానీ, ప్రధాన నిర్ణయాలన్నీ పౌర అసెంబ్లీలలోనే జరిగేవి. కమ్యూనిటీ సాధికారత పెంపొందిస్తూ చమురు ఆదాయాన్ని పునః పంపకం చేయడంలో ఇదొక విశిష్టమైన ప్రయోగం.

2009లో ఈ కమ్యూన్లను మరింత అభివృద్ధి చేయడానికి ప్రభుత్వమొక చర్య చేపట్టింది. మరింత పెద్ద స్థాయిలో సామూహికంగా సమస్యలను పరిష్కరించుకోవడానికి – ఒక నిశ్చితమైన కమ్యూనిటీలో ఉన్న ఎన్నో కమ్యూనల్ కౌన్సిళ్ళను కలిపి కమ్యూన్లను ఏర్పాటు చేయడం. ఈ నూతన సంస్థాగత రూపాలు, కమ్యూనిటీలను సంఘటితం చేయడంలో మునుపెన్నడూ లేనంత సంఖ్యలో ప్రజలను భాగస్వాములను చేసాయి. ఇవి నూతన రాజ్య నిర్మాణానికి ఇటుకలుగా ఉపయోగపడతాయి.

**అంతర్గతవర్గ పోరాటం :**

జాతీయీకరణ, కార్మికుల నియంత్రణ, కమ్యూనిటీ కౌన్సిళ్ళు – వీటన్నింటినీ ఒకేసారి చేపట్టడంతో 'చావిస్మో'లో అంతర్గతంగా ఉనికిలో ఉన్న వర్గ పోరాటం ముందుకొచ్చింది.

2009లో వచ్చిన బ్యాంకింగ్ సంక్షోభం చాలా బ్యాంకుల జాతీయీకరణకు దారి తీసింది. వాటి యజమానులు జైలు పాలయ్యారు. ఈ క్రమంలో విప్లవోద్యమక్రమంలోనే రాజ్యంతో ఉన్న సంబంధాల ద్వారా స్వలాభం చేకూర్చుకున్న రంగం గురించి బయటపడింది. వీళ్ళను ప్రజలు 'బొలిబూర్జువేసియా' అని పిలిచారు (బొలివేరియన్ బూర్జువాజీ).

కార్మికులకు, కమ్యూనిటీలకు అధికారాల బదిలీని అధికార యంత్రాంగం ప్రతిఘటించింది.

లంచగొండితనం వంటి కొరకరాని సమస్యలతో పాటు, కంపెనీ, అధికారులు, ప్రభుత్వాధికారులు తమ పీఠాల అధికారాలను వదులుకోవడానికి సిద్ధపడని సమస్య గురించి కార్మికులు, కమ్యూనిటీ కార్యకర్తల ఫిర్యాదులు పెరిగాయి.

గత సంవత్సరం ఆఖరిలో చావేజ్ కూడా పి.ఎస్.యు.వి. ని పట్టి పీడిస్తున్న అవలక్షణాల గురించి మాట్లాడాడు. 'పాత తరహాలో రాజకీయాలు నెరపడం మనల్ని మింగేస్తుంది. రాజకీయాల్లో లంచగొండితనం కూడా మనలను మింగేస్తుంది. పాత పెట్టుబడిదారీ విలువలు మనలను అన్ని వైపుల నుండీ చుట్టుముడుతున్నాయి.'

పార్టీ మళ్ళీ తన సిద్ధాంతానికి తిరిగి వెళ్ళాల్సి ఉంది.

ఈ సమస్యలను గుర్తించి చావేజ్ 2011 అక్టోబర్‌లో విప్లవ సానుకూల సామాజిక ఉద్యమాలన్నీ ఏకమై 2012 అధ్యక్ష ఎన్నికల్లో ఘనవిజయాన్ని సాధించడానికి కృషి చెయ్యాలని పిలుపునిస్తూ మహా దేశభక్త ధృవం (Great patriotic pole - GPP) ను ఏర్పరిచాడు.

30,000కు మించి గ్రూపులు ఇందులో చేరాయి. మొత్తం మీద పి.ఎస్.యు.వి. కానీ పార్టీలు, సామాజిక ఉద్యమాలు అన్నీ కలిపి చావేజ్‌ను గెలిపించాయి.

# లాటిన్ అమెరికా దేశాలు - చావేజ్ 'సోషలిజపు' ప్రయోగం

## - మావోయిస్టు రాజకీయ ఖైదీలు

(2012లో మూడు దేశాల్లోని ఎన్నికలు, అధికార మార్పుల గురించి ప్రపంచ దేశాలు ఆసక్తిగా చూసాయి. ఇందులో రెండు దేశాల్లోని ఎన్నికలు, కొత్త నాయకత్వం వాస్తవానికి ప్రపంచరాజకీయాల్లో ఎటువంటి మౌలికమార్పు తీసుకురాగలిగినవి కావు. కానీ ఒక చిన్నదేశపు ఎన్నికలు మాత్రం ప్రగతిశీల శక్తులకు, సామ్రాజ్యవాద ఏజెంట్లకు మధ్యపోటీగా, ఎన్నో దేశాల రాజకీయాలను ప్రభావితం చేయగలిగేదిగా ఆసక్తిని రేకెత్తించాయి. అదే వెనిజుయెలా, అమెరికా, చైనాల్లో అధికారం ఎవరు చేపట్టినా ఆ దేశాల మౌలిక రాజకీయాల్లో ఎటువంటి మార్పు కలిగేది కాదు. కానీ వెనిజుయెలాలో చావేజ్ గత ఒకటిన్నర దశాబ్దాలుగా అమెరికా సామ్రాజ్యవాదానికి ఒక సవాల్‌గా నిలిచి ఆ దేశ ఆర్థిక, రాజకీయ పాలసీల్లో ఒక పెనుమార్పు తీసుకురావడమే కాకుండా మొత్తం లాటిన్ అమెరికా దేశాలనే ప్రభావితం చేసి ప్రపంచ ప్రజలను ఆశ్చర్యచకితులను చేశాడు. అమెరికా ప్రయోజనాలకు ఏమాత్రం భంగం కలిగినా సైనిక విద్రోహాలు, గెరిల్లా తిరుగుబాట్లు చేయించో లేదా ప్రత్యక్ష సైనిక చర్యలకు పూనుకొనో ఎన్నో దేశాల్లో జోక్యం చేసుకున్న అమెరికా వెనిజుయెలాలో ఏం చేయలేకపోవడం (ఎన్నో ప్రయత్నాలు చేసినప్పటికీ) ప్రపంచ పీడిత ప్రజలకు ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగించింది. పైగా చావేజ్ సోషలిజపు దారిలో ప్రయాణించడం ఈ నూతన 'సోషలిస్టు ప్రయోగం' పట్ల మార్క్సిస్టుల్లో కూడా ఆసక్తిని రేకెత్తించింది. ఈ నేపథ్యంలో ఈ 'సోషలిస్టు ప్రయోగాన్ని' ఎట్లా అర్థం చేసుకోవాలి, చావేజ్ నిర్మించడానికి ప్రయత్నిస్తుంది సోషలిజమేనా? దీన్ని మార్క్సిస్టు దృష్టికోణం నుండి ఎట్లా చూడాలి? పనామా, హైతి, చిలీ, గుటిమెలా, నికరాగువాల్లోలా అమెరికా ఎందుకు ప్రత్యక్ష జోక్యం చేసుకోవడం లేదు? చావేజ్ ఎందుకు, ఎలా నిలదొక్కుకో గలుగుతున్నాడు - ఈ ప్రశ్నలన్నింటి గురించి సహజంగానే మావోయిస్టు రాజకీయ ఖైదీలు కూడా చర్చించుకుంటున్నారు. ఆ చర్చలకు ప్రాతిపదికగా, ఒక మేరకు ఆ చర్చల సంగ్రహంగా ఒక సీనియర్ మావోయిస్టు రాజకీయ ఖైదీ ఇంగ్లిషులో రాసిన వ్యాసానికిది అనువాదం / అనుకరణ)

గత దశాబ్దకాలంగా లాటిన్ అమెరికా దేశాలలో నెలకొన్న పరిస్థితి గురించి అర్థం చేసుకోవడానికి ఆధారం మావో అన్న మాటల్లో ఉంది. 'దేశాలు స్వతంత్రాన్ని, జాతులు విముక్తిని, ప్రజలు విప్లవాన్ని కోరుతున్నారు'. దీన్ని నిర్దిష్టంగా చూడకపోతే ఏదో సాధారణ సూత్రంలా డొల్లు ప్రకటనగా మాత్రమే అనిపిస్తుంది. దీన్ని కొంచెం విస్తారంగా చూద్దాం.

1970ల్లో ఏర్పడిన సంక్షోభం సామ్రాజ్యవాదంలో కొన్ని నిర్మాణాత్మక మార్పులకు దారి తీసింది. లాటిన్ అమెరికా దేశాలు అప్పట్లో భారీ అప్పుల ఊబిలో కూరుకొని పోయి ఉన్నాయి. ఈ సామ్రాజ్యవాద 'పునర్నిర్మాణం'లో అత్యంత ముఖ్యమైనదీ, తొలినాటిదీ అయిన భాగాన్ని సాధారణంగా 'నయా - ఉదారవాద' దాడిగా పేర్కొంటారు. అమెరికా నాయకత్వంలో జరిగిన ఈ సామ్రాజ్యవాదపు విచికిత్సకు మొట్టమొదట గురయింది ఈ లాటిన్ అమెరికా దేశాలు. అమెరికా తన ఇష్టం వచ్చినట్టుగా చేయడానికి లాటిన్ అమెరికా దేశాలను తన పెరటిదొడ్డిలాగా ఉపయోగించుకున్నది. ఇతర సామ్రాజ్యవాద దేశాలను ఇందుకు దూరంగానే ఉండమన్నది. క్యూబా మాత్రం ఇందుకు మినహాయింపు. క్యూబాపైన అమెరికా చేపట్టిన అన్ని చర్యలు, కుట్రలు, కుహకాలను క్యూబా విజయవంతంగా ఎదుర్కొని అమెరికా దాడిని తట్టుకుని నిలబడగలిగింది. (క్యూబా సోవియట్ యూనియన్ శిబిరంలో చేరడాన్ని ఈ నేపథ్యంలో చూడాలి. క్యూబా అమెరికాకు వ్యతిరేకంగా నిలబడి తట్టుకోవాలంటే ఆ శీతల యుద్ధకాలంలో మరోదారి దానికి లేదు). ఈ నయా ఉదారవాద దాడి లాటిన్ - అమెరికా దేశాల్లో ప్రజల ఆర్థిక సమస్యలను, దారిద్ర్యాన్ని మరింత తీవ్రతరం చేసింది. వ్యవసాయిక వాణిజ్య రంగంలో బహుళజాతి సంస్థల చొరబాటు రైతాంగాన్ని కడు పేదరికంలోకి నెట్టింది. కార్మికుల నిజ జీవనస్థాయి దారుణంగా పడిపోయింది. మధ్యతరగతిలోని విశాలమైన వర్గం కూడా దిగజారింది. స్థానిక పాలకవర్గాలలోని కొన్ని భాగాలను కూడా ఈ నయా - ఉదారవాద దాడి నెగెటివ్‌గా ప్రభావితం చేసింది. కొద్ది కాలానికి (1980ల చివరికి) ఈ విధానాల దుష్ఫలితాలు ప్రస్ఫుటంగా బయటపడడంతో ఈ విధానాల సూత్రధారులైన అమెరికా సామ్రాజ్యవాదులకు, స్థానిక పాలక వర్గాల్లోని వారి

---

**సవాళ్ళు :**

వెనిజుయెలా విప్లవం ఇప్పుడు మూడు సవాళ్ళను ఎదుర్కొంటుంది. మొదటిది - అమెరికా నుంచి పొంచి ఉన్న ప్రమాదం. అమెరికా ప్రగతిశీల పెరాగువా అధ్యక్షుడు ఫెర్నాండో ల్యూగోను సైనిక తిరుగుబాటుతో కూలదోయడంలో విజయవంతం అయింది. చావేజ్‌ను తొలగించడానికి వెనిజుయెలా ప్రతిపక్షానికి అది సంపూర్ణంగా మద్దతునిస్తుంది.

రెండవది - విప్లవం ఏ మేరకు లంచగొండితనం, బ్యూరక్రసీ సమస్యలను విజయవంతంగా ఎదుర్కొంటుందనేది.

ఈ సవాళ్ళను అధిగమించాలంటే కమ్యూన్లు, కార్మికుల నియంత్రణ వంటి వాటిలో ప్రజా భాగస్వామ్యం మరింత పెంపొందాలి.

మూడవ సవాలు - చావేజ్ అనారోగ్యం. సామూహిక నాయకత్వం ద్వారానే చావేజ్ లేని లోటును పూరించడం సాధ్యమౌతుంది.

ప్రజలు మరింతగా సంఘటితం కావడం, చావేజ్ స్థానంలో సామూహిక నాయకత్వం ఎదగడం పైన భవిష్యత్ పరిణామాలు ఆధారపడి ఉంటాయి.

*(ఈ వ్యాసం అరుణతారకు జనవరి నెలలో చావేజ్ మరణానికి ముందు అందింది.)*



తొత్తులకు వ్యతిరేకంగా ఈ ప్రాంతాలన్నిటా పెద్ద ఎత్తున ప్రజలు ఉద్యమించారు. 80ల చివర్లో, 90ల ప్రారంభంలో ఈ నయా ఉదార విధానాలకు, వాటిని అమలు జరుపుతున్న పాలక వర్గాలకు వ్యతిరేకంగా లాటిన్ అమెరికా దేశాల్లో ప్రజాందోళనలు పెల్లుబికాయి. వీటిలో అత్యధిక దేశాల్లో రాజకీయ పటలంలో వామపక్షం వైపు మొగ్గు కనిపించింది. సోషల్ డెమొక్రటిక్ రాజకీయాలు, సంక్షేమ రాజ్య పథకాలకు ప్రజల మద్దతు, వారి భూమిక పెరిగింది. అత్యధిక దేశాల్లో మితవాద (రైట్-వింగ్) ప్రభుత్వాలు కూలిపోయాయి. నూతన ప్రభుత్వాల్లో వామపక్ష మొగ్గు ఉన్న రాజకీయాలు ఆధిపత్యంలోకి వచ్చాయి. 'సమానత్వంతో కూడిన అభివృద్ధి' అనే నినాదాలు ఊపందుకున్నాయి. అధికారంలోకి వచ్చిన సోషల్ - డెమొక్రటిక్ పెద్దల (ఎలిట్)పై ఒకవైపు రైతాంగం, కార్మిక వర్గ, మధ్యతరగతుల ప్రజాందోళనల ఒత్తిడి ఉండడంతో సామాజిక - ప్రజాస్వామ్య పలుకులు పలుకుతూనే (ఎల్.పి.జి. విధానాలను వ్యతిరేకిస్తూ మాట్లాడుతూనే) మార్కెటు విధానాలసు మాత్రం వ్యతిరేకించలేదు. మార్కెటు వల్ల నెలకొంటున్న అత్యంత దుష్ఫలితాలను ఎదుర్కోవాలనే తర్కంతో మార్కెటు తంత్రాన్ని అవలంబించారు. అమెరికా సామ్రాజ్య వాదానికి, ఎల్.పి.జి. పాలసీలకు వ్యతిరేకంగా కూడా వాగాడంబరం ప్రదర్శించేవారు.

ఇదే సమయంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇతర దేశాలలో తలమునకలై పోయిన విషయాన్ని కూడా గమనంలోకి తీసుకోవాలి. సోవియట్ యూనియన్ కూలిపోయి, వార్సా ఒడంబడిక విచ్ఛిన్నం కావడంతో ఆ ప్రాంతాల్లోకి రాజకీయంగా, ఆర్థికంగా చొరబడడానికి ఏర్పడిన అవకాశాలు. సీనియర్ బుష్ కాలంలో జరిగిన ఇరాక్ యుద్ధం, మధ్య ఆసియా ప్రాంతంలో జోక్యం - ఈ నేపథ్యంలో లాటిన్ అమెరికా దేశాల్లో ప్రజా ఉద్యమాలు, వర్గపోరాటాలు చెలరేగి నూతన - ఉదారవాద పాలసీలను దెబ్బకొట్టి అక్కడి అత్యంత మితవాద ప్రభుత్వాలను కూలదోసాయి. అన్ని దేశాల్లో వామపక్ష ప్రభుత్వాలో, సోషల్ - డెమొక్రటిక్ ప్రభుత్వాలో అధికారంలోకి వచ్చిన ఈ ధోరణినే 'గులాబీ వెల్లువ' (పింక్‌టైడ్) అంటారు. చావేజ్ వెనిజుయెలాలో 1998లో; 2002లో లూలా (పిటి) బ్రెజిల్‌లో, గుటెరెజ్ ఈక్వెడార్‌లో, చిలీలో సోషలిస్టు పార్టీకి చెందిన లాగోస్ అధికారంలోకి వచ్చారు. (2006లో చిలీలో మిషెల్ బచెట్), 2003లో అర్జెంటీనాలో నెస్టర్ కుచేనర్ (ప్రస్తుతం అతని భార్య క్రిస్టినా కిర్చ్‌నర్) 2005లో బొలీవియాలో ఇవామొరేల్స్, 2004లో ఉరుగ్వేలో టాబోర్ వాక్వెజ్, బ్రాడ్‌ఫ్రంట్; ఈక్వెడార్‌లో 2006లో రాఫేల్ కొరియా, నికరాగువాలో డేనియల్ ఆర్టెగా (సాండినిస్టాస్) అధికారంలోకి వచ్చారు.

'నయా-ఉదారవాద' విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు ఎన్నికల ద్వారా ఇచ్చిన ఈ తీర్పులు ఆ విధానాల ఓటమికి దారి తీయలేదు. ఉదాహరణకు సామ్యవాద-ప్రజాస్వామిక వాగ్దానాలతో (సోషల్ డెమొక్రాటిక్ ప్లాట్‌ఫామ్) అధికారంలోకి వచ్చిన లూలా ఒకవైపు ప్రజాపక్ష విధానాల జపం చేస్తూనే ఐ.ఎం.ఎఫ్./ప్రపంచబ్యాంకు ప్రాయోజిత విధానాలను కొనసాగించాడు. ఈక్వెడార్‌లో గుటెరెజ్ పాత నయా-ఉదారవాద విధానాలనే కొనసాగిస్తుండడంతో 2005లో ఎన్నికల్లో ఓడిపోయాడు. డేనియల్ ఓర్టెగా సామ్రాజ్యవాదులతో పూర్తిగా రాజీపడిపోయి నికరాగువాలో పోరాటకాలంలో సాండినిస్టాలు సంపాదించుకున్న రాడికల్ ప్రతిష్ఠను సొమ్ము చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ 'గులాబి వెల్లువ'పై సవారీచేస్తూ అధికారంలోకి వచ్చిన వాళ్ళలో అత్యధికులు, సామ్రాజ్యవాదంతో 'నయా-ఉదారవాద' పథకంతో సర్దుబాట్లు, రాజీలు చేసుకుని ప్రజల ఆకాంక్షలకు ద్రోహం చేశారు.

ఈ 'గులాబి వెల్లువ' మార్పులు జరుగుతున్న కాలమంతా లాటిన్ అమెరికా అంతటా అతలాకుతలమైన పరిస్థితి నెలకొని ఉండింది. మార్పును కోరుతూ ప్రజలు సర్వత్రా తిరుగుబాట్లు చేశారు. వస్తుగతంగా చూస్తే 'విప్లవ పరిస్థితి' (లేదా విప్లవ సంక్షోభం) అనతగిన పరిస్థితి నెలకొంది - ప్రజలు పాత పద్ధతిలో పాలింపబడడానికి సిద్ధంగా లేని స్థితి, పాలకులు పాత పద్ధతిలో పాలన కొనసాగించలేని పరిస్థితి. అయితే, విప్లవకర మార్క్సిస్టులు ఆశించే విప్లవాత్మక మార్పు మాత్రం విభిన్న కారణాల వల్ల జరగలేదు. ఇటువంటి పరిస్థితిలో బూర్జువా ప్రత్యామ్నాయమైన సోషల్ - డెమొక్రసీ - ముందుకు వచ్చి కేంద్ర స్థానాన్ని ఆక్రమించుకున్నది. అయితే చాలా దేశాల్లో కనీసం ఆ సోషల్ - డెమొక్రటిక్ విధానాలను కూడా పాటించకుండా ఆ జెండాను ముందు పెట్టుకుని సామ్రాజ్యవాదంతో కుమ్మక్కైన పాత విధానాలనే కొనసాగించారు.

అయితే ఇందుకు కొన్ని మినహాయింపులు కూడా ఉన్నాయి. అట్లాంటి మినహాయింపులో కొట్టొచ్చినట్టు కనపడే ప్రముఖ మినహాయింపు వెనిజుయెలాలోని హ్యూగో చావేజ్. చావేజ్ సామ్రాజ్యవాద వ్యతిరేక, జాతీయ, ప్రజానుకూల ధోరణులు చాలా బలమైనవి. అమెరికా, స్థానిక ప్రతీక్రియావాదుల ఎన్నో దాడులను అవి తట్టుకుని నిలిచాయి. అతని సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలు విదేశాంగ నీతికి మాత్రమే పరిమితం కాలేదు. అతను తన దేశ ఆర్థిక విధానాల్లో అమెరికా సామ్రాజ్యవాద ప్రయోజనాలకు గట్టిదెబ్బ కొట్టాడు. అతని జాతీయవాదం ఏదో ఊకదంపుడు జాతీయవాదం కాదు. ఉదాహరణకు అర్జెంటీనాలో కిర్చెనర్ జాతీయభావనను రెచ్చగొట్టి ప్రజలను సమీకరించడం కోసం బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఫాక్‌ల్యాండ్ దీవుల సమస్యను మధ్య మధ్యలో లేవనెత్తుతూ ఉంటుంది. (అయితే ఈ మధ్య కాలంలో ఆ దీవుల వద్ద చమురు నిలువలు బయటపడడం వల్ల ఈ సమస్య నిజమైన ప్రాముఖ్యత సంతరించుకుంటున్నదనేది వేరే సంగతి) చావేజ్ సైమన్ బొలీవర్ సామ్రాజ్యవాద వ్యతిరేక సంప్రదాయాన్ని, జ్ఞాపకాలను పునరుద్ధరిస్తూ అతణ్ణి తన ఆదర్శంగా, తన దార్శనికుడిగా ప్రకటించాడు. (సైమన్ బొలీవర్ ఆ ప్రాంతంలో తన కాలానికి (1783-1830) చెందిన గొప్ప జాతీయ విప్లవకారుడు) చావేజ్ జాతీయవాదం ఆయన అమెరికా వ్యతిరేక విధానాల్లో వ్యక్తమవుతుంది. ఎన్నికల్లో తన విజయం కోసం మాత్రమే కాకుండా అధికార యంత్రాంగాన్ని అదుపులో ఉంచి నియంత్రించడానికి, రాజ్య విధానాన్ని తయారుచేయడానికి కూడా ప్రజలను సమీకరించాడు. చావేజ్ స్పష్టంగా ప్రజానుకూలమైన రాజ్యాంగాన్ని రచించడమే కాక, ఆ రాజ్యాంగాన్ని చర్చించి, సుసంపన్నం చేయడానికి విశాల ప్రజారాశుల్ని కదిలించాడు. దాని ఆమోదానికి రెఫరెండం నిర్వహించాడు. వ్యాపకమైన మద్దతు లేకుండా అమెరికా వ్యతిరేక పోరాటం

కొనసాగించడం కష్టమని గుర్తించి ప్రాంతీయ స్థాయిలో మైత్రీ సంబంధాలు, ఐక్యసంఘటనలు ఏర్పరచడానికి తీవ్రంగా కృషి చేసి, ఒక మేరకు విజయవంతమయ్యాడు. అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ఒకవైపు చేస్తూనే తన ప్రజల జీవనస్థితిగతులు, సంక్షేమం మెరుగుపరచడంలో చావేజ్‌కు తన దేశంలో ఉన్న అపార చమురు నిల్వలు చాలా దోహదం చేశాయి. అతను ఈ చమురు నిల్వలను ప్రజా సంక్షేమ కార్యక్రమాలకు, సబ్సిడీలు అందించడానికీ అమెరికా ప్రాబల్యాన్ని వ్యతిరేకిస్తూ అమెరికా సామ్రాజ్యవాదులపై ఆధారపడడాన్ని తగ్గించుకోగోరే ప్రాంతీయ ప్రభుత్వాలకు మద్దతు తెల్పడానికి కూడా ఉపయోగించాడు. అమెరికా నాయకత్వం వహిస్తున్న కూటమిని విచ్ఛిన్నం చేయడానికి లాటిన్ అమెరికాలో మరో ప్రత్యామ్నాయ కూటమిని ఏర్పరచాడు. ఆ ప్రాంతంలో అమెరికా ఆధిపత్యంలో ఏర్పాటుచేయాలని ప్రయత్నించిన 'స్వేచ్ఛా వ్యాపార మండలా'నికి వ్యతిరేకంగా పోరాడానికి నాయకత్వం వహించి దాన్ని భగ్నం చేసాడు. చావేజ్ తన చమురు ఆదాయాన్ని ఇతర లాటిన్ అమెరికా దేశాలలో సంక్షేమ కార్యక్రమాలు అమలు పరచడానికి, ఆర్థిక సాయం అందించేందుకు ఉపయోగించాడు.

చావేజ్ తను 21వ శతాబ్దపు సోషలిజాన్ని నిర్మిస్తున్నానని అంటాడు. క్రమక్రమంగా సంస్కరణలు అమలు పరిచి ప్రస్తుత రాజ్యాన్ని 'ప్రజారాజ్యం'గా మార్చడానికి ప్రయత్నిస్తున్నానని అంటాడు. దానికోసం అతను ప్రతి ఉత్పత్తి యూనిట్, గ్రామం, ఇంకా ఇతర స్థాయిల్లో రాజ్య యంత్రాంగం, అధికార తంత్రాన్ని పర్యవేక్షించి, నియంత్రించడం కోసం ప్రజలను సమీకరించి సంఘటిత పరిచాడు. విధానాలను అమలుపరచేందుకే కాక రూపొందించడానికి కూడా ప్రజలను సమీకరిస్తున్నాడు. కారకాస్‌లో కార్మికులను, మురికివాడల ప్రజలకు ఇళ్ళు నిర్మించేందుకు అతను చేసిన ప్రయత్నం శ్లాఘనీయమైన ప్రయత్నం. అతను ప్రజల జీవన ప్రమాణాలను చెప్పుకోదగిన స్థాయిలో పెంచాడు. ప్రజలకు వైద్య సౌకర్యాలు కల్పించడంలో క్యూబా తర్వాత వెనిజుయెలానే చెప్పుకోవచ్చు. అదే సమయంలో ప్రాముఖ్యత కలిగిన ప్రతి విషయంలోనూ అతను అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటం చేపట్టాడు.

ఇక దేశంలో అంతర్గతంగా చూస్తే – అతను 'ప్రజా అధికార అంగాల'ను ఏర్పాటు చేశాడు. ఇవి 'సామాజిక కంట్రోలర్' పాత్రను నిర్వహిస్తున్నాయి. ఈ స్థానిక అంగాలను స్థానిక, ప్రాంతీయ, జాతీయ స్థాయిలో అధికార సంస్థలుగా ఐక్యపరిచి (conglomeration) పాత బూర్జువా రాజ్యానికి ప్రత్యామ్నాయంగానో లేదా దానిపై ఒత్తిడి తెచ్చే సంస్థగానో నిర్మించాలని అతని యోచన. అతని ప్రకారం ఇది నూతన సోషలిస్టు రాజ్యం – అంటే బొలివేరియన్ రాజ్యం అవుతుంది. చావేజ్ ప్రకారం 'దాదాపు రాజ్యాలన్నీ విప్లవాన్ని అదిమి పట్టడానికే ఉనికిలోకి వచ్చాయి. కాబట్టి మన ముందున్న సవాలిదే. పాత ప్రతీఘాతుక రాజ్యాన్ని విప్లవకర రాజ్యంగా మార్చడం.'

అయితే, వాస్తవమేమిటంటే పదేళ్ళకు పైగా అతని ప్రయాసాల తర్వాత కూడా పాత అధికారులు, పాలకులకు రాజ్య యంత్రాంగంపై ఇంకా గణనీయమైన పట్టు ఉంది. అధికార యంత్రాంగంలోని కొన్ని విషయాల్లో ప్రజలకు కొంత పట్టు కలిగిన విషయం వాస్తవమే కానీ, రాజ్యపు వర్గస్వభావాన్ని మార్చే విషయం మాత్రం ఏ మాత్రం సాధ్యం కాలేదు. ప్రజా కమిటీలు, అధికార అంగాలు ఉన్నప్పటికీ వాటిలో చాలా మట్టుకు రాజ్యపు ఆదేశాలకు లోబడే ఉండాలి. ఉందులో చాలా సంస్థలకు స్థానిక అధికార యంత్రాంగంలో చోటు కల్పించడమో, అందులో కలిపేసుకోవడమో జరిగింది. చావేజ్ ఎంచుకున్న పద్ధతి చాలా నెమ్మదిగా, మందకొడిగా సాగేది. స్థానిక ప్రతీఘాతుక పాలకులు సామ్రాజ్యవాదులతో కలిసి ప్రజలు సాధించుకున్న విజయాలను తిరగదోడి పూర్వస్థితికి తీసుకుపోయేందుకు చేస్తున్న ప్రయత్నాలను ప్రభావయుక్తంగా, పోరాడే సామర్థ్యం దానికి లేదు. అయితే చావేజ్ చేసిన ప్రయత్నాల వల్ల వెనిజుయెలా సమాజంలో ఒక పదునైన ధృవీకరణ ఏర్పడింది. పాత ప్రతీఘాతుక పాలకులు అమెరికా సామ్రాజ్యవాదపు దన్నుతో పోరాడుతున్నారు. చావేజ్ ప్రజాసమీకరణకు వ్యతిరేకంగా వీళ్ళు తమ శక్తులను కూడగట్టుకుంటున్నారు. మొన్నటి ఎన్నికలలో ఈ శక్తులన్నీ 'హెన్రిక్ కాప్రైల్స్' వెనుక సమీకృతులై చావేజ్‌ను ఓడించడానికి ప్రయత్నించారు.

చావేజ్‌తో ప్రేరణ పొంది బొలీవియాలో ఇవా మొరేల్స్, ఈక్వెడార్‌లో రాఫెల్ కొరియా కూడా ఇటువంటి ప్రయత్నాలు చేస్తున్నారు. ప్రజానుకూలమైన రాజ్యాంగాలను రచించి రెఫరెండం ద్వారా ఆమోదం పొందారు. వెనిజుయెలాలోలాగా ఈ దేశాల్లో భూ సంస్కరణలు చేపట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు. అయితే ఈ రెండు దేశాల్లో వెనిజుయెలాలో చేపట్టినట్టు ప్రజా సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడానికి ఆ దేశంలో ఉన్నట్టు చమురు ద్వారా లభించే ఆదాయం లేదు. బొలీవియా, ఈక్వెడార్‌లో కూడా సమాజాన్ని మార్చడానికి ప్రజలను సమీకరించడం కోసం తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఇంతకూ చావేజ్ వర్గస్వభావం, వెనిజుయెలా రాజ్యస్వభావం ఏమిటి? ఎలా అర్థం చేసుకోవాలి?

చావేజ్ ఒక వర్గానికి రాజకీయ ప్రతినిధి. ఒక వర్గపు రాజకీయ-ప్రాతినిధ్యం గురించి మార్క్స్ 'లూయీ బోనపార్ట్ 18 బ్రూమెర్'లో ఈ విధంగా వివరించాడు. 'వాళ్ళు పెట్టీబూర్జువా వర్గపు ప్రతినిధులు ఎందుకవుతారంటే, పెట్టీబూర్జువా వర్గం తన జీవితంలో ఏ పరిమితులకు లోబడి ఉంటుందో వాళ్ళ (ఈ ప్రతినిధుల) ఆలోచనలు ఆ పరిమితులు దాటవు. తత్ఫలితంగా – పెట్టీబూర్జువా వర్గం తన భౌతిక ప్రయోజనాలు, సామాజిక స్థితి కారణంగా ఆచరణలో ఏ సమస్యలనెదుర్కొని, ఏ పరిష్కారాలను రూపొందించుకుంటుందో అవే సమస్యలు, పరిష్కారాలకు ఈ ప్రతినిధులు సైద్ధాంతికంగా చేరుకుంటారు. సాధారణంగా ఒక వర్గానికి, ఆ వర్గానికి రాజకీయంగా, సాహిత్యపరంగా ప్రాతినిధ్యం వహించే వారికీ మధ్యఉండే సంబంధం ఇది'.

80ల్లోని సంక్షోభాలు, వర్గపోరాటాలు వెనిజుయెలాలోని మధ్య తరగతి, రైతాంగం, కార్మిక వర్గాలను పాలకవర్గాల్లోని అత్యంత ప్రతీఘాతుక వర్గానికి వ్యతిరేకంగా నిలబెట్టాయి. ఈ వర్గపోరాటాలు మధ్యతరగతి (పెట్టీబూర్జువా వర్గం)లోని కొంత భాగాన్ని మౌలిక ప్రత్యామ్నాయాన్ని గురించి ఆలోచించేలా, కలలు కనేలా విప్లవీకరించాయి. ఈ వర్గం ముందు క్యూబా ఒక ప్రేరణగా నిలిచింది. ఒక చిన్న దేశమై ఉండి, తన చిన్న ఆర్థిక వ్యవస్థతో

క్యూబా అమెరికా సామ్రాజ్యవాదుల ప్రతి ఒత్తిడి, దాడిని తట్టుకోవడమే కాకుండా వెనిజుయెలాలోని ప్రజలకంటే మెరుగైన జీవన స్థితిగతులు, ఆత్మగౌరవం ఇవ్వడం - ప్రేరణదాయకంగా నిలిచింది. వెనిజుయెలాలో పెటీ బూర్జువాలోని ఈ విప్లవకర సెక్షనుకు ప్రతినిధి చావేజ్. ఈ వర్గం, తన వర్గ స్వభావం వల్ల క్యూబన్ సామ్యవాదంలో ఒక ప్రత్యామ్నాయాన్ని చూసింది. ఆ ఆకాంక్షకు చావేజ్ ప్రతినిధి. తన విప్లవకర సామాజిక, రాజకీయ అభిప్రాయాల వల్ల చావేజ్ కార్మికవర్గం, రైతాంగాల కలల ప్రతినిధిగా నిలిచాడు. ఈ వర్గాలు కూడా ఎంతగా దోపిడీ, పీడనలకు గురయ్యాయంటే పాత పద్ధతిలో ఇక ఎంతమాత్రం పాలింపబడడానికి వాళ్ళు సిద్ధంగా లేక మౌలిక మార్పును కోరుకున్నారు. విప్లవకర ప్రత్యామ్నాయాన్ని హామీనిస్తున్న చావేజ్‌కు వాళ్ళు ఉత్సాహంగా మద్దతు తెలిపారు. ఇక చావేజ్ వెనకాల పెటీ బూర్జువా వర్గపు విప్లవకర సెక్షన్ (ఈ వర్గానికే చావేజ్ ప్రతినిధి), విశాల రైతాంగ, కార్మిక వర్గాలు నిలిచాయి. అధికారంలోకి వచ్చిన తర్వాత సంక్షేమ కార్యక్రమాలు పెద్ద ఎత్తున అమలు జరిపి, భూసంస్కరణలు చేపట్టి కార్మికవర్గం, రైతాంగంలో తన మద్దతును మరింత బలపరుచుకున్నాడు. రాజకీయ అధికారంలో వాళ్ళ భాగస్వామ్యాన్ని పెంచడానికి వారిని కదిలించడం ద్వారా కూడా తన మద్దతును బలోపేతం చేసుకున్నాడు. దాంతో పెటీబూర్జువా వర్గం, కార్మికవర్గం, రైతాంగాల ఐక్యసంఘటనను ఏర్పరచడంలో చావేజ్ విజయం సాధించాడు. అమెరికా ప్రాయోజిత నయా - ఉదారవాద విధానాల వల్ల దెబ్బతిన్న నిరంకుశ బూర్జువా వర్గం, పాత పాలక వర్గంలోని ఒక సెక్షను కూడా చావేజ్‌కు మద్దతు పలికారు. తత్ఫలితంగా నేడు చావేజ్ పునాది వర్గాల (పెటీబూర్జువా, రైతాంగం, కార్మికవర్గం)తో పాటు, అమెరికా విధానాలతో బాధితులైన పాలకవర్గ సెక్షన్‌తో కూడిన విశాల ఐక్యసంఘటనలకు చావేజ్ ప్రతినిధి.

వెనిజుయెలా 'రాజ్యం' ఇప్పటికీ ప్రాథమికంగా పాత దోపిడీ పాలకవర్గాల ప్రతీఘాతుక స్వభావాన్నే కలిగి ఉంది. అయితే చావేజ్ అధికారంలో మనగలగడానికి కారణం ప్రధానంగా ప్రజల ఐక్య సంఘటన, క్రియాశీలకమైన మద్దతుతో పాటు పాలకవర్గాలలోని కొన్ని సెక్షన్లు మద్దతునివ్వడం, పాలకవర్గాలలోని అత్యంత ప్రతీఘాతుక శక్తులు తమ పోరాటంలో ఒక అడుగు వెనుకకు వేయాల్సి వస్తోంది. చావేజ్‌కు విశాల ప్రజానీకం నుంచి ఉన్న బలమైన మద్దతు వల్ల వాళ్ళు వెనుకడుగు వేయాల్సి వచ్చింది. చావేజ్‌ను కూలదోయడానికి పలుమార్లు సైనిక విద్రోహాలు జరిగాయి గానీ, ప్రతిసారి అపారమైన ప్రజల మద్దతులోనే ప్రతీఘాతుక కుట్రదారులు వెనక్కు తగ్గాల్సి వచ్చింది. చావేజ్‌కు సాయుధ బలగాలలో నుండి కూడా గణనీయమైన సమర్థన ఉంది.

ఈ సందర్భంలో మనం మరొక ముఖ్యమైన అంశాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. 21వ శతాబ్దపు ప్రారంభం నాటికి అమెరికా ఏకైక అగ్రరాజ్యంగా మిగిలినప్పటికీ, అది ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్ యుద్ధాల్లో కూరుకుపోవడం, మధ్య ఆసియా ప్రాంతంలో తన నియంత్రణ నెలకొల్పేందుకు తలమునకలై ఉండడం కూడా చావేజ్ ప్రయోగం మనగలగడానికి ఒక ముఖ్యకారణం. ఇదే సమయంలో చైనా ఒక ముఖ్యమైన సామ్రాజ్యవాద పోటీదారుగా ముందుకు రావడంతో, ఆ దేశాన్ని నిరోధించడం కోసం కూడా అమెరికా చర్యలు చేపట్టవలసి వస్తోంది. అంతే కాకుండా గత 7-8 ఏళ్ళలో సామ్రాజ్యవాద దేశాలన్నింటితో పాటు అమెరికా స్వయంగా తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో కూరుకొనిపోయి ఉంది. అమెరికా ఆర్థికంగా, రాజకీయంగా, సైనికవరంగా కూడా ఈ సమస్యలన్నింటిలో కూరుకుపోయి ఉంది. చావేజ్ ప్రయోగపు ఆవిర్భావం, కొనసాగింపును మధింపు చేసేటప్పుడు ఈ విషయాన్ని మనం గమనంలో ఉంచుకోవాలి.

అంతర్జాతీయ స్థాయిలో ఐక్య సంఘటనలు ఏర్పరచడంలో కూడా చావేజ్ చాలా చాకచక్యంగా వ్యవహరించాడు. పరిగణనీయమైన స్థాయిలో ప్రభావాన్ని నెరపగల ఒక ప్రముఖ కూటమిని ప్రాంతీయ స్థాయిలో ఏర్పరచాడు. రష్యాతో కూడా సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకున్నాడు. ఆ ప్రాంతంలో రష్యాతో కలసి ఉమ్మడి సైనిక, నావిక విన్యాసాలు నిర్వహించాడు. ఇతర లాటిన్ అమెరికన్ దేశ ప్రజలలో కూడా ప్రజల మద్దతును కూడ గట్టడానికి ప్రయత్నించి బాగానే సఫలీకృతుడైనాడు.

మరి చావేజ్ చేపట్టిన సామ్రాజ్యవాద వ్యతిరేకత, విప్లవకర మార్పులకు భవిష్యత్తు ఎలా ఉండబోతోంది? ప్రస్తుతానికి వెనిజుయెలాలో వర్గపోరాటం తీవ్రంగా సాగుతోంది. కానీ గెలుపు ఓటములు ఇంకా నిర్ణయం కాలేదు. ప్రజలు ప్రతీఘాతుక పాలకులను ఒక రక్షణ స్థితిలోకి నెట్టారు. అయితే చావేజ్‌కు మద్దతునిస్తున్న దోపిడీ వర్గంలోని ఒక సెక్షన్ చావేజ్‌ను వదిలేసి ప్రతీఘాతుక శక్తులతో చేతులు కలిపితే మాత్రం బలాబలాలలో మార్పులు రావచ్చు. చావేజ్ మరింత విప్లవాత్మక మార్పులు చేపడితే ఇలా జరగవచ్చు. ఇలా జరగడం తథ్యం. కాకపోతే ఎప్పుడు అనేదే ప్రశ్న. అలా జరిగినప్పుడు ప్రతీఘాతుక పాలకులతో పోలిస్తే ప్రజల శక్తి ఎంత బలంగా ఉంటుందన్నదే వేచి చూడాలి. (ప్రజలు తమ విజయాలను సంరక్షించుకునేందుకు వారిని సాయుధం చేయడానికి చావేజ్ ప్రయత్నించడం లేదు.) రాజ్యాంగ యంత్రాంగం, ప్రధానంగా బూర్జువా రాజ్యయంత్రాంగం కాబట్టి, అది సహజంగానే ప్రజలకు వ్యతిరేకంగానే నిలుస్తుంది. అటువంటి పరిస్థితి ఎదురయినప్పుడు చావేజ్, ప్రజలు ఆ రాజ్యయంత్రాంగాన్ని ధ్వంసం చేసి విప్లవకర పద్ధతిలో అధికారాన్ని చేజిక్కించుకొనే స్థితిలో ఉంటారా? అలా జరిగినప్పుడు మాత్రమే ఇప్పుడు చేపడుతున్న విప్లవకర సంస్కరణలు వెనిజుయెలా సమాజపు నిజమైన విప్లవకర పరిణామానికి దారి తీయగలవు. లేదా చావేజ్ రాజీలు కుదుర్చుకుని తన అధికారాన్ని నిలబెట్టుకోగలడు.

అంతర్జాతీయ స్థాయిలో వర్గశక్తుల బలాబలాలు కూడా భవిష్యత్ పరిణామాలను ఎంతో ప్రభావితం చేస్తాయి. ఒక రకంగా చెప్పాలంటే అమెరికా తన ధ్యాస అంతా ఇతర క్షేత్రాలలో కేంద్రీకరించడం వల్ల, తన వనరులన్నింటినీ వేరే చోట కేంద్రీకరించవలసి రావడంతో లాటిన్ అమెరికా ప్రాంతం నుండి దృష్టి మరల్చింది. ఇప్పుడు కూడా సామ్రాజ్యవాద దేశంగా ఉదయిస్తున్న చైనా వల్ల ఎదురవుతున్న సవాళ్ళు కూడా అమెరికా ముందున్నాయి. చైనాను ఎదుర్కొనేందుకు అమెరికా ప్రస్తుతం ఆఫ్రికా, ఆసియాలపై కేంద్రీకరిస్తున్నది. ఆఫ్ఘనిస్తాన్, మధ్య ప్రాచ్యం నుండి అమెరికా బయటపడలేకపోతోంది. ఆఫ్ఘనిస్తాన్ నుండి 2014లో అధికారికంగా బలగాలను వెనక్కు

తీసుకుంటున్నప్పటికీ, అమెరికా సైనిక జోక్యం మాత్రం సుదీర్ఘకాలం వరకు కొనసాగుతూనే ఉంటుంది. పైగా తీవ్ర ఆర్థిక సంక్షోభం నుండి బయటపడే మార్గం కూడా కనిపించడం లేదు. ఇంకా తీవ్రతరమయ్యే అవకాశాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. అమెరికా ప్రాబల్యం తగ్గిన ఈ పరిస్థితుల వల్ల ఎక్కువ కాలం పాటు చావేజ్‌కు వెసులుబాటు లభించవచ్చు.

చావేజ్ చెబుతున్న సోషలిజం మాట ఏమిటి? వెనిజుయెలాలో సోషలిజం నిర్మాణం జరుగుతోందా లేక బూర్జువా సంస్కరణాలా? ఇది రాజ్యాధికారపు సవాలును మన ముందుకు తెస్తుంది. బూర్జువా రాజ్య యంత్రాంగాన్ని సోషలిస్టు యంత్రాంగంగా మార్చడం సాధ్యమా? ఒక పెద్ద సోషలిస్టు శిబిరం అస్తిత్వంలో ఉన్ననాడే రాడికల్ మార్క్సిస్టులు 'శాంతియుత పరివర్తనా' సిద్ధాంతాన్ని తిరస్కరించారు. (కృశ్చేవ్ ప్రతిపాదించిన మూడు శాంతి ప్రతిపాదనలు) మరి సామ్రాజ్యవాద యుగంలో ఒక్క సోషలిస్టు దేశం కూడా లేనప్పుడు శాంతియుత పరివర్తన సాధ్యమా? శాంతియుత పరివర్తనా సిద్ధాంతాన్ని - అంటే పాత రాజ్యాంగ యంత్రాంగాన్ని ధ్వంసం చేయకుండా బూర్జువా రాజ్యాన్ని సోషలిస్టు రాజ్యాంగా మార్చే సిద్ధాంతాన్ని లెనిన్, ఆ తరువాత ఆయన అనుయాయులైన మార్క్సిస్టులు తిరస్కరించారు. కాబట్టి, చావేజ్ ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని పాజిటివ్‌గా పరిశీలించాలంటే, మార్క్సిస్టు వాదనలను పునఃపరిశీలించవలసి ఉంటుంది. వాటి సత్యాసత్యాలను నిర్ధారించవలసి ఉంటుంది.

మరి ఈ విషయంలో వెనిజుయెలాలో నిజంగా జరుగుతున్నదేమిటి? దానిలో లోతుపాతులను గురించి వివరమైన అధ్యయనం, రిపోర్టు లేవు. తెలిసిన మేరకు పరిశీలిస్తే అక్కడ వాస్తవంగా జరుగుతున్న సంస్కరణల స్వభావం నిజమైన సోషలిస్టు స్వభావానికంటే కూడా బూర్జువా విప్లవ సంస్కరణల స్వభావాన్ని సంతరించుకొని ఉన్నాయి. భూసంస్కరణలు చేపట్టడానికి (వర్గ సంబంధాల్లో మార్పుకు) తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. కానీ అవన్నీ బూర్జువా సంస్కరణల పరిధిలోకి వచ్చేవే. బూర్జువా సంస్కరణలను మించి ముందుకు సాగింది, ఎక్కడంటే - ప్రజలను పెద్ద ఎత్తున కదిలించి రాజ్యాధికారంపై కొంత మేరకు ప్రజల నియంత్రణను నెలకొల్పడం. అయితే రాజ్యాంగయంత్రం, ప్రధాన ఆర్థిక వ్యవస్థలు పెట్టుబడిదారుల అదుపులోనే ఉన్నంతకాలం ఈ చర్యలు కూడా అధికారం చెలాయించడంలో బూర్జువా పద్ధతులకంటే గుణాత్మకంగా భిన్నమైనవి కావు. సహకార సంఘాలు, మేనేజ్‌మెంట్‌లో కార్మికుల భాగస్వామ్యం, అదుపు వంటివి కూడా సోషల్ డెమొక్రసీ పార్టీల అధికారంలో కూడా జరిగాయి. అధికారంలో, ఆర్థికంలో ఈ రకమైన ప్రజా భాగస్వామ్యం, నియంత్రణ గుణాత్మకంగా చూస్తే స్థూలంగా సోషల్ డెమొక్రసీ రూపాలే. అయితే చావేజ్ మాత్రం వీటిని ఇతర సోషల్ డెమొక్రసీ ప్రయోగాల కంటే కూడా మరింత విస్తారంగా, క్రియాశీలంగా అమలు జరుపుతున్నాడనేది నిర్వివాదాంశం. రాజ్యయంత్రాంగంపై నిర్ణయాత్మకమైన అదుపు సాధించకుండా ప్రజలే రాజ్యయంత్రాంగ స్వభావాన్ని పునర్లిఖించకుండా ప్రతీఘాతుక పాలకుల ఆర్థిక, రాజకీయ అధికారాన్ని ధ్వంసం చేయగల నిజమైన సోషలిస్టు సంస్కరణలు, చర్యలు చేపట్టడం సాధ్యం కాదు. చావేజ్ తరహా ప్రయోగం తన అంతస్సారంలో విప్లవకరమైన బూర్జువా, ప్రజాస్వామ్యపు సంస్కరణలే. ఈ ప్రయోగం నిజమైన స్వాతంత్ర్య, సామ్రాజ్యవాదుల అదుపు నుండి స్వేచ్ఛకోసం జరిగిన / జరుగుతున్న పోరాటమే.

ఇటువంటి చావేజ్ తరహా ప్రయోగాలకు, ఇంకా లాటిన్ అమెరికా దేశాలలో జరుగుతున్న ఇటువంటి ప్రయత్నాలకు, వాటి సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావరీత్యానూ, విప్లవకర బూర్జువా సంస్కరణలు, ప్రజానుకూల సంక్షేమ పథకాల కారణంగానూ, బలమైన మద్దతు తెలపడం అవసరం. ఒక సోషలిస్టు రాజ్యం / శిబిరం అస్తిత్వంలో ఉండిఉంటే చావేజ్ తరహా ప్రయోగానికి అన్ని విధాలుగా మద్దతు నివ్వడం, సహాయం చెయ్యడం ఆ దేశ / శిబిరపు అంతర్జాతీయ కర్తవ్యమై ఉండేది. అటువంటి సోషలిస్టు దేశం అస్తిత్వంలో లేని ఈ తరుణంలో మార్క్సిస్టులు, ప్రజాస్వామికవాదులందరూ చావేజ్ సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలను, అతని దేశ అంతర్గతవిధానాలను తప్పక సమర్థించాలి.

ప్రజలను సమీకరించడానికి చావేజ్ అభివృద్ధి పరుస్తున్న రూపాలను కూడా అధ్యయనం చేయవలసి ఉంది. రాబోయే కాలంలో సోషలిస్టు దేశాలు ఇంకా మెరుగ్గా పనిచేయడానికి ఈ అధ్యయనం మార్క్సిస్టులకు ఉపయోగపడుతుంది. చావేజ్ తన ప్రయోగాన్ని/ ప్రయత్నాలను విజయవంతం చేయడానికి కార్మికవర్గ అగ్రగామి పార్టీ, రాజ్యపు అంగాలు/నిర్మాణాల ద్వారా కాకుండా ప్రజలను సమీకరించిన పద్ధతుల నుండి నేర్చుకోవలసి ఉంది. గత సోషలిస్టు అనుభవాలలో అగ్రగామి పార్టీ ద్వారానో లేదా రాజ్య యంత్రాంగాన్ని కదిలించో ప్రధానంగా ప్రజాసమీకరణ జరిగింది. కాబట్టి ఈ నూతన పద్ధతులు భవిష్యత్తులో సోషలిస్టు రాజ్యానికి ఉపయోగపడతాయి. సోషలిస్టు సమాజాల్లో వర్గపోరాటాలు కొనసాగించడానికి, రాజ్యాధికారంలో విశాల ప్రజారాశులు తప్పక పాల్గొనేలా చేయడానికి, సోషలిజపు నిర్మాణంలో ప్రజలు పాల్గొనేలా చేసి రాజకీయంగా భాగస్వాములను చేయడానికి కూడా వెనిజుయెలా తరహా ప్రజా సమీకరణ అవసరం.

చావేజ్ తరహా ప్రయోగపు అధ్యయనం అంటే '21వ శతాబ్దంలో సోషలిజపు నిర్మాణాన్ని' అధ్యయనం చేయడం కాదు, వెనిజుయెలాలో అభివృద్ధి అయిన ప్రజాసమీకరణ రూపాలు, ప్రజల భాగస్వామ్యాన్ని అధ్యయనం చేయడం.

ఇక ఈ వ్యాసపు ఆరంభంలో ఉపయోగించిన మావో సూక్తిని మరోసారి చూస్తే-ప్రజలు వస్తుగతంగా విప్లవాన్ని కోరుకుంటున్నారు, కాబట్టే చావేజ్ ప్రయోగం సాధ్యమైంది. (ఇక్కడ విప్లవమంటే ప్రజలు పాత పద్ధతిలో పాలించబడడానికి సిద్ధంగా ఉండకపోవడం, పాలకులకు పాత పద్ధతిలో పాలించడం, సాధ్యం కాకపోవడం) 'జాతులు స్వేచ్ఛను కోరుకుంటున్నాయనే'ది సుస్పష్టంగా కనిపిస్తోంది. కాబట్టి వివరణ అనవసరం. ఇక దేశాలు స్వతంత్రాన్ని కోరుకోవడమంటే ఆ దేశాల పాలక వర్గాలకు సంబంధించినదే. పాలకవర్గాలకు (దళారీలకు కూడా) సామ్రాజ్యవాదంతో వైరుధ్యాలున్నాయి/ఉంటాయి. వాళ్ళకు కూడా సామ్రాజ్యవాదుల పోటీకి వచ్చే కొన్ని ప్రయోజనాలు ఉంటాయి. ఈ ప్రయోజనాలను నెరవేర్చుకోవాలనే కోరికనే స్వతంత్ర్యాన్ని కోరుకొనేందుకు దారి

పుస్తక పరిచయం

# 'గుమ్మెటమోత' నవలా సమీక్ష / విమర్శ

- వీరబ్రహ్మాచారి

పారిశ్రామిక విప్లవానంతరం వికృత పెట్టుబడిదారీ అభివృద్ధి నమూనాలో కళాకారులు విశ్రాంతి పెట్టుబడిదారీ వర్గాల ప్రోత్సాహంతో, పనిచేసి ఉత్పత్తినందించే మనుషులకంటే ఉన్నతులైనారు. ఆరాధ్యులైనారనేది వేరే వికృత పరిణామం. ఆధిపత్య వర్గాల శిష్ట (Classic) కళల్లో నిష్ణాతులైన కళాకారులు, శ్రామిక వర్గాల జానపద (Folk/mass) కళలను ప్రదర్శించే కళాకారులూ వేరయిన క్రమం ముఖ్యంగా గాత్రం నాట్యకళల్లో జరిగింది. అటువంటి ఒకానొక జానపద కళకు సంబంధించిన సంచారకులమే బుడగ జంగాలు. ఈ బుడగ జంగాల బతుకుల చిత్రణే ఇతివృత్తంగా రూపొందిన పాణి నవల 'గుమ్మెట మోత'. గుమ్మెట బుడగజంగాల వాయిద్య పరికరం. ఎటువంటి ముందుమాటా వెనుక మాట కూడా లేకుండా విరసం ప్రచురణగా వచ్చింది నవల.

గుమ్మెటమోత (నవల)
రచయిత : పాణి
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : 100/-

కథ స్థలకాల పాత్రలు రాయలసీమ నేపథ్యంలో, అందునా తెలంగాణ నుంచి రాయలసీమకు వలసవెళ్ళిన, విస్తరించిన బుడగజంగాల కుటుంబ నేపథ్యంలో తీసుకోవడం; ఈ కులం తెలంగాణలోని జిల్లాల్లో ఎస్.సి. కులంగా గుర్తించబడి, రాయలసీమలో అసలు కులాల జాబితాలోనే లేకపోవడంలో కథాంశానికి సమకాలీన అస్తిత్వ పోరాటానికి చోటు లభించి నవలకు విస్తృతి ఏర్పడింది. అట్లా ప్రత్యామ్నాయ జీవిక కోసం, రాజ్యాంగ హక్కుల కోసం జరిగే ఘర్షణను, ఆ ఘర్షణలో హక్కుల సాధనలో గల సంక్లిష్టతను సవివరంగా ముందుంచాడు రచయిత.

పీడిత కులాలలో అక్కడక్కడ యాదృచ్ఛికంగా ఉన్నత విద్యకు నోచుకున్న యువకులలాగా బుడగ జంగాల కులానికి చెందిన యూనివర్సిటీ విద్యార్థులు ఉలిగప్ప, గిరిలు.

ఉలిగప్ప తన జేజి నాయన జంబులు, జేజెమ్మ మశవ్వల (తాత నాయినమ్మలు) అన్వేషణ కోసం బయల్దేరడంతో కథ మొదలవుతుంది. ఉలిగప్ప తల్లిదండ్రులు ప్రత్యామ్నాయ జీవికనెంచుకుంటారు. ఆ వృత్తిలో వాళ్ళు మొదటి తరానికి చెందినవాళ్ళు గనుక అందులో నిలదొక్కుకోవడానికి సహజంగానే తీరిక లేని పెనుగులాటలో ఉంటారు. అందువల్ల ఉలిగప్ప పూర్తిగా జేజినాయిన, జేజెమ్మల ఆలనా పాలనలలో పెరుగుతాడు. తర్వాత ఉన్నత విద్యకు నోచుకోవడంతో జేజినాయన కుల వృత్తి కళ ఉలిగప్పకు ఉద్వేగపరంగా దగ్గరే అయినా ఆ కళలో బిచ్చమెత్తుకుని జీవించడం అవమానకరం. కనుకనే జేజి నాయనను ఆ సంచార యాచక వృత్తి నుండి మరల్చాలన్న, మాన్పించాలన్న తాపత్రయం అతనిది. ఇదొక ప్రాథమిక ఘర్షణ అతనికి.

ఇక రాయలసీమలో అసలు గుర్తింపే లేని తన కులానికి గుర్తింపును సాధించుకునే ఉద్యమం సంఘర్షణ. ఈ రెండు ఘర్షణల నడుమ ఉలిగప్ప ప్రయాణమే నవలాంశం. ఈ చట్రంలో బుడగ జంగాల జీవితాన్ని స్వంత అనుభవమంత హృద్యంగా మలిచాడు రచయిత.

ప్రారంభించిన విధానమే ఇప్పటి చరిత్రను విస్మరిస్తున్న తరానికి అవసరమైనది, తాకలవసినదీ. 'సర్కారు తుమ్మలు' చెరువు కట్టమీది దారిని కమ్మి వేశాయి. అపుడు ఉలిగప్పకు 'ముందుదారి' ముళ్ళపొదలలో చిక్కుకపోయినట్లనిపించింది' అనే ప్రారంభం ఉలిగప్ప

---

తీస్తుంది. కొన్ని సమయాల్లో దళారీలు కూడా సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా తమ ప్రయోజనాల కోసం గట్టిగా నిలబడడం అసంభవమేమీ కాదు. చావేజ్‌కు పాలకవర్గంలోని ఒక ముఠా, నిరంకుశ బూర్జువా వర్గంలోని కొన్ని శక్తులు మద్దతునివ్వడానికి ఇదే కారణం. ప్రపంచంలో ఇటువంటి ఎన్నో ఉదాహరణలు చూడవచ్చు. ఇరాన్, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్, సిరియాలే కాక పూర్తిగా అణిగిమణిగి ఉండే పాకిస్తానీ పాలకులు కూడా ప్రాంతీయ స్థాయిలో తమ ప్రయోజనాలను కాపాడుకొనే మేరకు అమెరికాకు వ్యతిరేకంగా కూడా గట్టిగా నిలబడడాన్ని మరి ఎట్లా అర్థం చేసుకుంటాం? భారత దళారీ పెట్టుబడిదారులను కూడా ఈ కోణం నుండి చూడాలి. సామ్రాజ్యవాదులకు ఊడిగం చేయడం తప్ప వాళ్ళకు స్వప్రయోజనాలేవీ ఉండవని విశ్లేషించడం (నిజమైన) మార్క్సిస్టులు భారత దళారీ పెట్టుబడిదారీ వర్గాన్నీ, దానికి ఇతర వర్గాలతో ఉండే సంబంధాన్నీ విశ్లేషించడంలో ఎదుర్కొంటున్న వైఫల్యపు మూలంలో ఉంది. ఇదంతా మరో చర్చ. కానీ, ప్రస్తుతం ప్రాసంగికమైన విషయమేమిటంటే-వెనిజుయెలాలోనూ ఇతర లాటిన్ అమెరికన్ దేశాలలోనూ, ప్రస్తుత పరిస్థితిలో పాలకవర్గాలలోని ఒక సెక్షన్ స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షిస్తోంది.

*(ఈ వ్యాసం అరుణతారకు జనవరి నెలలో చావెజ్ మరణానికి ముందు అందింది.)*



పాత్ర రెండు ఘర్షణలకూ సంబంధించి ఎంత గొప్ప నైపుణ్యంగల మాటల ఉటంకింపు!

ఇవి కులం గుర్తింపునకు జరిగే ఉద్యమ ప్రయత్నానికి ఎదురయ్యే అడ్డంకులను, సవాళ్ళ చిక్కుముళ్ళను సూచిస్తుంది. ఆ చిక్కుముళ్ళకు ప్రధాన ప్రత్యర్థి పాత్రధారి సర్కారే అని చెప్పకనే చెప్పింది. నవలా రచనలో ఇదొక విశిష్ట ప్రక్రియ. కథా నాయకుడు నిర్దిష్టంగా మూర్తంగానూ కన్పడుతూ, ప్రతి నాయకుడు అమూర్తంగా (అబ్‌స్ట్రాక్ట్) పాలన పాలకుల సామాజిక వ్యవస్థల, ఆ వ్యవస్థలు ఏర్పరిచిన విలువలు నియమాల రూపంలో ఉంటాయి. అట్లా ఇందులో ఉలిగప్ప, జంబులు, వాళ్ళ కులంతో సహా నాయకులు కాగా, ప్రభుత్వం, వ్యవస్థీకృత సాంఘిక అసమాన వివక్షా పూరిత విలువలు ప్రతినాయకులు.

ఇక కథానాయకుడు జంబులు కళానైపుణ్యం, అతనికి లభించే ఆదరణ, ఆరాధనలు సరేసరి. ఆ నైపుణ్యానికి పదును పెడుతూ ఉరకలెత్తించే సగభాగపు సహచరిగా మశమ్మ పాత్రను అంతే ప్రాధాన్యీకరించాడు రచయిత. స్త్రీ పునఃసృష్టికి పడే యాతనను, ఆ యాతన సందర్భంలో స్థాయీ భేదాలు పక్కనబెట్టి సాటి స్త్రీలు అందించే, పాలు పంచుకునే, సహకారాలను కళ్ళకు కట్టినట్లుగా మశమ్మ పాత్ర ద్వారా చిత్రించారు. తను రక్తమాంసాలు పంచి, ప్రాణాన్ని పణంగా పెట్టి పది నెలలుగా పడిన శ్రమఫలితం చేతికి రాకుండా పోయినపుడు మశమ్మేగాక సాటి స్త్రీలు సైతం పడే స్వానుభవ వేదననూ దృశ్యమానం చేశాడు రచయిత.

ఉలిగప్ప తన కులం ఉనికిని, గుర్తింపును పాలక అధికార గణానికి తెలియజేసే ఉద్యమక్రమంలో నేడు కొన్ని అస్తిత్వ ఉద్యమాల నడుమ తలెత్తే వైషమ్యాల గురించి తడుముతూ, 'అందరినీ కలిపి ఉంచడానికి ఇంతకన్నా గట్టి ఆధారం ఉంటే బాగుండేది అదే లేదు..', 'ఉద్యమాల ఇమ్మీడియట్ ప్రయోజనాల గొడవలు ఎప్పుడూ ఉండేవే వాటినట్లా ఉంచి 'ఈ' ఆలోచనలు 'కొన్ని' ముందుకు తేవాలి' మాటల ద్వారా ఉద్యమాలకు, ముఖ్యంగా అణగారిన వర్గాల ఆత్మగౌరవ, హక్కుల ఉద్యమాలకు, అవి నడుస్తూనే కొనసాగిస్తూనే అందరికీ ఉమ్మడి సమస్యగానున్న (ఉత్పత్తి సాధనాల యాజమాన్యాంలో వాట) పునాది అంశం దండలో దారంలాగ, ఒక అంతఃసూత్రంగా ఉండవలసిన అంశాన్ని గుర్తు చేశారు. ఆధారాన్ని (బ్రాకెట్‌లో పైన ఉటంకించింది, అది రచయితది కాదు) సూటిగా చెప్పకుండా ఉద్యమ సంఘాల చోదక శక్తుల విజ్ఞతకే వదిలివేయడం బాగుంది.

ఐతే నేటి అస్తిత్వ ఉద్యమాల నాయకులకు అది తెలియదని అనుకోలేం. ఈ ఉద్యమాల నాయక శ్రేణుల్లో కొందరైనా మొదట్లో ఆ పునాది అంతఃసూత్ర తాత్విక శిబిరంతో ప్రభావితమైన స్ఫూర్తి పొందినవారే. 'ఆ' ఉద్యమంలో కొందరు క్రియాశీలక భాగస్వాములు కూడా ఒకనాడు.

ఈ రోజు సమాజపు, విజ్ఞానమే తప్ప వివేకం లేని యువతరం తాము చేస్తున్నందంతా చేస్తూ, 'ఈ ముసలోళ్ళు ఒక కాడ నిలవరు, నెగలరు. స్వతంత్రంగా ఉండాలని హెచ్చులు బోతారు.' అన్న విమర్శలకు జవాబుగా, 'అయినోల్ల ఛీత్కారానికన్నా కానోల్ల కాడికి బోయి జోలె పట్టడమే నయం', 'ఎట్టికి తిన్నామని మాట పడేదానికన్నా ఇద్దెనునమ్ముకొని ఊల్లమీద పడితే పోలా' అని జంబులు పాత్ర మానసిక స్థితి ద్వారా మొత్తం వృద్ధుల మానసిక స్థితిని తెలిపి తట్టి లేపుతుంది. 'బరువైనవి తలుచుకున్నపుడు... దుర్బలుని చేస్తాయి,' శ్రీశైలం డ్యాం నిర్మించడం ద్వారా ఊర్లు ముంపుకు గురి కావడం వల్ల కలిగే ఆవేదనల సందర్భంలో, 'ఊళ్ళంటే బలమైన పునాదులు ఇళ్ళూ, ఏడాదికి ఒకటో రెండో పంటలు ఇచ్చే చేలు మాత్రమే కాదుగదా' అనే జంబులు మనాది సాలోచనలు, 'తావును బట్టేకదే తెలివిడి కలిగేది' అనే రచయిత మాటల్లో వ్యక్తీకరించిన భావోద్వేగ బంధనాల, భౌతిక వాస్తవాల ఉటంకింపులు నవలనిండా సందర్భోచితంగానే కోకొల్లలు.

నవలలోని ప్రతిపాత్రా భిన్న మనస్తత్వాలకు ప్రతీకలే. అన్ని పాత్రల గురించి సమీక్షించడం సాధ్యం కాదు గాని బిచ్చావతి, తుపాకీ రాముళ్ళ గురించి రెండు మాటలు చెప్పుకోకుండా ముగించలేము. బిచ్చావతి జంబులు రెండో కొడుకు. ఉలిగప్ప చిన్నాయన. స్వేచ్ఛా ప్రియత్వం, తెగింపూ గల మనిషి. చదువుండీ చట్టాలు తెలిసీ జానయ్య కులం నుండి వెలివేయబడ్డందుకు బాధ పడితే, బిచ్చావతికి చదువు సంజెలు లేకున్నా అహేతుక కులాచారాలు పెద్దరికాలంటే పడదు. కులం కట్టుబాట్ల పట్ల తండ్రికి గల సాంప్రదాయిక విధేయత నచ్చక ఎప్పుడూ గొడవే. ఊరి 'చిల్లర దేవుళ్ళు' తనను వెలివేస్తే నీ కులానికి నా చెప్పు దెబ్బ' అంటూ కొట్టిపారేసే ఆవారా తెంపరి. 'ఈ తూరి ఇంటికి తోలుక పోనికె వచ్చినా. ఇయ్యాల నుంచి అడుక్కున్నీకె లేదు..' అని ఉలిగప్ప జేజినాయన కోసం వచ్చిన సంగతి చెబితే, 'నువుగాదు నిన్ను పుట్టించిన బెమ్మ దేవుడివల్ల గూడా గాదురా సిన్నోడా. ముసలోడు ఊపిరి పోయేటపుడు కూడా ఆడకొచ్చిన ముద్దే పెట్టమంటడు.. నా మాట నమ్మకపోతే వాన్నే అడుగు' అని ఎగసెక్కెం చేయడంలో తండ్రిని రెచ్చగొట్టయినా మాన్పిద్దామనే ఎత్తుగడలోని పరోక్ష ప్రేమ ఆర్ద్రతలు నవ్వూ తెప్పిస్తాయి...

ప్రతి మనిషినీ పలకరించి పరాచికాలాడి కవ్వించి నవ్వించే తుపాకీ రాముడు అదివరకే ఇద్దర్ని వదిలేసిన రత్నమ్మతో జతకట్టి ఆమె కొడుకును తన కొడుకుగా పూచీ తీసుకుంటాడు. అంతటి అల్లరి చిల్లర ఆవారా మనిషి రత్నమ్మ పోయినాక విరాగిలామారి కొడుకును కంటికి రెప్పలా చూసుకోవడం చదువరుల మనసును తడి చేస్తుంది.

తనదికాని బడుగు జీవితాన్ని ఇంత ప్రత్యక్ష వాస్తవంగా దృశ్యమానం చేయాలంటే రచయిత కొంత కాలమైనా ఆ జీవితాల్తో సహజీవనం చేస్తే తప్ప సాధ్యం కానిది. అదే నిజమైతే ఒట్టి అభినందనలు అనే మాట సరిపోదు.

**లోపాలు - ఇబ్బందులు :**

పాత్రల మానసిక సంచలనాలు ముఖ్యంగా గిరి, ఉలిగప్ప, విశాలల నడుమ ఎక్కువగా వివరించడం ఇబ్బంది పెడుతుంది. అన్ని పాత్రలు కథకు జీవిత విధానాలకు, ఆలోచనలకు బలం చేకూర్చగా 'ఇస్తారిగాడి' కొంచెం ప్రస్తావనయినా అవసరం లేనిదే. నాల్గో, మూడో అచ్చు తప్పులు, ఒకటో, రెండో ఆంగ్ల పదాలు సమానార్థక తెలుగు పదాలుండి కూడా వాడడం.



వ్యాసం

# 'సుధ'లొలికించిన కవి

- ఇన్నా

అరుణతార జూలై-ఆగస్ట్ సంచికలో ప్రచురితం అయిన నల్లూరి రుక్మిణి 'ముంజేతిని ఖండించిన' కథలో మధ్య మధ్యలో కొన్ని పాటల పంక్తులు వాడారు. ఆ పంక్తులు శివసాగర్, సుబ్బారావు పాణిగ్రహి, శ్రీ.శ్రీ., సుధలకు సంబంధించినవి. పై ముగ్గురి రచయితల చరిత్ర, వారి రచనలు, సాహిత్యం ప్రజలకు అందుబాటులో ఉన్నాయి. కాని రుక్మిణిగారు కథను ముగిస్తూ రాసిన 'సుధ'కు చెందిన పంక్తులు 'చివరి వీడ్కోలు మీకు – నా చిన్ని తమ్ముల్లారా ఎర్రపూల వనంకాడ ఎదురు చూస్తుంటానయ్యా' ఈ రచయిత రచనలు, రచయిత చరిత్ర ప్రజలకు అందుబాటులో లేవు. చరిత్ర మూలాల్లో ఎక్కడో దాగున్న పాట పంక్తులు రాసి దాదాపు పదిహేను సంవత్సరాల తరువాత ఆ పాట రాసిన కవిని జ్ఞప్తికి తెచ్చినందుకు నల్లూరి రుక్మిణి గారికి కృతజ్ఞతలు. రుక్మిణిగారు రాసిన పంక్తులు

'నా చిన్ని తమ్ముల్లారా–శంకరన్న వారసులారా

శంకరన్న బాటలోన–షరికై పొండయ్యా' అనే పాటలోనివి. ఇక రచయిత గురించిన విషయానికి వస్తే 'సుధ'గా పిలువబడే 'సుందిళ్ళ ధర్మయ్య' ఆదిలాబాద్ జె.ఎన్.ఎం కళాకారుడు. ఎక్కడో ఆదిలాబాద్ జిల్లా జైపూర్ మండలంలోని మారుమూల గ్రామంలోని ఎల్లయ్య-రాజక్క దంపతుల సంతానం. సుధ తల్లిదండ్రులు కాగజ్ నగర్‌లో 'సర్ సిల్క్' బట్టల మిల్లు ప్రారంభం అవుతుందని, అందులో పనికోసం గంగిపెల్లి నుండి వలస వెళ్ళారు. కాగజ్‌నగర్‌లోనే 9వ తరగతి వరకు చదివి మధ్యలోనే ఆపేసాడు. కాగజ్ నగర్‌లోని లంపెన్ గ్యాంగ్‌లో ఒకడిగా ఉన్న 'సుందిళ్ళ ధర్మయ్య' విప్లవోద్యమం బలపడుతున్న క్రమంలో 1970 దశకం చివర్లో జగిత్యాల జైత్రయాత్ర తరువాత ప్రజలంతా పార్టీ వైపు మళ్ళుతున్న క్రమంలో రఘు (నల్లా ఆదిరెడ్డి) ప్రభావంతో విప్లవోద్యమంలోకి వచ్చాడు. రఘు ఇచ్చిన చైతన్యం, గజ్జెల గంగారం, పెద్ది శంకర్ తదితరుల సాన్నిహిత్యం, పార్టీ ఇచ్చిన సాహిత్యం చదివి కవిగా మారాడు. సుందిళ్ళ ధర్మయ్య తన ఇంటి పేరులేని మొదటి అక్షరం 'సు' తన పేరులోని మొదటి అక్షరం 'ధ'ని కలిపి 'సుధ'ని తన కలం పేరుగా చేసుకున్నాడు. నిజంగానే అతని రచనలు 'సుధ'లొలికించేవి. హైదరాబాద్ జె.ఎన్.ఎం.కు ధీటుగా బెల్లంపల్లి పట్టణ కేంద్రంగా ఏర్పడ్డ 'జన నాట్య మండలి'లో సుధ వ్యవస్థాపక సభ్యుడు. 1978 నుండి జె.ఎన్.ఎం.లో పని చేస్తున్న సుధ 1979 ఫిబ్రరి 19న ఆదిలాబాద్ జిల్లా మంచిర్యాలలో ఆర్.ఎస్.యు. ప్రథమ మహాసభ సందర్భంగా గజ్జెల గంగారంతో పాటు తన సోదరుడు రాజయ్య అరెస్టు అయితే, అతనికి 'చికాగో అమరవీరుల నెత్తురుతో తడిసెనంటా/ఓ రాజన్న గా జెండా నువ్ పట్టు/ఓ రాజన్న జెండపట్టి ముందు నడువు.

శ్రీకాకుళం కొండల్లో లీడరు సత్యం సారాట
గిరిజనులను ఒకటి చేసి పోరాటం నడిపెనంటా
ఓ రాజన్న గా పోరులోన మనమెల్లాం అంటూ
విప్లవ సందేశాన్ని ఇచ్చాడు.

సుధ పెట్టుబడిదారులైన టాటా, బిర్లాల దోపిడి మీద రాసిన 'నీ రెక్కల కష్టంతో బిర్లాలు బిల్డింగులు గట్టిరి/
నీ నెత్తుటి సుక్కలతో టాటలు కోట్లకు పెరిగిరి
పెట్టుబడులు వాళ్లైతేరా సోదరా–పేదరికం నీకు మిగిలెరా

ఇంపాల కారులల్ల, గాలి మోటరులల్లా
దొరల్లాగా తిరుగుతారు – దోపిడేమో చేస్తారు
ఎ.సి. కారుల్ల వాళ్ళు పోతేరా సోదరా

కాలి నడకన నువ్ నడిస్తివా అంటూ 'నీ రెక్కల కష్టం' పాటలో ఈ బూటకపు స్వాతంత్ర్యంలో ఉన్నవాడు బలుస్తుంటే, లేనివాడి డొక్కలెండే విధానాన్ని రచించాడు. 1979 మేలో జరిగిన 'రాడికల్ యూత్‌లీగ్' మందమర్రి సభలో సుధ, తన జె.ఎన్.ఎం ట్రూప్ సాంస్కృతిక ప్రదర్శన ఇవ్వగా వక్తలుగా వచ్చిన వరవరరావు, ఢిల్లీ యూనివర్సిటీకి చెందిన సుబ్బారావు తదితరులు వచ్చారు. ఆ సభను గంగారం, హుస్సేన్, సమ్మిరెడ్డి వంటి స్థానిక నాయకులు ముందుండి నడిపించారు. ఆ సభను పోలీసులు భగ్నం చేసే ప్రయత్నంలో కరెంటు ఆఫ్ చేస్తే ప్రజలు సభ నుండి వెళ్తుంటే వారిని తిరిగి రప్పించేందుకు పాట పాడుతున్న వారికి మద్దతుగా సుధనే స్వయంగా డప్పు కొట్టుకుంటూ వచ్చి వెళ్తున్న ప్రజల్ని తిరిగి సభవైపు రప్పించారు. ఆ తరువాత సమ్మిరెడ్డి సభనుద్దేశించి ఉద్విగ్నభరిత ప్రసంగం చేశాడు. 1980 సెప్టెంబర్ 8న సాయుధ ట్రైనింగ్ క్యాంపులో గ్రెనెడ్ విసిరే క్రమంలో చేతిలో గ్రెనెడ్ పేలి మరణించిన గోపాల్ (గజ్జెల గంగారం) స్మృతిలో

'నా చిన్ని తమ్ముల్లారా – శంకరన్న వారసులారా
శంకరన్న బాటలో – షరికై పోరండయ్యో ॥నా చిన్ని॥

అన్నలుంటారు మీకు – ఆజ్ఞ పాటించడయ్యో
తల్లిలాంటి పార్టీకి – తనయులు కావాలయ్యో
తరచుగా బాధలు చూసి – తల్లడిల్లి పోకండయ్యో ॥నా చిన్ని॥

అమెరికోన్ని దొంగని చెప్పి - ఆయుధాలు ఎత్తండయ్యో
రష్యవోని రాజకీయాల - రంగు బయటపెట్టండయ్యో
మావో ఆలోచన విధానాన్ని మరవబోకండయ్యా ॥నా చిన్ని॥

చివరి వీడుకోలు మీకు - నా చిన్ని తమ్ముల్లారా
ఎర్రపూల వనంకాడ - ఎదురు చూస్తుంటానయ్యా అంటూ

గంగారం సందేశాన్ని ప్రజలకు వినిపించాడు.

గజ్జెల గంగారంపై రాసిన మరో పాటలో

'ఎర్రమందారాల గంగన్న నువ్
ఎడికెళ్లినవ్ గంగన్న
ఎర్రమందారాల తోటలో నువ్
ఎక్కడుంటవే గంగన్న ॥ఎర్ర॥
ఎర్రజెండాల మాకు అగుపిస్తున్నవ్ - ఎత్తి ఉంచుతమే గంగన్న
తుపాకులల్ల మాకు అగుపిస్తున్నవ్ - దగ్గరుంచుతమే గంగన్న
సాయుధ పోరెకైక మార్గమని - చాటి చెప్పినవ్ గంగన్న

అంటూ గంగారంని తల్చుకుంటాడు. సుధ ఏ పాట రాసినా సాయుధ పోరాటం ద్వారానే సమస్యలు పరిష్కారం అవుతాయని ముగిస్తాడు.

కామ్రేడ్ పెద్ది శంకర్ అమరత్వం తరువాత

'రామసక్కని వాడే ఎన్నెలా రాడికల్ల నాయకుడే ఎన్నెల
1. పార్టీ ఇచ్చిన పిలుపుతోని ఎన్నెలో ఎన్నెల
ఎనకముందు జూడకుండా ఎన్నెలో ఎన్నెల
భుజాన తుపాకి తోటి ఎన్నెలో ఎన్నెల
భూస్వాముల మట్టుబెట్టి ఎన్నెలో ఎన్నెల
అనాథలను ఆదుకొన ఎన్నెలా
ఆయన అజ్ఞాత వాసమెల్లె ఎన్నెలా ॥రామ సక్కని'

2. ప్రజలను నమ్మిండు ఎన్నెలో ఎన్నెల
పార్టీని నమ్మిండు ఎన్నెలో ఎన్నెల
పార్టీ సిద్ధాంతాలను ఎన్నెలో ఎన్నెల
ప్రచారం చేసిండు ఎన్నెలో ఎన్నెల
నమ్మిన సిద్ధాంతాలకై ఎన్నెలా

ఆయన నిజమైన నక్సలైటు ఎన్నెల అంటూ రామసక్కని వాడే పాటలో పెద్ది శంకర్ పోరాటాలను రాసాడు.

1981లో ఇంద్రవెల్లిలో తలపెట్టిన రైతుకూలీ సంఘం మహాసభకు ప్రజలను కదిలించడం కోసం సుధ రాసిన

'రండొరన్న దండుగా పోదాం ఇందర్‌వెల్లి జాతర
ఇందిరమ్మ, గవిరిమెంటును పాతరబెట్టె జాతర కొయ్యూర్
కోలామ్, దాదల్-బాయిల్-కొల్లుట మంటల యాతరి
భూమి మావై జంగల్ మావై
జంగు దాదాల జాతర
పిచ్చితుమ్మల నరికినట్టి
పచ్చని పంటల జాతర
జంగ్లాతోళ్ళని వంగదిసి-ఆ దొంగల తరిమెన యాతర

రండొరన్న గీతం ప్రజలను సభవైపు నడిపించింది.

చదువు వచ్చిన వాళ్ళంత పల్లెలకెల్లి చదువురానివారికి చదువు చెప్పాలని పార్టీ పిలుపు ఇస్తే కాగజ్‌నగర్ నుండి వరంగల్ జిల్లాకు వెళ్తూ

'ప్రియతమ వీడ్కోలు అందుకో-
ప్రియతమ లాల్‌సలాం అందుకో
పోరుబుద్ధి ఉంచుకో-కష్టాలను పంచుకో
పెరిగె మన పిల్లలకు గురువునువ్వని తెలుసుకో' అంటూ తన

జీవిత సహచరికి కవిత రాసి వరంగల్‌కి వెళ్ళాడు.

ఖిలా వనపర్తి ఎన్‌కౌంటర్‌లో అమరత్వం పొందిన బయ్యపు దేవేందర్ రెడ్డి స్మారక సభకు ముందు ఊరేగింపు వెళ్ళి తిరిగి సభకు వచ్చే వరకు

'ఉంటమే దేవన్న అమరునివంటూ
నువ్ ఉంటవే మా వెంట ఎర్రమంటవుతూ
నీ పాటే మా పాట
నీ మాటే మా మాట
నీ బాటే మా బాట
నీ బాట బందూకుల బాట దేవన్న
నా బాటలో మేమంత కలిసస్తమన్న' రాసి సభ ప్రారంభం

కాగానే పాడి వినిపించాడు. సుధ తను ఏ పాట రాసినా పదిహేను నిమిషాలలోపు పూర్తి చేసేవాడు. ఎవరైనా తన దగ్గరికి వచ్చి పాట రాసివ్వమంటే అప్పటికప్పుడు అశువుగా రాసి ఇచ్చేవాడు.

సుధ రచనలు ఎక్కువగా అముద్రితాలే. నాకు తెలిసి 'జన నాట్యమండలి' పాటల పుస్తకాలలో మూడు/నాలుగు పాటలు. సుధ రచన 'కొమురం భీం ఒగ్గు కథ' ముద్రించినట్లుంది. తను రాసి ఆడి పాడిన కొమురం భీం ఒగ్గు కథ' తెలంగాణ గోండుల గుండెల్లో భద్రపరుస్తున్నాం అని జె.ఎన్.ఎం ప్రచురించింది. కొమురం భీం ఒగ్గు కథలో కేవలం కొమురం భీం చరిత్రనే గాక రాంజీగొండు నుండి ఇంద్రవెల్లి ఘటన వరకు రచించాడు. దాన్ని కొమురం భీం ఒగ్గు కథ అనే దానికి బదులు ఆదిలాబాద్ గోండుల పోరాటగాథ అని అనుకోవచ్చు. ఒగ్గుకథ రాయడానికి అల్లం రాజయ్య, శనిగరం వెంకటేశ్వర్లు (సాహు) సహాయం తీసుకున్నాడు. ఇందులో కొమురం భీం సందేశాన్ని గోండిలో రచించాడు. (సాహు సహకారంతో సుధ గోండు భాషను నేర్చుకున్నాడు) ఈ రచన అతని అమరత్వం తరవాత ప్రచురించబడింది. స్థల భావం వల్ల ఒగ్గు కథలోని భాగాలను సృష్టించలేకపోతున్నాను. సుధ అమరత్వం పొంది సెప్టెంబర్ 9కి ఇరవై వసంతాలు. ఇక వ్యాసాన్ని సుధ రచన ఒగ్గు కథకు గద్దర్ రాసినట్లు 'ఓ కవి, ప్రజాకవి, సహచరుడా!

జనం పాటను
రాసి, ఆడి, పాడి
జనంలోకి తీసుకవెల్లిన
జనం కవి 'సుధ'
లాల్ సలామ్ 'అంటూ ముగిస్తున్నాను.'



వ్యాసం

# జాతీయ స్ట్రీట్ ప్లే దినం - ఏప్రిల్ 21

- గోమాంగో

(ఈ సందర్భంగా స్ట్రీట్ ప్లే (వీధి నాటిక)కు సంబంధించిన కొంత చరిత్ర...)

రంగ స్థలంలో నాటకాల ప్రదర్శనకు ముందు నుండే ఈ నాటిక ప్రక్రియ ఉంది. వస్తువు భిన్నంగా ఉంటుంది. ఆదిమ యుగంలో రోజంతా శ్రమించిన ప్రజలు అలసిపోయి అలసటను మరిచిపోవడం కోసం, మానసిక ఉల్లాసం కోసం (మనోరంజన్) కోసం ఆట స్థలంలో కూర్చునేవారు. అక్కడే వారికి వంట, వార్పు, తినడం, తాగడం, నృత్యం, పాటలు ఉండేవి. మూడు విషయాల ఆధారంగా దర్శకులు కళాకారులతో సంప్రదించేవారు. దైనందిన జీవితంలో జరిగే ఘటనలను వస్తువులుగా స్వీకరించేవారు. దర్శకులు ప్రదర్శనా స్థలంలో ఉంటూ దర్శకత్వం వహించేవారు.

మధ్యయుగంలో ఈ నాటక రంగం మార్పులకు గురైంది. ప్రజల భాష, ప్రాంతీయ భాషలలో ప్రజా నాటకంగా ప్రదర్శించేవారు. అదే సమయంలో పాశ్చాత్య దేశాలలో ఈ నాటకాల ప్రదర్శన ఆరంభమైంది. బైబిల్ ఆధారంగా కథా వస్తువు ఉండేది. వీటిని ధార్మిక పీఠాలలో ప్రదర్శించేవారు.

ఆధునిక యుగంలో నాటికలు ప్రజల్ని అమితంగా ప్రభావితం చేసాయి. స్వాతంత్ర్య సంగ్రామ సమయాన ప్రభాత్ పెరీ, బిరోద్ మొదలైన వాటిని ప్రదర్శించారు. ఈ నాటకాల్ని విప్లవకారులు ఎక్కువగా ఉపయోగించుకున్నారు. అభినేత నసీరుద్దీన్‌షా, ఓంపూరి, విజయరాజు, శ్యాంబెనగల్ భండారకో నుండి అభినేత్రి నందితదాస్‌ల వరకు స్ట్రీట్ ప్లేల్ని ప్రదర్శించి వచ్చినవారే. ఇటువంటి నాటకాల ప్రదర్శనలో సఫ్దర్ హష్మి చిరస్మరణీయుడు. ఈ నాటకాన్ని జనరంజకంగా తీర్చిదిద్దిన వ్యక్తిగా హష్మినిని చెప్పుకోవచ్చు. రంగ స్థలం లేకుండా, మైక్ లేకుండా, మూజిక్ లేకుండా నాటక దృశ్యాలు ప్రేక్షకుల్ని మన్మోహితుల్ని చేసేవి. సభా స్థలాల వద్ద, చౌక్‌లు, మార్కెట్‌లు, కాలేజ్ గేట్‌లు, ఫ్యాక్టరీ గేట్‌లు, పార్క్‌ల వద్ద ఈ స్ట్రీట్ ప్లేల్ని ప్రదర్శించేవారు. ఏదో ఘటన జరుగుతున్నదని ప్రజలంతా ఒక్కసారిగా గుమిగూడేవారు. నాటకం అని తెలిసేలోపు దానిలో అనుకోకుండానే లీనమై ఉండిపోయేవారు. ఇందుకు ముఖ్య కారణం నాటికలో చెప్పే విషయాలు తమవిగా భావించడం, సమస్యల పరిష్కారం కూడా చూపించడం వల్ల అవి లోక ప్రియంగా మారాయి.

**ప్రజలకు ప్రియంగా మారిన నాటకాలు**

ముఖ్యంగా ప్రజల జీవితాలకు దగ్గరగా వివిధ రకాల సమస్యల పరిష్కారంగా వస్తువు ఉండడం వలన ఈ నాటకాలు ప్రజలు మెచ్చిన నాటకాలుగా పేరొందాయి. రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా ప్రస్తుత వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ సిద్ధాంతాన్ని ఈ నాటికల్లో ప్రదర్శించేవారు. ప్రజలకు రాజకీయంగా, ఒక శాస్త్రీయ అవగాహనను అందించేవారు. ఇక పెద్ద పెద్ద కంపనీలు తమ వ్యాపార ఉత్పత్తుల అమ్మకాలకు ఈ టెక్నిక్‌ను ఉపయోగించుకునేవారు.

ప్రభుత్వ విధానాల ప్రచారానికీ, రాజకీయ పార్టీల ప్రచారానికి స్ట్రీట్ ప్లేల్ని ఉపయోగిస్తున్నారు. వీటికి హద్దులు లేకుండా పోయింది.

**పథప్రాంతే కళాకార్ (స్ట్రీట్ ప్లే థియోటర్, కుక్కుడ్ నాటక్) స్ట్రీట్ ప్లే**

స్ట్రీట్ ప్లేను ఒడియాలో కుక్కుడ్ నాటక్ లేదా పథప్రాంతె నాటక్ అంటారు. భారత స్వాతంత్ర్య పోరాటంలో స్ట్రీట్ ప్లేలు ముఖ్యపాత్రని పోషించాయి. ఇది స్వాతంత్ర్య అనంతరం అనేక మార్పులకు గురి అయ్యింది. ముఖ్యంగా సామాజిక, ఆర్థిక, ఆరోగ్య, విద్యారంగాల్లో జరిగిన చైతన్యవంతమైన కృషిలో స్ట్రీట్ ప్లేల పాత్ర ఉంది.

**సఫ్దర్ హష్మి**

స్ట్రీట్ ప్లే రంగంలో సఫ్దర్ హష్మి చెప్పుకోతగ్గ వ్యక్తి. 1954 సంవత్సరంలో ఇతను పుట్టాడు. హష్మి 34 సంవత్సరాల జీవిత కాలంలో అనేక నాటకాల్ని ప్రదర్శించాడు. భారత రాజకీయ నాటకంలో ముఖ్య పాత్ర పోషించాడు. జన నాట్యమంచ్ (జనమ)ను స్థాపించాడు. 1973లో ఇవేలు నుండి వేరుపడి జనామ స్థాపించాడు. 1989లో సాహెబాబాద్‌లో స్ట్రీట్ ప్లే ప్రదర్శిస్తున్నప్పుడు హత్యకు గురి అయ్యాడు. 1975లో అత్యవసర పరిస్థితి కాలంలో గడవాల్, కాశ్మీర్, ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఇంగ్లిష్ సాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. అత్యవసర పరిస్థితి ఎత్తివేసిన తర్వాత మరల స్ట్రీట్ ప్లేలు ప్రదర్శించాడు. స్ట్రీట్ ప్లే రంగంలో జనామ 1978 సంవత్సరానికి ఉన్నత స్థానానికి ఎదిగింది.

1978 సంవత్సరంలో మెసినొ నూతన స్ట్రీట్ ప్లేను రెండు లక్షల శ్రామికుల సమావేశంలో ప్రదర్శించాడు. తర్వాత అనేక నాటకాలు ప్రదర్శించాడు. సాధారణ రైతుల జీవన స్థితిగతులు, గ్రామాలు, పట్టణాలలో నిరుద్యోగ యువకులు హీన స్థితులు, గృహ హింసపై అనేక నాటకాలు రచించాడు. జనామకు దర్శకుడిగా చనిపోయే వరకు 24 స్ట్రీట్ ప్లే నాటికలు, 4000 కు పైగా ప్రదర్శనలు ఇచ్చాడు. తన నాటికలన్నింటిని ఎక్కువగా శ్రామిక బస్తీలలో ప్రదర్శించేవాడు.

సాంప్రదాయక నాటక రంగస్థలంతో పోల్చితే ఇది భిన్నమైంది. ఈ రంగానికి రచనలకు ప్రసిద్ధ నాటక రచయితలు అవసరం లేదు. అప్పటికప్పుడు పరిస్థితుల ఆధారంగా తయారు చేసేవారు. వర్తమాన ఘటనలు, సమస్యలు, సామాజిక పరిస్థితులపై చైతన్యం తీసుకు రావడం దీని లక్ష్యం. ఈ నాటికలు జన బాహుళ్యాలు, చౌక్‌లు పార్క్‌లు, ఫ్యాక్టరీ గేట్‌లు, కాలేజ్‌లు వేదికలుగా చేసుకుని ప్రదర్శించబడేవి. విభిన్న స్థానాలలో సహజ సిద్ధంగా ప్రజల వద్దకు సందేశాన్ని తీసుకెళ్తుంది. కోతి సహజ సిద్ధంగా తన ఆటను

# విప్లవ సాహిత్యం - స్త్రీల కృషి

- కృష్ణాబాయి

విప్లవ సాహిత్యంలో స్త్రీల కృషిని అంచనా వేసే సందర్భం ముదావహం. విప్లవ రచయితలుగా స్థిరపడిన వారు, కొత్తగా రాస్తున్న వారంతా విరసంలో, ఇతర రచయితల సంఘాల్లో ఉన్నారు. అజ్ఞాతంలోఉండి ప్రజా జీవితాన్ని రికార్డు చేస్తున్నవారూ ఉన్నారు. అయితే విప్లవోద్యమంలో నిమగ్నమైన వారి రచనలు అన్నీ అందుబాటులో ఉండే అవకాశం తక్కువ అనే పరిమితిని దృష్టిలో ఉంచుకోవడం అవసరం. పదుల సంఖ్యలో ఉన్న అజ్ఞాత మహిళా రచయితలు రాసిన రచనలు బయటి ప్రపంచానికి అందకపోవడం వల్ల సంపూర్ణమైన అంచనాకు రాలేం కాని, కొంత వరకు సమగ్రత కోసం ప్రయత్నం చేయవచ్చు.

తెలుగునాట 'విప్లవం' అన్న మాట ప్రవేశించి, విప్లవ రాజకీయాలు నిర్మాణ రూపం తీసుకని అటు ఇటుగా నాలుగు దశాబ్దాల పై చిలుకు కాలం గడిచిపోయింది. అయితే తొలి రెండు దశాబ్దాల కాలాన్ని ఒక రాజకీయ నేపథ్యంలో, మలి రెండు దశాబ్దాల కాలాన్ని సంక్లిష్టమైన, సంకీర్ణమైన రాజకీయ, ఆర్థిక, సామాజిక నేపథ్యంలో చూస్తే సాహిత్యాన్ని, అందునా విప్లవ సాహిత్యాన్నీ మరింత సమగ్రంగా అర్థం చేసుకోవచ్చునని నా అభిప్రాయం. రెండు దశాబ్దాల విప్లవ సాహిత్యం అన్నారు కాబట్టి అక్కడికే పరిమితమవుతాను. ఆరంభ దశలను సూచించి వదిలేస్తాను.

నక్సల్బరీ, శ్రీకాకుళ ఉద్యమాల నేపథ్యంలో 1970, జూలై 4న విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. తదనంతర కాలంలో విప్లవ స్పృహతో తమ గురించి తాము నిర్వచించుకునే ప్రయత్నాలు మొదలుపెట్టారు. ఇక్కడ ప్రయత్నాలు అని ఎందుకంటున్నానంటే స్థూలంగా విప్లవ స్పృహ ఉంది కాని నిర్దిష్టంగా, సూక్ష్మస్థాయిలో మహిళా సమస్యను పరిశీలించే పరికారాలు ప్రోది చేసుకోలేని కాలం కాబట్టి. అందుకు కారణాలూ లేకపోలేదు. విప్లవోద్యమం మొదలైన తొలినాళ్ళలోనే విపరీతమైన నిర్బంధాన్ని చవిచూసింది. ముఖ్యంగా శ్రీకాకుళ ఉద్యమంలో పదుల సంఖ్యలో మహిళలు పాల్గొన్నా వారి సమస్యల పట్ల అవగాహన కల్పించే ప్రయత్నాలు సైతం చేసుకోలేని నిర్బంధం మోపబడింది. ఉద్యమ ఆరంభం, అణచివేత, వెనుకపట్టు ఒకే సందర్భంలో కొనసాగుతున్నా విరసం పూనిక వల్ల మహిళా రచయితలు రచనా వ్యాసంగాన్ని మొదలుపెట్టారు. శ్రీకాకుళ ఉద్యమంలో వీరోచితంగా పోరాడి ప్రాణాలర్పించిన పంచాది నిర్మల స్మరణలోఓల్గా 1972లో 'ప్రతి స్త్రీ ఓ నిర్మల కావాలి' అనే కవిత రాసింది. ఎం. రత్నమాల 1973లో 'ముగింపు' కథ రాసింది. ఈ రెండు రచనలు ప్రాతినిధ్య రచనలుగా చెప్పుకోవచ్చు. సిరిసిల్లా, జగిత్యాల భూస్వామ్య వ్యతిరేకపోరాటాల నేపథ్యంలో గ్రామీణ మహిళలు పెద్ద ఎత్తున విప్లవోద్యమ నాయకత్వంలో

---

ప్రదర్శిస్తుందో అలాగే నాటక కళాకారులు విభిన్న స్థానాల్లో ఆకస్మికంగా ఎలా కళల్ని ప్రదర్శిస్తారు.

భారత్‌లో ఆధునిక స్ట్రీట్ ప్లేలు ప్రజల దగ్గరకు తీసుకుపోవడంలో సఫ్దర్ హష్మిది ముఖ్య భూమిక అతని జన్మదినం.

స్వాతంత్ర్యం తర్వాత (1949) చార్జ్‌షీట్ స్ట్రీట్ ప్లేను కలకత్తా హజారీ పార్క్ వద్ద వేలాది శ్రామికుల ఎదుట ప్రదర్శించారు. 1967 ఉత్పల్ దత్ దిన్‌బద్ లెరపోలా స్ట్రీట్ ప్లేపై విస్తృత చర్చ జరిగింది. నక్సల్‌బరీ ఉద్యమం కేంద్ర ప్రభుత్వం అత్యవసర పరిస్థితి ప్రకటించినపుడు (1975) స్ట్రీట్ ప్లే కళాకారులు ఇబ్బందులకు గురయ్యారు. స్ట్రీట్ ప్లేలు ప్రదర్శించినప్పుడు 1972లో అశిష్ చటర్జీ, 1974లో ప్రబీర్ దత్త పోలీస్ దాడిలో మరణించారు. ఈ రంగంలో బాదల్ సర్కార్ పాత్ర కూడా చెప్పుకోతగ్గది. 1963లో సఫ్దర్ హష్మి జననాట్ మంచ్ ద్వారా అధిక ప్రాధాన్యత తెచ్చాడు. 1983లో ఢిల్లీలో థియాటర్ యూనియన్ స్ట్రీట్ ప్లేలో అనేక మార్పులు తీసుకొచ్చింది. ఈ థియాటర్‌లో అనురాధ కపూర్ మాయరావు, రతి బోర్థొలెమిర్‌లు సృజనాత్మక స్ట్రీట్ ప్లేలు ప్రదర్శించారు. 1980లో పంజాబ్‌లో గురుచరణ్‌సింగ్ – సాధారణ ప్రజల హక్కులు, సామాజిక మార్పుల గురించి అనేక ప్రదర్శనలు ఇచ్చాడు. ఒడిషాలో కూడా నాట్య చేతన సంస్థ ఈ రంగంలో క్రియాశీల పాత్ర పోషించింది. కర్ణాటకలో 1975 వచ్చే వరకు అనేక సంస్థలు రంగం మీదికి వచ్చాయి.

**సాంస్కృతిక స్థితి**

సాంస్కృతికంగా ఎదగడానికి చాలా సంవత్సరాలు పట్టింది. ప్రారంభంలో శాస్త్రీయ నృత్యం శారదుల చేతిలో కుంచించుకుపోయింది. గత 4 దశాబ్దాలుగా జనాదరణ పొందుతున్నది. సాంప్రదాయ రంగ స్థలం నుండి మార్పులు జరుగుతూ వచ్చాయి. ప్రజల్లోకి సందేశం తీసుకుపోయేదాకా అభివృద్ధి చెందాయి. దృశ్యంలో పరివర్తన జరుగలేదు. కొంతమంది దర్శకులు ఆధునిక సాంకేతిక విజ్ఞానం ఉపయోగించి ప్రదర్శిస్తున్నారు. సాధారణంగా ఈ నాటికలు సంక్షిప్తంగా ఉండి విషయాన్ని నేరుగా తీసుకెళ్తాయి. తక్కువ సమయంలో విషయాన్ని నేరుగా ప్రస్తావించడం దీనిలోని ప్రత్యేకత. సఫ్దర్ హష్మి జననాట్ మంచ్ కార్యకర్తల ద్వారా ఔరత్ స్త్రీ నాటకం హిందీ ప్రాంతంలో అనేకసార్లు ప్రదర్శించారు. భారత్‌లోనేకాక విదేశాల్లో శ్రీలంకా, బంగ్లాదేశ్, శ్రీలంక, పాకిస్తాన్‌లలో కూడా వేలాదిసార్లు ప్రదర్శించి ప్రజాదరణ పొందాయి.

*(తెలుగు అనువాదం - సలీం; సంబాద్ సౌజన్యంతో..)*



సంఘటితమయ్యారు. రామయ్య పల్లెలాంటి సంఘటనల్లో మహిళలు పోలీసు తుపాకులను ఎదిరించి నిలిచారు. బహుశా తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం తర్వాత మహిళలు అంత స్థాయిలో పాల్గొన్నది ఈ కాలంలోనే అని చెప్పవచ్చు. ఈ నేపథ్యం నుండే అల్లం రాజయ్య బయ్యక్క అనే గ్రామీణ స్త్రీ జీవితాన్ని ఆధారం చేసుకుని 'అగ్నికణం' నవల రాశారు. రాసింది పురుష రచయితే అయినా విప్లవోద్యమం స్త్రీని, అందునా గ్రామీణ రైతు కూలీ మహిళ జీవితాన్ని చూసేందుకు పాదులు వేసిన కాలానికి 'అగ్నికణం' నవల కొండ గుర్తుగా చెప్పవచ్చు.

సిరిసిల్ల, జగిత్యాల పోరాటాల వెల్లువ తర్వాత విప్లవోద్యమ విస్తరణ వేగవంతమైంది. సామాజిక ఉద్యమాల్లో మహిళా ప్రాతినిధ్యమూ చెప్పుకోదగిన స్థాయిలోపెరిగింది. ఇందుకు కొనసాగింపుగానే సాహిత్యరంగంలో రచయిత్రుల పాత్ర రాసిలోనూ, వాసిలోనూ పెరిగింది. 1988లో విరసం అధికార పత్రిక అరుణతారలో మయూరి కలం పేరుతో వచ్చిన 'మా బడి' కథను సైతం ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ప్రత్యామ్నాయ నిర్మాణ ప్రయత్నంలో పాల్గొంటున్న వారి మధ్య ఉన్న మానవ సంబంధాలూ వాటి చుట్టూ ఉన్న సంక్లిష్టతలూ, సంకీర్ణతల్నీ ఈ కథ అర్థం చేసుకునే ప్రయత్నం చేసింది. 1980ల నుంచి కాల్పనిక సాహిత్యం రాసిన వాళ్ళున్నా స్థూలంగా ఆయాకాలాల్లో ఉద్యమ అవసరాలు, రాజ్యహింస, నిర్బంధం లాంటి అనేక అంశాలపై ఎక్కువ దృష్టిని కేంద్రీకరించారు. స్త్రీ సమస్యను పరిశీలించడానికి, అందుకు కావాల్సిన సైద్ధాంతిక పరికరాలను రూపొందించుకోవడానికి మరింత కాలం అవసరమైంది. పైన ప్రస్తావించిన 'మా బడి', పి. జంగుబాయి రాసిన 'కెరిమెరిఘాట్ రోడ్డు' కథలు ఈ కోవలోకే వస్తాయి.

1981లో రాడికల్ విద్యార్థి సంఘం ఇచ్చిన 'గ్రామాలకు తరలండి' క్యాంపెయిన్ సందర్భంగా మహిళా బృందం ఎదుర్కొన్న అనుభవాల ఆధారంగా లక్ష్మి రాసిన 'గమ్యం చేరేదాకా పరుగుపందెం'లో గ్రామీణ ప్రాంతాల్లో స్త్రీ సమస్యలపై అవగాహన కల్పించే ప్రయత్నాలు ఆరంభమవడం ఇందులో కనిపిస్తాయి. అటు రాజకీయరంగంలోనూ, సాహిత్య సాంస్కృతిక రంగాల్లో స్త్రీ సమస్యపై దృష్టిని కేంద్రీకరించే ప్రయత్నాలు జమిలిగా సాగాయనడానికి ఈ కథ నిదర్శనంగా చెప్పుకోవచ్చు. అట్టడుగు వర్గాల ప్రజల్లోకి, గిరిజన ప్రాంతాల్లోకి విప్లవోద్యమం వెళ్ళిన తర్వాత మారుమూల ప్రాంతాలు, అడవుల్లో నివసించే ఆదివాసీ, గిరిజనులు జీవితాన్ని, ఆయా సమూహాల్లో స్త్రీలపై అమలవుతున్న హింసను విప్లవ స్పృహతో రాసే ప్రయత్నాలు జరిగాయి. శ్వేతరాత్రులు కథా సంకలనంలో ఆ ప్రయత్నాలు కనిపిస్తాయి. ఈ సంకలనంలోని గోపీ భాగ్యలక్ష్మి రాసిన 'జంగుబాయి' కథ మధ్య తరగతి మహిళ గిరిజన మహిళలు మూఢ విశ్వాసాలతో ఎట్లా అవస్థలు పడుతున్నారో చిత్రీకరించే ప్రయత్నం చేశారు. అంటే మధ్యతరగతి స్త్రీ మధ్య తరగతి మహిళల కష్టాలను రాసే క్రమం నుంచి గిరిజన మహిళలపై అమలవుతున్న హింసను పరిశీలించే స్థాయికి ఎదిగిందని చెప్పవచ్చు.. విప్లవోద్యమ ప్రస్తావన ఈ కథలో లేకపోయినా వ్యక్తావ్యక్తంగా 'బిట్వీన్ ది లైన్స్'లాగా విప్లవోద్యమం అట్టడుగు ప్రాంతాలకు ప్రయాణమైందని చెపుతుంది. పి. జంగుబాయి రాసిన 'కెరిమెరిఘాట్ రోడ్డు' కథలో సైతం దళంలో ఉన్న మహిళ గిరిజన ప్రాంతాల్లో ఉపాధ్యాయినిగా పని చేస్తున్న మైదాన ప్రాంతపు మధ్య తరగతి మహిళతో మేమూ మీలాంటి స్త్రీలమే కదా ఎందుకిన్ని కష్టాలు పడాలి అన్న ప్రశ్న వేస్తుంది. నిజానికి ఈ ప్రశ్న దళ సభ్యురాలు వేసిన ప్రశ్న మాత్రమే కాదు అప్పుడప్పుడే ఆదివాసీ గిరిజనుల మధ్యకు వెళ్ళిన ఉద్యమం ఆ ప్రశ్నను బయటి సమాజం దృష్టికి తీసుకెళ్ళిందనడానికి సూచికగా చెప్పుకోవచ్చు.

గడిచిన రెండు దశాబ్దాల కాలం రాజకీయ, ఆర్థిక, సామాజిక, ఆర్థిక మార్పులకు కారణమైందనేది ఎలెల్లడలా ప్రస్ఫుటమవుతున్నది. ఈ పరిణామాలు సహజంగానే విప్లవోద్యమాన్ని, విప్లవ సాహిత్యోద్యమాన్ని ప్రభావితం చేశాయి. 1970ల్లో విప్లవోద్యమం ఆరంభమైనా అది నిలదొక్కుకున్నది కూడా ఈ సంఘర్షణమయమైన కాలంలోనే అన్నది గమనించాల్సిన అంశం. విప్లవ సాహిత్యరంగంలో కూడా మహిళలు రచనా వ్యాసంగాన్ని విస్తృతం చేసిందీ, సంఘటితమయే ప్రయత్నాలు ఆరంభించిందీ 1990 తర్వాతే అని చెప్పవచ్చు. అందుకు బీజాలు పడింది 1983, మే 14, 15 తేదీల్లో పాట్నాలో జరిగిన సదస్సు. ఈ సదస్సు మహిళా సమస్యను, స్త్రీ వాదాన్ని ఎలా చూడాలన్న అంశాలను చర్చించింది. ఈ సదస్సు నిర్వహణకు అఖిల భారత విప్లవ సాంస్కృతిక సంస్థ పూనిక వహించింది.

ఆ తర్వాత కాలంలో మహిళలు సంఘటితమయేందుకు కార్యాచరణ రూపొందడం మొదలైంది. ఇది 1990ల తర్వాత మరింత పరిణతి చెందింది. మహిళా సమస్యలపై విరివిగా రచనలు వెలువడడానికి దారులు వేసింది. మార్క్సిజం వెలుగులో స్త్రీ సమస్యను చూసే సిద్ధాంత కృషి చేయడానికి 90ల తర్వాతి కాలం ఆ అవసరాన్ని మరింత ముందుకు తెచ్చింది. విరసం, విప్లవోద్యమం అటువైపు దృష్టి సారించి ప్రయత్నాలను ముందుకు తీసుకువెళ్ళాయి. విప్లవ రచయితలుగా మహిళా సమస్యను పరిశీలించే ప్రయత్నం ఒకవైపు, మహిళా సంఘాలుగా ఆచరణాత్మక కార్యచరణ కోసం సంఘాలూ ఏర్పడ్డది ఈ కాలంలోనే. 1990, జనవరిలో విమల 'ఓ పునరుత్పత్తి పరికరమా' అంటూ విప్లవోద్యమ కార్యకర్తగా రణన్నినాదం చేసింది. విమల 'అడవి ఉప్పొంగిన రాత్రి' విప్లవ సాహిత్యంతో లోకాన్ని దిగ్గున లేపి, కలవరపాటుకూ, కల్లోలానికీ గురి చేసిన కవితా సంపుటం. ఈ కవితలోనే విమల అంటుంది.. 'ఇన్నాళ్ళ అమానవీయ హింసలో, చివరకు, గర్భంపై ప్రసవ చారికలు, మాత్రమే దక్కిన స్త్రీలు' అంటూ ఆ చారికలు సొంతం స్త్రీ జాతి వ్యక్తిత్వంపై కమ్ముకున్న చీకటి అనంతాలని చెప్పింది. అజ్ఞాత రచయిత రాజేశ్వరి 'నేనేం చేశాను' అనే కవితను 1997 సాహిత్య, సాంస్కృతిక వర్క్‌షాప్ ప్రత్యేక సంచికలో రాశారు. విమల, నల్లూరి రుక్మిణి లాంటి రచయిత్రులు అనేక సాహిత్య ప్రక్రియల్లో అనుభవం ఉన్నప్పటికీ కాల్పనిక సాహిత్యరంగానికే పరిమితమవడం కూడా ఒక ప్రతిబంధకం.

'మహిళా మార్గం' పత్రిక తెలుగు సీమలో మధ్య తరగతి, పట్టణ పేదలు, గ్రామీణ, ఆదివాసీ మహిళల జీవితాన్ని కాల్పనిక, కాల్పనికేతర ప్రక్రియల్లో రికార్డు చేసి గణనీయమైన సేవ చేసింది. మహిళా మార్గం పత్రికలో 1992 నుంచి 1998 దాకా వచ్చిన కథలతో 2000 సంవత్సరంలో 'ఒంటరిగా లేం మనం' అన్న కథా సంకలనాన్ని ప్రచురించింది. ఈ సంకలనంలో 18 కథలున్నాయి.

మూడు కథలు మినహా మిగతా పదిహేను కథలను మహిళారచయితలే రాశారు. మధ్య తరగతి స్త్రీ సమస్యలతో సహా కార్మికవర్గ స్త్రీలు ఎదుర్కొంటున్న కష్టాలను, ఉద్యమాలను ఈ కథలు రికార్డు చేశాయి. బి. అనురాధ రాసిన 'ఒంటరిగా లేం మనం' అనే కథ ఓ పరిశ్రమలో పనిచేసే మహిళాకార్మికులు చేసిన సాహసోపేత ట్రేడ్ యూనియన్ ఉద్యమం వస్తువుగా సాగుతుంది. నవత రాసిన 'కెరటం' మత్స్యకారుల జీవితాన్ని, వారు ప్రదర్శించే ప్రజాస్వామిక వైఖరిని ఆర్ద్రంగా చెపుతుంది. ఆ తర్వాత కాలంలో ఈ రచయితే 'గంగానమ్మ' నవలిక రాసింది. ఈ నవలిక విశాఖనగరంలో కోట్లాది సంపదను సృష్టించే జాలరులు, అందులోనూ మహిళలజీవితాలు వస్తువుగా రాసిందే.

ఇదే సంకలనంలో నల్లక్క రాసిన 'ఆచారం' కథ లంబాడీ తండాల్లో మూఢ విశ్వాసాలకు మహిళలు ఎట్లా బలవుతున్నారో చెపుతుంది. విప్లవోద్యమం ప్రజలకు సన్నిహితమవుతున్న క్రమాన్ని ఈ రెండు దశాబ్దాల కాల్పనిక సాహిత్యం నమోదు చేసింది.

తొంభైయ్యవ దశకంలో అరుణ రాసిన 'ఎల్లి' నవలకు మొత్తం విప్లవ సాహిత్యంలో చాలా ప్రాముఖ్యత ఉంది. ఎరుకల స్త్రీ జీవితాన్ని విప్లవ స్పృహతో, మార్క్సిజం వెలుగులో చూసే ప్రయత్నం విప్లవ సాహిత్యం ప్రయాణానికి తొలి అడుగుగా చెప్పుకోవచ్చు. పెళ్ళి ఇష్టం లేని ఎల్లి, ఓలి ఇచ్చుకోలేని తండ్రి, పంచాయితీ మనసు కల్లోల పరిచే సంఘర్షణ ఎల్లి, నీలిల చుట్టూ అల్లుకుని ఉంటుంది. ఎల్లి నవల ముగింపులో 'నీలి నీళ్లురాని కళ్ళతో దువ్వని తాకింది' అంటూ రచయిత ఎల్లిని గురించిన మానసిక సంఘర్షణను కళ్ళకు కడతారు. బహుశా నీళ్ళులేని నీలి కళ్లు భవిష్యత్తు వైపు చూస్తున్నాయా అంటే బహుశా అని చెప్పవచ్చేమో కూడా. ఇంకోవైపు నుంచి చూస్తే బొడ్డుడని ఎల్లి పెళ్ళిని నిరాకరించి, తల్లి ఎడబాటును తట్టుకుని ఎక్కడికి ప్రయాణమై ఉంటుంది అన్న ప్రశ్న వేసుకుంటే ఆశావహమైన భవిష్యత్తువైపుకే అన్న జవాబుకూడా రావచ్చేమో?

1990ల తర్వాత విప్లవ చైతన్యంతో మహిళా సమస్యలపై రచనలు చేసే వారి సంఖ్య గణనీయంగానే పెరిగింది. 'తాయమ్మ' కథతో కథా రచయితగా పేరు తెచ్చుకున్న కరుణ, మిడ్కో కలం పేరుతో గత దశాబ్దన్నర కాలంగా కథలు రాస్తున్న రేణుక, గీతాంజలి, షహీదా లాంటి అనేక మంది రచయిత్రులు చెప్పుకోదగిన స్థాయిలో మహిళా సమస్యల ఆధారంగా మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథంతో సాహిత్య సృజన చేశారు. నల్లూరి రుక్మిణి దెబ్బెల తర్వాత విప్లవోద్యమ ప్రభావంతో ఉన్నా సాహిత్యం రంగంలో విశేష కృషి చేసింది మాత్రం 90ల తర్వాతే అని చెప్పుకోవచ్చు. గడచిన దశాబ్ద కాలంలో మూడు కథా సంకలనాలు, ఒక నవల రాసిన రుక్మిణి విప్లవ దృక్కోణంలో మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలను, ముఖ్యంగా ప్రత్యేక ఆర్థిక మండలాలు, అభివృద్ధి పేరుతో జరిగే విధ్వంసాన్ని, స్త్రీలు అనుభవిస్తున్న హింసను వస్తువుగా తీసుకుని తన రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. 'సర్రైంక సెట్టుకింద' నవల ఇతి వృత్తం గుంటూరు జిల్లా ఉద్యమం, అందులో మమేకమైన ఓ కుటుంబం చేసిన త్యాగం. పులిచింతల, పోలవరం లాంటి భారీ ప్రాజెక్టుల వల్ల విధ్వంసమవుతున్న గిరిజన జీవితం, సంస్కృతులను ఆధారం చేసుకుని రాసిన 'ముంపు', 'నెగడు' లాంటి కథలు రుక్మిణి రచనల్లో లోతైనవిగా చెప్పుకోవచ్చు. పతనమవుతున్న విలువలనే కాకుండా నిర్మించుకోవాల్సిన ఉన్నత విలువల సమాజానికి సంబంధించిన కలలను, ఊహలను, ఆలోచనలను రుక్మిణి తన సాహిత్యంలో పత్యక్షంగానే వెలిబుచ్చారు.

సరిగ్గా ఈ కాలంలోనే అజ్ఞాత సాహిత్యకారులు సాహిత్య, సాంస్కృతిక వర్క్‌షాప్‌ను నిర్వహించుకున్నారు. ఇందులో ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నది మహిళలే. అందులోనూ అట్టడుగు ఆదివాసీ యువతులు తమ జీవితాన్ని రాజకీయ చైతన్యంతో తరచిచూసుకునే ప్రయత్నం చేశారు. ఈ సందర్భంగా సాహిత్య బులెటిన్‌ను సైతం ప్రచురించారు. ఇందులో నల్లక్క, రాజేశ్వరి, భారతి, వెన్నెలలు రాసిన కవిత్వం ఆదివాసీ జీవితం, రైతుల కష్టాలు, యానాదుల అనాది వేదనలు వస్తువులుగా సాగాయి. గోండు సమాజంలో మహిళలపై అమలవుతున్న హింస, ముఖ్యంగా గోటుల్ పద్ధతి వల్ల కోయ యువతులు ఎదుర్కొంటున్న మూఢ నమ్మకం ఆధారంగా 'రాగో' నవల వచ్చింది.

మైదాన ప్రాంతం నుంచి అడవుల్లోకి వెళ్ళిన స్త్రీ జీవితాన్ని ఓ పురుష విప్లవ కార్యకర్త రాసింది. ఇక్కడ నుంచి ఒక పరిణామాత్మక గెంతు అని చెప్పుకోవచ్చు. నిరుపేద, గ్రామీణ, రైతు కూలీ కుటుంబాల నుంచి అనేక మంది స్త్రీలు ఉద్యమంలోకి వచ్చారు. వాళ్ళు వారి వారి జీవితాలను తరచి చూసుకోవడం ఆరంభించారు. ఈ నేపథ్యంలో వచ్చిందే వనజ రాసిన 'అడవి పుత్రిక' నవల. రైతు కూలీ కుటుంబంలో పుట్టిన పద్మ అనే మహిళ విప్లవోద్యమంలోకి ప్రవేశిస్తుంది. చదువు నేర్చుకుంటుంది. అనుకోని పరిస్థితుల్లో సహచరుడితో సహా జైలుపాలవుతుంది. సహచరుడి కన్నా ముందే విడుదలవుతుంది. నిర్బంధానంతర కాలంలో తను నడిచి వచ్చిన జీవితాన్ని తన రాజకీయ విశ్వాసాల వెలుగులో పరిశీలించింది. నిర్బంధంలో ఉన్న సహచరుడి సలహాలు తీసుకుంటూ 'అడవి పుత్రిక' నవలను పూర్తి చేసిన వైనాన్ని వనజ సహచరుడి మాటల్లోనే విందాం, 'విప్లవోద్యమంలో భాగంగా మేమిద్దరం పని చేస్తున్న క్రమంలో శత్రువు చేతికి చిక్కి దీర్ఘకాలం నిర్బంధంలో ఉన్నాం. ఆమె ముందుగా విడుదల కావడం వల్ల తరచూ నన్ను కలవడానికి జైలుకి వచ్చేది. తాను రాసే పాటలను చూసి అపుడప్పుడూ సలహాలు చెపుతుండేవాడిని, దీర్ఘకాలం ఉద్యమానికి దూరంగా ఉండడం, వెంటనే ఇతర పనులు లేకపోవడం వల్ల గతానికి సబంధించి 'సమీక్ష' రాయమని సలహా ఇచ్చాను. దీంతో గతాన్ని ఎలా విశ్లేషిస్తుంది? తన భావాలను ఎలా రాస్తుందో పరిశీలిద్దామనుకున్నాను. కొద్ది రోజుల్లోనే ఆమె 40 పేజీల దాకా రాసి తీసుకొచ్చింది. రాసిన తీరు, వర్ణన, విశ్లేషణ చూసిన తర్వాత ఇది కేవలం సమీక్షగా కాకుండా 'ఆత్మకథ'గా రాస్తే బాగుంటుందని చర్చించాను. ఉద్యమంలో కొనసాగుతూ ఆత్మకథలాగా రాసి ఉంచడం మంచిది కాదుకాబట్టి పేర్లూ, ఊర్లు మారిస్తే జీవితం అదే అయినప్పటికీ ఒక నవల రూపం వస్తుందని చెప్పడంతో ఆమె అలానే రాసింది. నేను ఊహించినదానికంటే కూడా బాగా రాయడంతోనే ఈ సలహా ఇచ్చాను'. అన్నారు. వనజ అనే రచయితకు ఆమె సహచరుడు ఇచ్చిన సలహాగా మాత్రమే కాకుండా విప్లవోద్యమం మారుమూల ప్రాంతాలకు విస్తరించి అక్కడ మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలపై అవగాహన కల్పించే సందేశంగా చూడొచ్చు.

ఇదే సందర్భంలో చెప్పుకోవాల్సిన మరో అంశం 1993, 1994ల మధ్య జరిగిన సారా వ్యతిరేక పోరాటం. ఇందులో మహిళల పాత్ర ఎంత సాహసోపేతమైనదో నేను కొత్తగా చెప్పనవసరం లేదు. ఈ పోరాటం ప్రత్యేకంగా ఒక రాజకీయ నిర్మాణ సారథ్యంలో నడవక పోయిన మాట ఎంత నిజమో విప్లవ శక్తులు సహా అనేక సంఘాలు, సమూహాలు, వ్యక్తులు ఇందులో భాగమైన మాట అంతే నిజం. రాష్ట్ర వ్యాప్తంగా మహిళలు పెద్ద ఎత్తున భాగమైన మహోద్యమం సారా వ్యతిరేక పోరాటం. ప్రధానంగా నగరాల్లో మురికివాడల మహిళలు విప్లవోద్యమానికీ, ప్రజా సంఘాలకు దగ్గరైన కాలం కూడా. సారా పోరాటం తర్వాత అనేక మంది మహిళలు 'మహిళామార్గం' లాంటి పత్రికల్లో స్త్రీ సమస్యలపై రచనలు చేశారు. ప్రధానంగా 1994 నుంచి అటు ఇటుగా ఒకేసారి కథారచనలోకి అడుగుపెట్టిన కరుణ, రేణుకలు ఇద్దరూ భిన్న నేపథ్యాల నుంచి వచ్చి తాము ఎరిగి ఉన్న జీవితాలను మార్క్సిజం వెలుగులో అర్థం చేసుకునే ప్రయత్నంలో రాసిన కథలు 'తాయమ్మకథ', ఉద్యమకారుడి లొంగుబాటును అర్థం చేసుకునే క్రమంలో రేణుక రాసిన 'మెట్లమీద' కథలు వారిని విప్లవ కథా రచయితలుగా నిలబెట్టాయనడంలో సందేహం లేదు. తెలంగాణ ప్రాంతం నుంచి ఇదే కాలంలో రచనలు చేయడం మొదలుపెట్టిన మరో రచయిత్రి గీతాంజలి. కరుణ, మిడ్కో, గీతాంజలిల రచనలు వైవిధ్యమైనవి.

మిడ్కో మధ్య తరగతి మహిళల కష్టాలను చైతన్యవంతమైన ఓ మధ్య తరగతి రచయిత చెప్పడం నుంచి మొదలై కొంచెం సన్నిహితంగా విప్లవ రాజకీయాలను పరిశీలించే క్రమంలో పట్టణాలకూ... అక్కడి నుంచి కోయ ప్రజల మధ్యకు ప్రయాణించే క్రమంలో రాసినవి. దశాబ్దన్నర కాలంలో రాసిన డజనుకు పైగా రచనలను పరిశీలిస్తే కథా రచయితగా, మార్క్సిజం వైపు నుంచి స్త్రీ వాదాన్ని గాఢంగా వినిపించే ఉద్యమకారిణిగా ఎదిగిన తీరును, విప్లవోద్యమ ప్రయాణాన్ని అతి దగ్గరగా పరిశీలించిన దాఖలా 'మెట్లమీద' కథా సంపుటంలో కనిపిస్తుంది. కాల్పనిక సాహిత్యమే కాదు ఆంధ్రప్రదేశ్, చత్తీస్‌గఢ్ సరిహద్దు ప్రాంతాల్లో గిరిజనుల అణచివేతకు ఏర్పడిన 'సాల్వాజుడుం' కోయమహిళలపై చేసిన అమానవీయమైన దాడులను మిడ్కో యథార్థ గాథలుగా మూడు పుస్తకాలు రాసింది. విప్లవోద్యమ విస్తృతి వల్ల ఒక ప్రాంతానికి చెందిన ఉద్యమకారిణి అక్కడి మహిళలపై అమలవుతున్న హింసను రికార్డు చేసింది. కరుణ 'రేపటి గెరిల్లాలు' కథతో రచనా రంగంలోకి అడుగుపెట్టినా 'తాయమ్మ కథ'తో కథా రచయితగా గుర్తింపు తెచ్చుకుంది. విప్లవ చైతన్యంతో తెలంగాణ గ్రామీణ స్త్రీ జీవితాన్ని పరిశీలించింది. గ్రామీణ ప్రాంతాల్లో తాయమ్మలాంటి అనేక మంది స్త్రీల జీవితాన్ని ఈ కథలో కరుణ వేదనామయ స్వరంతో చెప్పుకొచ్చింది. 1994 నుంచి 2008 వరకు పన్నెండేళ్ళ కాలంలో రాసిన పదహారు కథలను సాంతం పరిశీలిస్తే తెలంగాణ నుంచి చత్తీస్‌గఢ్ దాకా ఉద్యమ విస్తరణ, సాఫల్య వైఫల్యాలను, స్త్రీల పాత్రను, ప్రత్యామ్నాయ నిర్మాణంలో నిమగ్నమై ఉన్న రాజకీయ సంస్థ తన కార్యక్షేత్రంలో మహిళా సమస్యను ఎట్లా చూస్తుందోనన్న సందేహాలకు, ప్రశ్నలకు జవాబు చెపుతాయి.

1980లో దండకారణ్యంలో విప్లవోద్యమం ప్రవేశించింది లగాయితూ మహిళలు పెద్ద సంఖ్యలో సంఘాల్లో చేరడం మొదలైంది. అందుకు కారణం వలస వ్యాపారుల నుంచి వాళ్ళు ఎదుర్కొంటున్న ఒత్తిడి, గాంధర్వ వివాహ పద్ధతులు మహిళలను ఎక్కువగా కదిలించాయి. ఎనభైల నుంచి తొంభైల దాకా పదేళ్ళ కాలం గడిచినా దండకారణ్య మహిళా ఉద్యమం ఊపందుకున్నది మాత్రం తొంభైయ్యవ దశకం తర్వాత మాత్రమే. 1997, ఫిబ్రవరిలో సుక్మా(దంతెవాడ జిల్లాలోని తాలూకా, భద్రాచలానికి దగ్గరగా ఉంటుంది) తహశీల్‌దార్ కార్యాలయాన్ని దాదాపు 30 వేలకు పైగా కోయ ప్రజలు తునికి ఆకు రేట్లు పెంచాలని డిమాండ్ చేస్తూ చుట్టుముట్టారు. ఇందులో దాదాపు పదివేల మంది మహిళలు పాల్గొన్నట్లు పత్రికలే పేర్కొన్నాయి. ఇది ప్రత్యక్షంగా సాహిత్యంలోకి వస్తుందా అంటే రాకపోవచ్చు గాని మహిళలు, అందునా ఆదివాసీ మహిళలు వీధుల్లోకి వచ్చిందనేది కాల క్రమంలో ఆయా సమూహాల్లో సాహిత్య రూపం తీసుకోవచ్చు. అంతకంటే ముఖ్యమైన విషయం మహిళలకూ పిల్లలకూ పోషకాహారాన్ని అందించాలని కోరుతూ విప్లవోద్యమ నాయకత్వంలో పెద్ద ఎత్తున ఆందోళనలు జరిగాయి.

ఇది భారతదేశ చరిత్రలో చెప్పుకోదగిన విషయం అంటే ఆశ్చర్యం లేదనుకుంటాను. దండకారణ్య మహిళ ఉద్యమకారులు ఈ మధ్య కాలంలో ప్రచురించిన 'దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర - 1980 - 2009' పుస్తకం చదివితే ఎనభైల్లో ఆరంభమైన ఉద్యమం ఎన్నెన్ని ఒడి దుడుకుల్లో ఎక్కడెక్కడికి ప్రయాణించిందో చూడవచ్చు. తమ ఉద్యమ చరిత్రను రాసుకున్న మహిళలు రేపో, మాపో తమ జీవితాల్లోని దైన్యాన్ని పారదోలేందుకు పోరాడడం ఆశ్చర్యకరం కాదనుకుంటాను.

పైన ప్రస్తావించిన వారే కాకుండా గత రెండు దశాబ్దాలుగా 'అరుణతార', 'మహిళా మార్గం', 'కుల నిర్మూలన' లాంటి పత్రికల్లో ఎంతోమంది సాహిత్య సృజన చేశారు. వారంతా జీవితంలో నుంచి సాహిత్యంలోకి అనివార్యంగా వచ్చిన వారు. మహిళా మార్గం పత్రికలో ఎస్. విజయలక్ష్మి రాసిన కథలు చదివితే విప్లవ చైతన్యం ఎంత సునిశితమైందో, సున్నితమైందో తెలుస్తుంది. నెల్లూరు మాండలికంలో విజయలక్ష్మి రాసిన కథలు స్త్రీ జీవితాన్ని, అందునా రైతాంగ మహిళా, కూలీల అంతరంగాన్ని మనముందుంచింది. పి. వరలక్ష్మి లాంటి కొత్త రచయిత్రులు యురేనియంపై, ప్రాంతీయ ఉద్యమాలపై రాసిన వ్యాసాలు అనువాదాలు భవిష్యత్తుపై ఆశను రేకెత్తిస్తాయి.

గత రెండు దశాబ్దాల కాలంలో వచ్చిన ప్రతి విప్లవ రచన నెత్తుటితో, త్యాగంతో, చెమటతో తడిసింది. ఆ సాహిత్యాన్నంతా పరిశీలించాల్సిన అవసరం ఉంది. సమయాభావం, స్థలాభావం కారణంగా వాటి జోలికి నేను వెళ్ళడం లేదు. ఇక విప్లవోద్యమంలో నిర్దిష్టంగా మహిళా సమస్యను, స్త్రీవాదం లాంటి ప్రభావశీలమైన ఉద్యమాలను మార్క్సిస్టు సిద్ధాంత వెలుగులో పరిశీలించిన వారు జాతీయ స్థాయిలో అనురాధ గాంధీ, ఆంధ్రప్రదేశ్‌లో డా. టి. నళిని, ఎం. రత్నమాలలు.

అనూరాధ గాంధీ స్త్రీవాదంపై రాసిన 'స్త్రీవాద ఉద్యమంలో తాత్విక ధోరణులు' అన్న పుస్తకం తెలుగులో అనువాదమైంది. 1960ల నుంచి స్త్రీవాద ఉద్యమంలో వచ్చిన విభిన్న తాత్విక ధోరణులను అనూరాధ గాంధీ చర్చించారు. సిపిఐ మావోయిస్టు

పార్టీ కేంద్ర కమిటీ సభ్యురాలైన అనూరాధ గాంధీ స్త్రీవాద ఉద్యమంపై లోతైన అధ్యయనం చేశారు. ఫెమినిజంలోని మంచిని ఎత్తి పడుతూనే అనారోగ్య ధోరణులను విమర్శించారు. విప్లవోద్యమంలోని వివిధ రంగాల్లో పని చేస్తున్న మహిళా కామ్రేడ్స్‌కు అనురాధ గాంధీ పుస్తకం కరదీపికగా ఉంటుందనడంలో సందేహం లేదు.

1970ల నుంచి విప్లవ ఉద్యమాల్లో భాగం వహించిన రత్నమాల 2005, జూన్‌లో వ్యాస సంపుటం 'ఇమ్మర్శ' ప్రచురించారు. ఇందులో మహిళా సమస్య, సారా ఉద్యమం, చలం సాహిత్యం లాంటి అంశాలపై లోతైన, విలువైన వ్యాసాలున్నాయి. అంతేకాకుండా దేశంలో అత్యయిక పరిస్థితికి ముందే 'నూతన' అనే పత్రికకు సంపాదక బాధ్యతలు నిర్వహించిన రత్నమాల ఆ తర్వాత తెలుగు సీమ సామాజిక, రాజకీయ రంగాల్లో కీలకమైన పాత్ర పోషిస్తున్నారు. ఆ తర్వాత చెప్పుకోదగిన స్థాయిలో రచనలు చేసిన డా. టి. నళిని 1989 నుంచి 2009 వరకు రాసిన వ్యాసాల సంపుటం 'స్త్రీవాద సాహిత్యం - ఒక పరిశీలన' మార్క్సిస్టు కోణంలో స్త్రీవాదాన్ని అర్థం చేసుకునేందుకు ఉపకరిస్తాయి. నళిని తన 23 వ్యాసాల్లో సామాజిక విప్లవంలో స్త్రీ విముక్తి గురించి, అలెగ్జాండ్రా కొల్లెంటాయ్ ప్రఖ్యాత రచన 'మూడు తరాలు' కథ దాని పూర్వాపరాలు, ఏ నేపథ్యంలో అర్థం చేసుకోవాలి అన్న అంశాల ఆధారంగా 'విభిన్న దృక్పథాల మూడు తరాలు' పేరుతో విమర్శా వ్యాసం రాసింది. ఈ సంపుటంలో అస్తిత్వ రాజకీయాల గురించి నళిని లోతైన చర్చ చేసింది. స్త్రీ స్వేచ్ఛాన్వేషణ మార్గాల గురించి రాసిన వ్యాసంలో 'భౌతిక పునాది లేని స్వేచ్ఛ, కేవలం భావంగానే ఉండే స్వేచ్ఛ, మొక్క నుంచి విడివడిన పువ్వులాంటిది. అదెంత అందమైనదైనా నిలకడ లేనిదే అవుతుంది' అంటూ ఆలోచనకు మార్గాలు తెరిచే పరిశీలనలు చేసింది. అసమ సమాజంలో వైరుధ్యాలలో చిట్ట చివరగా అదృశ్యమయ్యేది స్త్రీ, పురుష వైరుధ్యమని పరిశీలనాత్మకంగా తెలియచెబుతుంది.

ఈ దశాబ్దాల్లో వెలువడిన సాహిత్యం గురించి, అందులోనూ తీవ్ర నిర్బంధాల మధ్య అడుగులు వేస్తున్న విప్లవ సాహిత్యోద్యమం గురించి ఆలోచించాల్సిన చర్చించాల్సిన అంశాలు, వెలుగులోకి తీసుకురావాల్సిన సాహిత్యం చాలానే ఉన్నది.

అత్యంత అననుకూలమైన కాలాన్ని అనుకూలత వైపునకు మళ్ళించుకోవడంలో విప్లవ సాహితోద్యమం పడిన అష్టకష్టాలు అంత సులభంగా అర్థం చేసుకోలేం. సమాజంలో అన్ని ప్రజానుకూల శ్రేణులు ప్రత్యామ్నాయ ఉద్యమాలను అర్థం చేసుకోవడం వల్లే ఈ చర్చ సంపూర్ణమవుతుంది. ఈ అవగాహనా పత్రంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు చర్చించదగినవి. ఈ చర్చను మరింత ముందుకు తీసుకువెళ్ళడం మహిళా సాహిత్యానికి ఎంతో అవసరం.

విప్లవ రచయితల సంఘం ఎకడమిక్ మీటింగ్స్‌లో పాల్గొవడం అరుదైన విషయం. ఈ అవకాశం ఇచ్చిన నిర్వాహకులకి విరసం తరఫున కృతజ్ఞతలు తెల్పుతున్నాను. అందునా విప్లవాల పురిటిగడ్డ ఓరుగల్లులో, విరసం ఆవిర్భావానికి చేయూత ఇచ్చిన వరంగల్లులో వచ్చిన ఈ సందర్భానికి ఆనందం.

**ఉపయుక్త గ్రంథ సూచి :**

అగ్నికణం - అల్లం రాజయ్య, (1983, ఆగస్టు); ఎ.ఐ.ఎల్.ఆర్.సి. మహిళపై ప్రత్యేక సదస్సు (1983, మే); గమ్యం చేరేదాక-అరుణతార (1984, జూలై); అడవి ఉప్పొంగిన రాత్రి - విమల (1990, జనవరి); నేలతల్లి విముక్తి కోసం (1990, సెప్టెంబర్); ఎల్లి - అరుణ (1992, నవంబరు); శ్వేతరాత్రులు (1993); అడవి పుత్రిక - వనజ (1995, సెప్టెంబర్); రుతు పవనాలు (1995); మనకాలం కథలు - విరసం (1997, జనవరి); సాహితీ, సాంస్కృతిక వర్క్‌షాప్ - పీపుల్స్ వార్ (1997, మార్చి); ఒంటరిగా లేం మనం - మహిళా మార్గం (1999, మార్చి); గీతలకావల - నల్లూరి రుక్మిణి (2000, ఏప్రిల్); కథా కెరటాలు - విరసం (2001, జనవరి); ప్రశ్నే ప్రశ్నార్థకమైన వేళ - నల్లూరి రుక్మిణి (2001, జనవరి); చెదిరిన పిచ్చుక గూడు - ఆర్. శశికళ (2003, జనవరి); జెండర్ స్పృహ - సంపాదకత్వం, కాత్యాయని విద్మహే (2005, మార్చి); ఇమ్మర్శ - ఎం. రత్నమాల (2005, జూన్); నల్రెంక సెట్టుకింద - నల్లూరి రుక్మిణి (2006, జూన్); మెట్ల మీద - మిడ్కో (2007, డిసెంబర్); కథలపంట (2009); తాయమ్మ కథ మరికొన్ని కథలు - కరుణ (2009, జనవరి); మృగన - విమల (2009, ఏప్రిల్); దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర - 1980 - 2009 (2010, మార్చి); సాహిత్యాకాశంలో సగం - కాత్యాయని విద్మహే (2010, ఫిబ్రవరి); స్త్రీవాద సాహిత్యం-ఒక పరిశీలన - డా. టి. నళిని (2010, ఫిబ్రవరి); స్త్రీవాద ఉద్యమంలో తాత్విక ధోరణులు - అనురాధ గాంధీ (2011, జూలై); పి. వరలక్ష్మి రచనలు; అరుణతార, మహిళా మార్గం, విప్లవి, పోరు మహిళ మొదలైన పత్రికలు...

ప్రశాంత్ సహకారం..

*(2012 జనవరి 27న రెండు దశాబ్దాల (1990-2010) తెలుగు రచయిత్రుల సాహిత్యం గమనం-గమ్యం గురించి వరంగల్ కాకతీయ యూనివర్సిటీ, మైసూర్ యూనివర్సిటీ, ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక సంయుక్తంగా నిర్వహించిన సదస్సులో సమర్పించిన పత్రం)*



సీరియల్

# సూర్యుడు

- కె.వి. కూర్మనాథ్



ఆర్టిస్టు : రాయ్ లిక్టెన్‌స్టిన్

(7)

*(గత సంచిక తరువాయి...)*

## రమేష్ - సహచరుడు

రమేష్ నాకు అనుకోకుండా తారస పడ్డాడు, రెండోసారి. మొదటిసారి సూర్యుడిని కలిసినపుడు. రెండో సారి ఇదిగో మళ్ళీ ఇపుడు తనగురించి మాట్లాడడానికి. నాలుగేళ్లవుతోంది సూర్యుడు లేకుండా. దుఃఖపు చాయలేవీ కనబడలేదు రమేశ్ లో.

కానీ మాట్లాడుతున్నకొద్దీ అర్థం అయింది – దుఃఖపు ఆనవాళ్ళు ఎక్కడ ఉన్నాయో. కానీ అది దిగులు రూపంలో కనబడలేదు. మాటల్లో కనబడలేదు. అది అతడి కోపానికి కారణంగా మారిందని అనిపించింది. అతడి హృదయంలో ఆ మేరకు కొంత శూన్యం ఏర్పడ్డదని, దాన్ని బహుశా అతడు ఇక ఎప్పటికీ మోస్తూ ఉంటాడని నాకు అనిపించింది. కానీ అతడు మోస్తున్నది సూర్యుడు లేని శూన్యాన్ని మాత్రమే కాదని, తన దగ్గర నించి నేర్చుకున్నవీ, విన్నవీ, తనతో పంచుకున్నవీ కూడా ఉన్నాయని అర్థం అయింది.

* * *

ఎక్కడికి వెళిపోతారు మనుషులు, చనిపోయాక? అని అడిగాడు సంభాషణ మధ్యలో నన్ను.

ఇది ప్రశ్న కాదని, సంభాషణ కొనసాగించడానికేనని తెలుసు. అందుకే ఏం మాట్లాడ లేదు నేను.

'శరీరం మట్టిలో కలిసిపోతుంది. కానీ వాళ్ళు దేనికోసం నిలబడ్డారో, ఏ విలువలు ప్రకటించారో అవి ఇక్కడే ఎక్కడో అక్కడ, ఎవరిలోనో నిలిచే ఉంటాయి సజీవంగా,' అన్నాడొకసారి, శ్యాం చనిపోయిన సందర్భంలో.

నాకపుడు సరిగ్గా అర్థం అయిందని చెప్పలేను. అర్థం కాలేదని తనకి అనిపిస్తే ఇంకా వివరించి చెప్పేవాడు. మళ్ళీ మళ్ళీ వినాలనిపించే గొంతుతో, అనునయంగా.

'బతికి ఉన్నపుడు కూడా, మనకి దూరమైన, దూరంగా ఉన్న మనుషులు మనకి గుర్తుంటారా, ఉండరా? దగ్గరగా లేకపోవచ్చు కానీ, వాళ్ళు చాలా దగ్గరగా ఉంటారు. అసలు వాళ్ళు ఇక్కడే ఎక్కడో ఉన్నారన్న స్పృహే మనకి హాయిగా ఉంటుంది. ధైర్యంగా ఉంటుంది.

వాళ్ళు మనతో నడుస్తున్నట్టుగానే, మాట్లాడుతూ ఉన్నట్టే, నవ్వుతూ ఉన్నట్టే ఉంటుంది. అసలు మనమెపుడూ విడిపోయి ఉన్నట్టే ఉండదు,' అన్నాడు.

అది ఎంత నిజం! ఎవరో ఒకరు మనకోసం ఆలోచించే వాళ్ళు ఇక్కడే ఎక్కడో ఉన్నారన్న భరోసా ఎంత బాగుంటుంది. బహుశా, అందుకేనేమో తను ఎంతగానో ప్రేమించిన వాళ్ళు పోయినపుడు కుమిలిపోయే వాడు కాదు. 'ఇదిగో ఈ నేల, ఈ అడవి సాక్షిగా ఎంతోమంది నెలకొరగడం చూసేడు. కానీ అతడు దుఃఖపడే పద్ధతే భిన్నంగా ఉండేది,' అన్నాడు రమేష్.

కొన్ని రోజులపాటు దిగులుగా, నిస్ప్రాణంగా, నిర్వ్యాపకంగా ఉండిపోయే వాళ్ళని చూశాను. ఏదో పోగొట్టుకున్న వాళ్లలాగా ఉండిపోయే వాళ్ళని చూశాను. దుఃఖాన్ని నిరంతరం మోస్తున్న వాళ్ళని చూశాను. కానీ దుఃఖాన్ని తను తీసుకున్న పద్ధతి నాకొక లెర్నింగ్. సంతోషంలో మనుషులెలా ఉన్నారన్నది కాదు, దుఃఖంలో ఎలా ఉన్నారన్నది వాళ్ళ ధృడత్వాన్ని చూపిస్తుంది.

'ఎవరైనా చనిపోయినట్టు తెలిసిన వెంటనే మనసులో ఏమనుకునేవాడో తెలీదు కానీ, కాసేపట్లోనే వాళ్ళ కంట్రిబ్యూషన్ని అవలోకనం చేసుకునేవాడు. చెప్పేవాడు. ఏయే సందర్భాల్లో ఎలా పనిచేసేవారో, అసలు ఎలా తయారయ్యారో, ఎలా అభివృద్ధి చెందారో, ఉద్యమానికి వాళ్ళు ఎలా దోహదం చేశారో వివరించాడు. కేవలం ఎంకౌంటర్లలో చనిపోయిన వాళ్ళ గురించి మాత్రమే కాదు, బయట వాళ్ళు చనిపోయినపుడు కూడా తను వివరించే పద్ధతి ఇలానే ఉండేది.

వాళ్ళ గురించిన పిట్ట కథలు, ఒక్కొక్కటి వచ్చేవి. అంత బాధలో కూడా నవ్వొచ్చేది. లేదా, అది తన ప్రయత్నమనుకుంటా. దుర్భరమైన దుఃఖంలోంచి క్యాడర్ని బయటపడేసేందుకు ఎంత ప్రయత్నం చేసేవాడో. ఈలోపల ఎన్ని దుఃఖపు సుళ్ళు తిరుగుతుండేవో తెలిసేది కాదు.

* * *

ఎన్ కౌంటర్ జరుగుతోందనో, జరిగిందనో వార్తలు వస్తుంటే అలర్ట్ అయిపోయేవాడు. అదేదో ఇక్కడే జరుగుతోందన్నంత సంసిద్ధతతో. ఎవరెవరు ఉండి ఉంటారు, ఎలా జరిగి ఉంటుంది, ఎంత ప్రాణ నష్టం

కలిగింది, అని లౌడ్ స్పీకింగ్ లాగా బయటకే అనేవాడు. ఎక్కడెక్కడి ఊరి పేర్లు, విషయాలు టకటకమని చెప్పేసే వాడు. తల్లికోడి పిల్లల్ని కనిపెట్టుకుని ఉన్నట్టు అనుక్షణం అప్రమత్తంగా ఉండేవాడు.

'ఇక తన ఉన్నచోటనే పోలీసులతో ఎన్ కౌంటర్లు జరిగినపుడు చూడాలి. అస్సలే కంగారు పడేవాడు కాదు. అప్పటికే టెర్రెయిన్ మీద పూర్తి అవగాహన ఉండడం వల్ల, పరిస్థితిని తన అదుపులో ఉంచుకుని, పూర్తి కమాండ్ తో సూచనలు ఇచ్చేవాడు. ఇక తన పథకానికి, యుద్ధ తంత్రానికి తిరుగు ఉండేది కాదు.

* * *

మనుషుల మీద అంచనాలు వేసే పద్ధతి గమనించేను. ఏమాత్రం ప్రజానుకూలంగా ఉన్నవారిని ఎవరినీ వాదులుకునే వాడు కాదు. ఎప్పుడో తన కాలేజీ రోజుల్లోని మిత్రుడో, లేకపోతే ఎప్పుడో ఇంటర్వ్యూ కోసమొచ్చిన జర్నలిస్టో, కేసుల్ని వాదించిన లాయరో, జైల్లో ఏదో సమస్య పరిష్కారం కోసం వచ్చిన ఏదో ఊరి వాళ్ళో – ఎవరూ తన జ్ఞాపక పరిధిలోంచి తప్పించుకునే సమస్యే లేదు.

ఒకసారి ఇంత కట్ట ఉత్తరాలు పెట్టేడు. లోకల్ గా అవి పంచేవాళ్లకూ తెలీదేమో, కొందరి పేర్లు నాకు చెప్పి వాటి మీద పొట్టి అక్షరాలు రాసేడు. ఎవరెవరికి ఇవ్వాలో నేను చెప్పాలి. ఒకటి రెండు పేర్ల దగ్గర నవ్వేను. 'వీళ్ళకి అవసరమా? వీళ్ళు ఎపుడో అన్నీ వదిలేసి వాళ్ళ వాళ్ళ పనుల్లో, ఉద్యోగాల్లో కూరుకుపోయారు కదా,' అన్నాను, కొంచెం సందేహం , కొంచెం వెటకారం కలిపి.

వెటకారానికి వెటకారం ఎప్పుడూ సమాధానం కాదు తన దగ్గర. ఏదో పనిచేసుకుంటున్నవాడల్లా ఆగేడు. నా కళ్ళల్లోకి చూశాడు.

'అలా అనుకోకూడదు. మానవసంబంధాల్లో అలా గీత గీసినట్టు, బరిలో దిగినట్టు ఉండదు. మనదంతా స్వచ్ఛందంగా చేస్తున్న ప్రయత్నం కదా. ఎవరెవరి సంసిద్ధతల మేరకు పనిచేస్తున్నాం. జీవితం గొప్ప బలంతో మనుషుల్ని నలిపివేస్తున్నది. రోజులు గడపడం పెద్ద యుద్ధం అయిపోతున్నది. ప్రజలు క్షణం సొంపకుండా రోజులు వెళ్లదీస్తున్నారు. మనకి దూరమైన వాళ్ళందరూ మనకి శత్రువులైపోరు. యుద్ధంలో మనవైపే ఉన్నారు, ఉండవల్సిన వాళ్ళు. ఎంతమేరకు మనం కలుపుకు పోగలమనేది మన బలాబలాలకు సంబంధించిన విషయం,' అన్నాడు.

'కొందరు తెలిసే పోతున్నారు కదా మనల్ని విడిచి.'

'ఉద్యమంలోకి వస్తుంటారు, పోతుంటారు. వెళ్తున్నవాళ్ళు. ఎటువైపు వెళ్తున్నారు అని చూసుకోవాలి. కానీ అంతిమంతంగా వాళ్ళు ప్రజల కోసం నిలబడుతున్నారా? లేకపోతే ప్రజా వ్యతిరేకులకు అండగా ఉంటున్నారా? శత్రువుతో చేతులు కలుపుతున్నారా? అందర్నీ ఒకే గాటన కట్టలేం.'

'నిజానికి వీళ్ళది చాలా చిన్న సంఖ్య. అసలు మనం దృష్టి పెట్టాల్సింది విశాల ప్రజా సమూహాల మీద. వీళ్ల సంఖ్య కోట్లలో ఉంది. ఇప్పటికే వీళ్లలో చాలామంది మనవైపు చాలా ఆశతో చూస్తున్నారు. పూర్తిగా భ్రష్టుపట్టిపోయిన రోత రాజకీయాలపై అసహ్యం పెంచుకున్నారు. కానీ వీళ్ళను ర్యాలీ చెయ్యడానికి మనదగ్గర సరైన వనరులు లేవనే చెప్పాలి. అది చాలా పెద్ద లక్ష్యం. చారిత్రక అవసరం. ఇంగ్లిషులో చెప్తారు, హెర్క్యులియన్ టాస్క్ అని. కేవలం మనవల్లనే ఇంత పెద్ద లక్ష్యాన్ని సాధించడం మన ఒక్కరి వల్లనే సాధ్యం కాదు. మన హెర్క్యులుస్ ప్రజల సమష్టి బలమే. అంటే చిత్ర ప్రసాద్ బొమ్మల్లో ఉన్నట్టు. ఇందుకోసం సమాజంతో చాలా సంభాషణ జరపాలి. చాలా శక్తుల్ని కూడదీయాలి. ఇది సహించదగ్గ సమాజం కాదని ఇప్పటికే ప్రజలకి అర్థం అయింది. అయితే మనం చెప్పాల్సిందేమిటంటే, సహించక ఊరుకుంటే సరిపోదని, కూకటివేళ్లతో పెకలించాలని వాళ్ళని ఒప్పించాలి. దీనికి సమాజంలో అక్కడా అక్కడా ఇమిడిపోయిన మన పాత మిత్రుల సహాయం కావాలి. వాళ్ళని కదిలించాలి.' అని చెప్పేడు సూర్యుడు.

'కానీ, వాళ్ళిప్పటికే ఏదో కెరీర్లో చేరిపోయి ఆ ఆలోచనల్లోనే మునిగిపోయి ఉండడం తెలుసునాకు. మీరు ఉత్తరాలు రాసిన కనీసం

నివేదిక

### జనవరి 11, 12 తేదీలలో హైదరాబాద్‌లో జరిగిన

# విరసం 18వ సాహిత్య పాఠశాల నివేదిక

దండకారణ్య విప్లవోద్యమ నేపథ్యంలో ఆధునిక తెలుగు సాహిత్యంలో నూతన మానవ ఆవిష్కారం అనే అంశం కేంద్రంగా జనవరి 11, 12 తేదీల్లో హైదరాబాద్‌లో విరసం రాష్ట్ర సాహిత్య పాఠశాల జరిగింది. ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమాల్ని నిర్మించిన రచయిత, బుద్ధిజీవి కా. రాజ్ బహదూర్‌గౌర్ ప్రాంగణంలో (సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో), దండకారణ్యంలో నూతన సమాజ నిర్మాణానికి ఒక చేత ఆయుధం, ఇంకోచేత కలం పట్టిన సాయుధ కథకుడు అమరుడు కా. గుండేటి శంకర్(షంషేర్) హాలులో, దండకారణ్య సామాజిక ప్రయోగంలో నూతన మానవుడిగా రూపొందిన బస్తర్ విప్లవోద్యమ నాయకుడు అమరుడు కా. విజయ మాడ్కం వేదిక మీద ఈ రెండు రోజుల సాహిత్య పాఠశాల జరిగింది.

జనవరి 11, శుక్రవారం ఉదయం 11.30 గంటలకు అంతర్జాతీయ కమ్యూనిస్టు పతాకాన్ని అమరుడు కా. గుండేటి శంకర్ తల్లి మల్లమ్మ ఆవిష్కరించారు. శంకర్ దండకారణ్యంలో పాము కాటుకు గురై చనిపోయాడు. అమరుల స్థూపాన్ని అమరుడు కా. కనకస్వామి వదిన వెంకటమ్మ ఆవిష్కరించారు. కా. కనక స్వామి ముప్పై ఏళ్ళుగా టెక్ నిర్వహణలో ఉంటూ కొద్ది నెలల క్రితం మలేరియా వ్యాధితో దండకారణ్యంలో అమరుడయ్యాడు. విరసం పతాకాన్ని కా. చలసాని ప్రసాద్ ఆవిష్కరించారు. ప్రజాకళామండలి కళాకారులు కా. కోటి తదితరులు ఓ అరుణపతాకమా..అంటూ అంతర్జాతీయ శ్రామిక పతాకంపై పాట పాడారు. అనంతరం అమర కళావేత్తలారా.. అంటూ ప్రజా, విప్లవ పోరాటాల్లో నేలకొరిగిన సాంస్కృతిక యోధుల అమరత్వాన్ని గానం చేశారు. కా. దప్పు రమేష్, విరసం సభ్యుడు కా. సుదర్శన్ ఆలపించిన 'రచయితలారా లాల్‌సలాం..' గీతంతో సాహిత్య పాఠశాల ప్రారంభమైంది.

ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించిన కా. రివేరా మాట్లాడుతూ అసంఖ్యాక ప్రజలను ప్రజా రచయితలుగా, కళాకారులుగా కమ్యూనిస్టు పార్టీ రూపొందించిందని, విప్లవోద్యమం ఎజెండా మీదికి వచ్చాక ఈ ప్రక్రియ మరింత వేగవంతం అయిందని అన్నారు. కమ్యూనిస్టు ఉద్యమం ఆధునికతకు గురజాడను ఆద్యుడిగా గుర్తించిందని అన్నారు. ఆయనకు జాతీయోద్యమ నాయకత్వంపై తీవ్రమైన విమర్శలు ఉండేవని, స్వాతంత్ర్యం వస్తే వ్యవస్థ మారుతుందా? అనే అర్థంలో ఆనాడే గురజాడ ప్రశ్నించాడని అన్నారు. నూతన మానవ ఆవిష్కారాన్ని ఆధునిక సాహిత్యంలో పరిశీలించేటప్పుడు సహజంగానే గురజాడ దగ్గర ప్రారంభమై దండకారణ్యం దగ్గరికి రావాల్సి ఉంటుందని అన్నారు.

ఆరంభం సమావేశంలో విరసం కార్యదర్శి కా. వరలక్ష్మి మాట్లాడుతూ సాహిత్యంలో నూతన మానవ ఆవిష్కారం అనే అంశం కేంద్రంగా సాహిత్య పాఠశాలలో చర్చించబోయే పాఠాల నేపథ్యాన్ని వివరించారు. ఢిల్లీలో జరిగిన అమానవీయ రేప్ సంఘటనను ప్రస్తావించి, బస్తర్‌లో అత్యాచారాలుండవని కేవలం పోలీసులు, భద్రతా దళాల దారుణ లైంగికదాడులు మాత్రమే ఉంటాయని ఆమె అన్నారు. చరిత్ర నిర్మాణం వెనుక ఉత్పత్తిలో పాల్గొనే మానవులుంటారని, ఆ మనుషులు వర్గపోరాటంలో భాగంగా

---

ఇద్దరి గురించయితే నాకు పూర్తిగా తెలుసు. అసలు వాళ్ళు మీకింకా గుర్తున్నారా? నేనైతే పూర్తిగా మరిచేపోయాను. ఎంతో మందిని ఉత్తేజ పరిచి చివరకు వాళ్ళు భద్రజీవితంలో చేరిపోయారు,' అన్నాను.

'కావచ్చు. వాళ్ళలో నన్ను ఉత్తేజ పరిచిన వాళ్ళు కూడా ఉన్నారు. కానీ ఆ భావజాలంలో ఉన్నారని వాళ్లని ఇక అలా వదిలేస్తామా? వదిలేస్తే ఇంకా ఇంకా కూరుకు పోతారు కదా అందులో. ఎంతో కొంత మేర వాళ్ళ సంభాషణ పెట్టుకుంటేనే వాళ్ళు ప్రజలకు మిగులుతారు. పైగా మనం అడిగితే కొంచెం బాధ్యత పడతారు కూడా. పూర్తి స్థాయిలో మనకోసం పనిచేయక పోలేకపోవచ్చు. కానీ వాళ్ళ కొత్త ప్రపంచంలోకి మనకు ప్రవేశం దొరుకుతుంది. ఏదో కొంత పని, కనీసం అనువాదాల్లాంటివే అనుకో చేయించుకోవచ్చు. సైనికులకు మేజోళ్ళు కుట్టేవాళ్లు కూడా అవసరమే కదా,' అని, నవ్వేడు కొంటెగా. నాకు రష్యన్, చైనీస్ సాహిత్యం అంటే చాలా ఇష్టమని తెలుసు తనకి అందుకే నాకు మేజోళ్ళని గుర్తుచేశాడు.

'వాళ్ళతో సంబంధం పెట్టుకుంటే. మనమున్న పరిస్థితిలో ఏ చిన్న గడ్డిపరక దొరికినా మంచిదే కదా,' అన్నాడు.

'నాకిప్పటికీ గుర్తుంది తనెంత ఓపిగ్గా వివరిస్తాడో. ఆ వివరించడం ఎంత సులభంగా కనిపిస్తుందంటే ఇక convince కాకుండా ఉండలేం. అంటే అప్పటికప్పుడు మనకి ఒక కొత్త ప్రపంచం పరిచయం అయిపోతుంది. చెయ్యాల్సిన పని విస్తారంగా, సులువుగా కనిపిస్తుంది. ప్రజలకోసం పనిచేసే వాళ్ళ బాధ్యత ఇంకా ఎంత ఎక్కువో తెలుస్తుంది,' అన్నాడు రమేష్ నాతో.

'ఏ చిన్న ఆధారాన్నీ వదులుకోకూడదనేవాడు. మనుషుల గుర్తుల్నే కాదు వాళ్ళ సామర్థ్యాలు గుర్తుపెట్టుకుని ఉద్యమానికి ఎక్కడో అక్కడ ఉపయోగించుకోవాలని, అందుకోసం ఎంతో ఓపిగ్గా పనిచేయాలని తనదగ్గరనుంచి నేర్చుకున్నాను. ఆఖరికి నిన్ను గుర్తు పెట్టుకోవడంకూడా అందులో భాగమే,' అని నవ్వేడు రమేష్.

ఆ నవ్వులో నాకు సూర్యుడి ఛాయ కనిపించింది.

(ఇంకా ఉంది) 

తయారవుతారని అన్నారు. కా. విజయ్ మాడ్కమ్, కా. గుండేటి శంకర్, కా. కనకస్వామి అట్లా రూపొందినవాళ్లేనని అన్నారు. దండకారణ్య విప్లవోద్యమంలో కీలక భాగస్వామ్యం వహిస్తున్న మహిళల్లో కా. కుమ్లి, కా. రణిత కొత్త సమాజాన్ని నిర్మించడం కోసం తమను తాము నూతన మానవులుగా రూపొందించుకున్నారని అన్నారు.

మధ్యాహ్నం సమావేశానికి అధ్యక్షత వహించిన కా. ఉజ్వల్ మాట్లాడుతూ ఆనాటి వ్యవస్థలోని రుగ్మతల్ని సున్నితంగా, తీవ్రంగా గురజాడ వెలుగులోకి తెచ్చాడని, 'దేశమంటే మట్టి కాదోయ్'... 'దేశమంటే మనుషులని' దేశభక్తికి కొత్త నిర్వచనం చెప్పాడని అన్నారు.

'ఆధునికత – గురజాడ' అనే అంశం మీద వక్త కా. పాణి మాట్లాడారు. గురజాడ – ఆధునికత అని కాకుండా, ఆధునికత – గురజాడ అనడంలోనే ప్రత్యేకత ఉందని, గురజాడ సాహిత్యంలో ఆధునిక భావనలను విశ్లేషించడం ఒక పద్ధతి అయితే ఆధునికతా క్రమంలో గురజాడ స్థానాన్ని విశ్లేషించడం రెండో పద్ధతి అన్నారు. అయితే ఈ సాహిత్య పాఠశాల ఇతివృత్తాన్ని గురజాడ దగ్గర నిలబడి చర్చించడం లేదని, దండకారణ్యంలోని నూతన మానవ ఆవిష్కారం అనే ప్రయోగం దగ్గర నిలబడి ఆధునికత తెలుగు సాహిత్య చిత్రణలో నూతన మానవ ఆవిష్కారం గురించి చర్చించాలని అన్నారు.

గురజాడకు పూర్వం చాలా ఉజ్వలమైన ప్రజాసాహిత్యం ఉందని, శ్రమ నుంచి పుట్టిన సాహిత్యం కళల్లో మానవ స్వేచ్ఛ, వ్యవస్థపట్ల నిరసన ఉన్నాయని అన్నారు. ఆనాటి వ్యవస్థ విడుదల చేసిన భావజాలం ప్రభావం ఆ కళల మీద ఉన్నా ఈ సుగుణం ఉందని అన్నారు.

జానపద సంప్రదాయానికి, బ్రాహ్మణ, పండిత, రాజాశ్రయానికి వెలుపల సాహిత్యం రాసిన, పాల్కురి సోమన, వేమనవంటివారి సంప్రదాయాన్ని గురజాడ కొనసాగించాడని అన్నారు. అయితే దాన్ని యథాతథంగా కొనసాగించలేదని.. ఎందుకంటే ఆధునికత అనే అతి పెద్ద మూలమలుపు మీద గురజాడ చరిత్రలోకి వచ్చాడని, అందువల్ల తన కంటే ముందున్న ప్రజాసాహిత్య సంప్రదాయంలో లేని ఆధునికతను అందించాడని అన్నారు. గురజాడ వలసపాలకులపట్ల భక్తి భావాన్ని ప్రదర్శించాడు. అది ఆయనకున్న పెద్ద పరిమితి. అయితే ఆయనకు బ్రిటిష్‌వారిది పరాయిపాలన అని తెలియదని అనుకోలేము. ఆయన ప్రధానంగా స్థానిక సమాజంలోని సాంఘిక దురాచారాలను, అశాస్త్రీయ భావజాలాన్ని లక్ష్యంగా పెట్టుకున్నాడు. వాటి మీద వలసవాదం ద్వారా వచ్చిన ఆధునికతను సవ్యంగా అర్థం చేసుకొని తన ఉద్యమాన్ని ప్రారంభించాడు. అందువల్ల ఆయన కాలంలో ఆధునికతను ఆయనలా మరెవరూ అర్థం చేసుకోలేకపోయారు. ఆయన మిగతా వాళ్లలాగా సాంఘిక వ్యవస్థలను విమర్శించినవాడు మాత్రమే కాదు. ఆయన వాస్తవానికి నాగరికతా విమర్శకుడు. ఈ విషయంలో పూలే ఆయనకు దగ్గరిగా ఉంటాడు.

యూరోప్‌లో ఆధునికత ఆనాటి నాగరికతా గర్భాన్ని చీల్చుకుంటూ ప్రకృతి రహస్యాలను, సామాజిక కట్టుబాట్లను ఛేదించగల హేతుబుద్ధిని ప్రసాదించింది. స్వేచ్ఛా మానవుణ్ణి రూపొందించింది. యూరప్‌లో ఒక పక్క భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు, ఆధునికతా వికాసం ఏకకాలంలో జరిగాయి. అందువల్ల ఆధునికతలోని సుగుణాలను పెట్టుబడిదారీ విధానం తనలో వ్యవస్థీకృతం చేసుకున్నది. ఏది పెట్టుబడిదారీ విధానమో, ఏది ఆధునికతో తెలియని విచిత్ర పరిస్థితి ఏర్పడింది. మనలాంటి దేశాల్లోకి వచ్చిన వలసవాదాన్ని, ఆధునికతను వేర్వేరుగా చూడడంలోనే గురజాడ విశిష్టత ఉంది. ఆధునికతలోని శాస్త్రీయతకు అన్నిటినీ విమర్శనాత్మకంగా చూసే సుగుణం ఉంది. అంతేకాదు, తనను తాను కూడా విమర్శనాత్మకంగా చూసుకుంటుంది.

వలసవాదంతో మొదలైన బూర్జువా ఆధునికతా క్రమాన్ని అనేక ప్రజాపోరాటాలు ముందుకు తీసుకొనిపోయాయి. ఇవాళ దండకారణ్యంలో జరుగుతున్న సామాజిక ప్రయోగం వల్ల అక్కడ ఒక ఆధునిక వ్యవస్థ నిలదొక్కుకుంటున్నది. ఆధునిక నూతన మానవుడు ఆవిర్భవిస్తున్నాడు. గురజాడ సాహిత్యం, ఇవాళ దండకారణ్యంలో నుంచి వస్తున్న సాహిత్యం ఆధునికతా శిశువులే. బూర్జువా ఆధునికతను విప్లవకరమైన దిశగా దండకారణ్యం ముందుకు తీసుకపోతోంది.. అని పాణి తన ప్రసంగాన్ని ముగించారు.

భోజన విరామానంతరం పుస్తక ఆవిష్కరణ సెషన్‌ను కా. సి.ఎస్.ఆర్. ప్రసాద్ నిర్వహించారు.

కా. అల్లం రాజయ్య, అమరుడు కా. సాహు కలిసి రాసిన కొమురం భీం నవలను పర్‌స్పెక్టివ్ సంస్థ ప్రచురించింది. ఈ నవలను అమరుడు కా. పెద్ది శంకర్ తల్లి పెద్దిలక్ష్మి ఆవిష్కరించగా, నమస్తే తెలంగాణ ఎడిటర్ అల్లం నారాయణ నవల ప్రాసంగితను వివరించారు. ఆదివాసీ పోరాటాల నేపథ్యంలో రాసిన ఈ నవల పునర్ముద్రణ అయిన ప్రతిసారీ ఒక ఉద్యమ సందర్భం ముందుకు వస్తోందని ఆయన వివరించారు.

విరసం సభ్యుడు కె. క్యూబ్ వర్మ కవిత్వ సంపుటి **'రెప్పల వంతెన'**ను ప్రముఖ కవి యాకూబ్, వరవరరావు రచించిన **గ్రీన్‌హంట్ వ్యతిరేక వ్యాసాల సంపుటి** (యహ్ క్యా జగాహై దోస్తో), **'పరాధీనత–స్వావలంబన'**ను హెచ్.ఎం.టి.వి అసోసియేట్ ఎడిటర్ టంకశాల అశోక్, విరసం కార్యదర్శి వరలక్ష్మి రాసిన **'సముద్రంతో సంభాషణ'**ను పర్యావరణ ఉద్యమ కార్యకర్త డా. సత్యలక్ష్మి, పాణి కవిత్వ సంపుటి **'అబూజ్‌మాడ్'**ను ప్రముఖ కవి శివారెడ్డి, విరసం అధ్యక్షుడుగా శ్రీశ్రీ చేసిన ప్రసంగాలను కా. రత్నమాల, విరసం నిర్వహించిన వివిధ వర్క్‌షాపుల **కథల పంట2**ను వాసిరెడ్డి నవీన్, గ్రీన్‌హంట్ వ్యతిరేక కవిత్వం **'కవితా ఝుంకార్'**ను ప్రముఖ పాత్రికేయుడు సతీష్‌చందర్‌లు ఆవిష్కరించారు.

తదనంతరం **'వలసకాలపు తెలుగు సాహిత్యంలో ప్రజా సాంప్రదాయాలు'** అనే అంశంపై జరిగిన సదస్సుకు కా. నల్లూరి రుక్మిణి అధ్యక్షత వహించారు.

వలస కాలపు భారత దేశం గురించి మార్క్స్ కొన్ని ముఖ్యమైన పరిశీలనలు చేశాడని, మన్రో చేపట్టిన పాలనా సంస్కరణలు ఆనాటి పరిస్థితుల్లో మార్పులు తీసుకొని వచ్చాయని రుక్మిణి అన్నారు. అయితే

జనాభా సర్వేల్లో మాల, మాదిగలకు చోటు లేదని, అంటే వాళ్లని కనీసం మనుషులుగా లెక్కించలేదని అన్నారు. కాబట్టి వలసపాలన కాలంలోని సాహిత్యంలో ప్రజాస్వామిక ధోరణుల గురించి చాలా లోతైన పరిశీలన అవసరం అన్నారు. దళితులు, ముస్లింలు, మహిళలు అప్పుడప్పుడే చైతన్యవంతమైతున్నందున వాళ్ల తరపున రాసిన సాహిత్యం, వాళ్లే రాసుకున్న సాహిత్యం వెలికి తీయాల్సి ఉందని అన్నారు.

వక్త ప్రొఫెసర్ కాత్యాయని విద్మహే మాట్లాడుతూ నూతన మానవ ఆవిష్కారానికి సాహిత్యం దోహదం చేస్తుందని, దీనికి గతం తాలుకు 'భరోసా' ఇస్తుందని, ఓడిపోయినా ముందుకు పోగలమనే భవిష్యత్తుపై ఆశ కలిగిస్తుందని అన్నారు.

స్వాతంత్ర్య కాంక్ష బలంగా వ్యక్తమైన 1857-1947 కాలాన్ని ఒక కొండ గుర్తుగా తీసుకోవాలని, 1947 తర్వాత వలస అంతరించి పోయిందా అంటే 'అర్ధ వలస-అర్ధ భూస్వామ్య' చర్చ ఎలాగూ ఉండనే ఉందని, వలస పాలనకు-ఆధునికతకున్న తేడాను గుర్తిస్తూనే వలసపాలన కాలంలో ప్రజాస్వామిక సాహిత్య ధోరణుల గురించి చర్చించాలని అన్నారు.

డార్విన్ పరిణామ సిద్ధాంతం బ్రాహ్మణీయ విధి నిర్ణాయక సిద్ధాంతాల్ని బద్దలు కొట్టింది. తక్కువకులంలో పుట్టడం,పేదవాళ్ళుగా పుట్టడం, స్త్రీలుగా పుట్టడం గురించి బ్రాహ్మణీయ భావజాలం చేసిన ప్రచారాన్ని వలసపాలన కాలంలో స్థానిక ప్రజలు ప్రశ్నించడం ప్రారంభించారు. అయితే ఆనాటికి ఉన్న పరిమితి వల్ల బాధితుల తరపున ఇతర వర్గాల నుంచి, కులాల నుంచి, స్త్రీల తరపున పురుషులు సంస్కరణ భావాలతో రచనలు చేశారు.

వీరేశలింగంగారికి ఉన్న పరిధిని కొడవటిగంటి కుటుంబరావు అధిగమించి 1925-1935లలోనే వ్యక్తి స్వేచ్ఛ, ప్రజాస్వామిక భావనలు, ఆధునికత, సమానత్వమనే న్యాయ దృష్టిని ప్రసరించాడు. మనిషికి బుద్ధి, వివేకం ఉన్నందువల్లనే మానవ ప్రవృత్తికి అవమానకరమైన విషయాల్ని తొలగించుకుంటాడని సూచించాడు. వివాహంలో వధూ వరుల ఇష్టాయిష్టాలకు ప్రాధాన్యత ఇవ్వాలని కొకు చెప్పాడు. వీరేశలింగం మొదట పద్య రూపాన్ని ఆశ్రయించినా తర్వాత వచనంలోకి వచ్చాడు. దీనివల్ల మహిళా పాఠకులకు దగ్గరయ్యాడు. 'ఆడవాళ్లు చదువుకోవడానికి వీలుగా ఉండేలా రాసేదే నవల' అనే నిర్వచనం ముందుకు వచ్చింది. ఆ తర్వాత గొల్ల, కుర్మల ఒగ్గు కథ మొదలైన ప్రజాస్వామిక సాహిత్య సాంప్రదాయాలు ముందుకు వచ్చాయి. తెలంగాణలో దున్నేవాడిదే భూమి నినాదంతో ఉద్యమం జరగడం వల్ల అట్టడుగు కులాల నుంచి సాహిత్యకారులు ముందుకు వచ్చారు. ఇది అతిపెద్ద ప్రజాస్వామ్య సాహిత్య సంప్రదాయం. అగ్రకులాలకు, పురుషులకు పరిమితమైన సాహిత్యంలో కింది కులాలనబడేవారికి, మహిళలకు చోటుదొరికింది. వలసపాలన కాలంలో ఇలాంటి విశిష్టమైన ధోరణులుఎన్నో ఉన్నాయి. జాషువా, కుసుమ ధర్మన్న వంటి వారు సాంఘిక కట్టుబాట్ల మీద తిరుగుబాటుతో సాహిత్యం రాశారు. కందుకూరి, గురజాడల కంటే తీవ్రంగా చలం స్త్రీ కోణాన్ని దర్శించారు. గురజాడలో బీజప్రాయంగా ఉన్న నూతన మానవుని కుటుంబరావు స్పష్టంగా చూస్తే, విముక్తి దిశలో బండారు అచ్చమాంబ, వట్టికోట విశాలక్ష్మి చూసి స్వావలంబనను ప్రతిపాదించారు. స్త్రీలు స్వావలంబన క్రమంలో వనపర్తి వరలక్ష్మి కథలు రాశారు. 'నాకు మీటింగ్ ఉంది, పోవాలని', 'కొన్ని పత్రికల్ని మేం చదవమని, వాటిని పిల్లల అశుద్ధాన్ని తీయడానికి ఉపయోగించాలని' తీర్మానించుకున్నారని ఆమె ఒక కథలో అన్నారు.

నూతన మానవ ఆవిష్కరణ దిశగా ప్రజాస్వామిక దృక్పథం అగ్రవర్ణాలవారు, దళితులతో కలిసి పని చేసేవిధంగా, పురుషులు తమ ఆధిపత్యాన్ని వదులుకొని స్త్రీల కోసం ఆలోచించేవిధంగా, స్త్రీలు తమలోని అప్రజాస్వామిక భావనలు వదులుకునే విధంగా రూపొందే క్రమంలో తెలుగులో చాలా మంచి సాహిత్యం వచ్చింది. దళిత, వెనుకబడిన కులాల వారు తమ గురించి తామే రాసుకొనే పౌరవడి వలసపాలన కాలంలోనే మొదలైంది.

భాగ్య రెడ్డి వర్మ 1906లోనే మాల, మాదిగ సాహిత్య సభలు పెట్టి పంచములు అనే పదం వ్యతిరేకార్థమని చెప్పాడు. ఆర్య దేవుళ్ళు బ్రాహ్మణ దేవుళ్ళని, వాళ్ళని వ్యతిరేకించాలన్నాడు. మాలలతోపాటు (1925) సమాన హక్కుల కోసం మాతంగి (మాదిగ) జనసభ (ఇప్పటి ఎంఆర్‌పిఎస్‌లాగా) వంటివి ముందుకు వచ్చాయి. ఇవన్నీ సాహిత్యాన్ని పరిపుష్టం చేశాయని కాత్యాయని విద్మహే అన్నారు.

సాయంకాలం కా. కాశీం, కా. అరసవెల్లి క్రిష్ణల ఆధ్వర్యంలో కవి, గాయక సభ జరిగింది. అనేక సమకాలీన సమస్యలపై కళాకారులు పాటలు పాడారు. కవిత్వ పఠనం జరిగింది. సుమారు రెండు గంటలపాటు కవిగాయక సభ ఉత్తేజపూరితంగా జరిగింది.

సాహిత్య పాఠశాల రెండో రోజు ఉదయం 'హైదరాబాదు రాష్ట్రంలో ప్రజాస్వామిక సాంప్రదాయాలు' అనే అంశం మీద జరిగిన సదస్సుకు కా. వరవరరావు అధ్యక్షత వహించారు.

కా. వి.వి. తన అధ్యక్షోపన్యాసంలో ఇప్పుడున్న తెలంగాణకంటే విశాలమైన తెలుగు నేల అంతా తెలంగాణే అని, వరంగల్ నుండి పాలకుర్తి సోమన దేశీయ జాన తెనుగులో సాహిత్యం రాశాడని అన్నారు. రాజాశ్రయానికి బయట ప్రజా జీవితంలో ఉంటూ ప్రజాస్వామిక సంప్రదాయానికి దారి వేశాడని అన్నారు. సోమన పుట్టిన ఊరులోనే పాలకుర్తి అయిలమ్మ పుట్టిందని, అట్లాగే భూస్వాములకు వ్యతిరేకంగాపోరాడి అమరుడైన దొడ్డి కొమురయ్య పుట్టిన కడివెండిలోనే ఎర్రంరెడ్డి సంతోష రెడ్డి పుట్టాడని, దొడ్డి కొమురయ్య అమరుడైన జులై 4న విరసం పుట్టిందని, ఎర్రంరెడ్డి సంతోష్‌రెడ్డి, నల్లా ఆదిరెడ్డి, 1999లో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను రచించారని అన్నారు. దండకారణ్యంలో ఆ ప్రత్యామ్నాయ అభివృద్ధి జనతన సర్కార్‌గా, 2012 నుండి విప్లవ జనతన సర్కారుగా రూపొంది అమలవుతోందని అన్నారు.

800 సంవత్సరాల క్రితం సమ్మక్క, సారక్క కాకతీయులపై పోరాడి అమరులు అయ్యారని చెపుతూ తెలుగు అస్తిత్వ ఉద్యమాలు నురవరం ప్రతాపరెడ్డి, గురజాడ అప్పారావుల వల్ల ప్రస్ఫుటమయ్యాయని అన్నారు. ఆధునిక మహిళ చరిత్ర తిరగ

రాస్తుందని గురజాడ అంటే, అది దండకారణ్యంలో ఇవాళ వాస్తవమైందని ఆయన అన్నారు. హైదరాబాద్ రాష్ట్రంలో ప్రజాస్వామిక సంప్రదాయాలు అంశం మీద నాళేశ్వరం శంకరం మాట్లాడుతూ శ్రీశ్రీ 'నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం అన్నట్లు వేల ఏండ్ల పరాయిపాలనకు గురైన తెలంగాణ ప్రాంత ప్రజలు మాతృ అస్తిత్వాన్ని కాపాడుకోడానికి ప్రయత్నిస్తున్నారని అన్నారు.

శాతవాహనులు, విజయనగర రాజులు, కుతుబ్ షాహీలు వీళ్లందరి కాలంలో కన్నా కుతుబ్ షాహీల కాలంలో లభించిన గౌరవం మిగతా వాళ్ళ కాలంలో లభించలేదని ఆయన అన్నారు.

తెలంగాణలో వేములవాడ భీమకవి, సోమన, హాలుడు, గోన బుద్ధారెడ్డి వంటి కవులు నన్నయ్యకాలం నుండి ఉన్నారని బమ్మెర పోతన ఒక ప్రత్యామ్నాయ సంస్కృతిని తీసుకొని వచ్చాడని అన్నారు. వీరందరూ నిర్మించిన ప్రజా సాంప్రదాయం తెలంగాణలో ఇప్పటికీ చాలా ఉన్నత రూపంలో కొనసాగుతోందని ఆయన అన్నారు.

విప్లవకారులు భగత్‌సింగ్‌ను ఎలా చెప్పుకుంటారో తెలంగాణవాళ్ళు తుర్రేబాజ్‌ఖాన్‌ను అట్లా చెప్పుకుంటారని తెలంగాణవారు మిగతా ప్రాంత పాలకుల నుండి తమ ప్రాంతాన్ని కాపాడుకునే ప్రయత్నం చేస్తున్నారని, ఇది ఆర్థిక రాజకీయరంగాల్లోని వివక్షకు వ్యతిరేకంగా కూడా జరుగుతున్న పోరాటమని ఆయన అన్నారు. 1857లో థియోసాఫికల్ సోషల్ లీగ్, యంగ్ విమన్ లీగ్‌వంటి ఉద్యమ సంస్థలు ఏర్పడ్డాయన్నారు. అదే సందర్భంలో భాగ్యరెడ్డివర్మ జగన్ మిత్రమండలి, నిజాం రాష్ట్ర మహా సభ (ఆంధ్ర మహాసభ) వంటి సంస్థలు నెలకొల్పి తెలంగాణలో మరాఠి, ఆంగ్లం, ఉర్దూ భాషల పెత్తనాన్ని ప్రశ్నించిన తెలంగాణా వైతాళికులు ఎందరో ఉన్నారని నాళేశ్వరం శంకరం అన్నారు.

మాడపాటి హనుమంతరావు వంటివారు వెట్టి చాకిరి, భూ సంబంధ ఆగడాలు, పన్ను విధానాలు ఎదిరించే ఉద్యమాలు చేసిండ్లని, అందులో సాయుధ పోరాటానికి దారి తీసిన కామారెడ్డిగూడెం బందగీ పోరాటం కడివెండి దొడ్డి కొమురయ్య పోరాటం గురించి అందరికీ తెలిసిందేనని అన్నారు.

చాకలి ఐలమ్మ సాహసం విస్తృత పోరాటాలకు స్ఫూర్తి అని, భూస్వామ్యాన్ని ఎదిరించే సాహిత్యం తెలంగాణలో ఎంతో వచ్చిందని ఒక వట్టికోట ఆళ్వార్‌స్వామి నవల మాత్రమే మిగతా ప్రాంతాలకు తెలుసునని, తెలంగాణ పోరాటంలో దాశరథి వంటివారు సాహిత్య సృజన చేశారని, తెలంగాణ కవులు, రచనలు చేయడమేగాక ఉద్యమకారులుగా కూడా ఉన్నారని విశ్లేషించారు. తెలంగాణ కవులకు జెయిలు జీవితం చాలా సాధారణమని, కవి.. కార్యకర్త కలగలసిన సాహిత్య వ్యక్తిత్వం తెలంగాణ సొంతమని ఆయన అన్నారు.

అట్లాగే, నిజాం పాదుషాను ఖబడ్దార్ అని బెదిరించిన కవులు తెలంగాణలోనే ఉన్నారని, 'నైజాం సర్కారోడా' పాట రాసిన బండి యాదగిరి తెలంగాణ కవి గాయకుడని, సుద్దాల హనుమంతు అదే కోవలోనివాడని, 70 ఏళ్ళ తర్వాతవాళ్ళ స్ఫూర్తితో తెలంగాణలో కవి గాయకులు అసంఖ్యాకంగా పుట్టుకొచ్చారని ఆయన అన్నారు.

ఆంధ్రలో ఉద్యమాలకు, తెలంగాణలో ఉద్యమాలకు తేడా ఉంటూ వచ్చిందని, ఉదాహరణకు ఆంధ్రలో గిడుగు ఆధ్వర్యంలో భాషోద్యమం వస్తే, తెలంగాణలో వట్టికోట ఆళ్వార్‌స్వామి చేపట్టిన గ్రంథాలయ ఉద్యమం నడిచిందని, తెలంగాణలో నిర్బంధ పరిస్థితి 'ప్రజల మనిషి' నవలలో ప్రతిఫలించిందని, తెలంగాణ పలుకుబడిని సుసంపన్నం చేసిన కాళోజీలో ప్రశ్నించే గుణం తీవ్రంగా ఉంటుందని, సిధారెడ్డి చెప్పినట్లు కాళోజి ఒక లోడెడ్ గన్‌లాంటివాడని, కాళోజి కవితలోని మొదటి పాదంలో ప్రతిపాదన, రెండోపాదంలో అర్ధ వివరణ, మూడవ పాదంలో పరిష్కారం, నాలుగవ పాదంలో మకుటంతో ముగుస్తుందని ఆయన అన్నారు.

చారిత్రక క్రమంలో ముందుకు వచ్చిన 1930 నాటి ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమం ప్రేమ్‌చంద్‌వంటి ప్రగతిశీలురైన ఇష్టా రచయితల వల్ల రెండో ప్రపంచ యుద్ధకాలం నాటికి, 1945 నాటికి తెలంగాణలో భూస్వామ్య వ్యతిరేక సాయుధ పోరాటం, నిజమైన వర్గ పోరాటంగా పరిణామం చెందిందని సమావేశ అధ్యక్షుడు కా. వి. వి. ముగింపుగా అన్నారు.

ఆ తర్వాత మరి కొన్ని పుస్తకావిష్కరణలు జరిగాయి. ప్రముఖ మార్క్సిస్టు విమర్శకుడు డా. శ్రీనివాస్ రాసిన **'మార్క్సిస్టు సాహిత్య విమర్శ'** అనే పుస్తకాన్ని చేకూరి రామారావుగారు ఆవిష్కంచారు. అట్లాగే కా. ఎన్. వేణుగోపాల్ రాసిన **'అండర్ స్టాండింగ్ ద మావోయిస్ట్స్'** అనే ఇంగ్లిషు పుస్తకాన్ని ప్రొ. హరగోపాల్ ఆవిష్కరించారు.

తదుపరి సమావేశం 'వలసానంతర సాహిత్యంలో ప్రజాస్వామిక సాంప్రదాయాలు' అనే అంశంపై జరిగింది. ఈ సమావేశానికి కా. కళ్యాణరావు అధ్యక్షోపన్యాసం చేస్తూ నక్సల్‌బరితోనే నూతన మానవుడు ప్రారంభమయ్యాడని, అడుగడుగునా ప్రాణాలు అర్పిస్తూ ముందుకు సాగుతున్నారని, వారందరికీ 'లాల్ సలామ్' అంటూ తన ప్రసంగాన్ని ప్రారంభించారు.

క్రీస్తు పూర్వం, క్రీస్తు శకంలాగా వలసానంతరం అంటే వలస అంతరించి పోయిందనుకోవడానికి వీలు లేదని గాంధీ వలసవాద దళారీ అని, రవీంద్రుడు 'జనగణమన' గీతంలో బ్రిటిషు ప్రభువుని పొగిడాడని అది మన జాతీయ గీతమయ్యిందని, కవిగా గురజాడను తాను ఇష్టపడ్డప్పటికీ జార్జి రాజును, మేరీ రాణిని పొగిడారని అన్నారు. గురజాడకు ముందు ప్రజా సాహిత్యం ఉన్నదని, వీధి భాగవతం లాంటివి ఎన్నో ప్రజా కళారూపాలు ఉన్నాయని అన్నారు.

వక్త కా. చెంచయ్య మాట్లాడుతూ ధనస్వామ్య వ్యవస్థలో రెండు సాంప్రదాయాలు ఉంటాయని, ప్రజాసంప్రదాయం విప్లవంగా మారిందని అన్నారు.

జులై 4న, దొడ్డి కొమురయ్య అమరత్వంతో తెలంగాణ సాయుధ పోరాటం ప్రారంభం కావడాన్ని ఒకకొండ గుర్తుగా మనం గుర్తు పెట్టుకుంటామని, ఇది నిజాం వ్యతిరేక పోరాటంగా కనిపించినా, అది భూమి, భుక్తి పోరాటమని, నిజాంను అణిచివేయడానికి కాంగ్రెస్‌కు కేవలం నాలుగైదు రోజులు పడితే, తెలంగాణ సాయుధ పోరాటాన్ని అణిచివేయడానికి నాలుగు

సంవత్సరాలకు పైగా సమయం పట్టిందని, దానికి రుజువు సెప్టెంబర్ 17 తర్వాత కూడా తెలంగాణ సాయుధ పోరాటం కొనసాగడమేనని ఆయన అన్నారు.

అయితే సెప్టెంబర్ 17న జరిగింది విమోచనమని అనుకున్న కమ్యూనిస్టులు కూడా ఉన్నారని ఆయన అన్నారు.

అభ్యుదయ రచయితల సంఘం ఏర్పాటు ప్రజా సాహిత్యానికి స్వర్ణయుగమని నాజర్ తదితరులు ప్రజా కళలను వెలికి తీశారని అన్నారు.

తెలంగాణ సాయుధ పోరాటాన్ని శ్రీశ్రీ పట్టించుకోలేదనే విమర్శ ఉందని ఇది వాస్తవమేనని, అయితే 51లో కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటాన్ని విరమించినపుడు శ్రీశ్రీ విభేదించాడని, పోరాట ప్రాంతంలో లేకపోవడం వల్లనే రాయలేదని, అయితే ప్రపంచ పోరాటాలన్నింటిని ఆయన సమర్థించినందువల్లే 'మహా ప్రస్థానం' రాయగలిగారని అన్నారు. వలసానంతరం సాహిత్యంలో అనేక ధోరణులు వచ్చాయని, తెలంగాణ సాయుధ పోరాట ప్రభావం కొంత కాలం సాగినా తర్వాత బాగా నీరసించిపోయిందని అన్నారు. ఈ నేపథ్యంలో సివి లాంటి రచయితలు వచ్చారని అన్నారు. ఆ కాలంలో దిగంబర కవులు వచ్చారని, తర్వాత తిరగబడు కవులు వచ్చారని అన్నారు. చెరబండరాజు దిగంబర కవిగా ఉన్నా మార్క్సిస్టు దృక్పథంతో కవిత్వం రాశారని అన్నారు. ఆ తర్వాత నక్సల్బరీ రాజకీయాలు శ్రీశ్రీని విప్లవం వైపుకు తీసుకొని వచ్చాయని అన్నారు. విరసం ఏర్పడ్డాక 77, 78 జగిత్యాల, సిరిసిల్ల పోరాటాలు మొదలయ్యాయని, అక్కడి నుంచి గొప్ప ప్రజా సాహిత్యం, కళలు వచ్చాయని ఆయన అన్నారు. శ్రీశ్రీ కూడా 'మరో ప్రస్థానం' రాసారని ఆయన అన్నారు.

1950 తర్వాతనే రాయలసీమలో ఆధునిక సాహిత్యం వచ్చిందని, తెలంగాణ, ఉత్తరాంధ్రవంటి పోరాట ప్రాంతాలలో ప్రగతి భావాలు ఉద్యమాల నుండి వచ్చాయని, గద్దర్, వంగపండు వంటి వాగ్గేయకారులు ప్రజా సాహిత్యాన్ని సుసంపన్నం చేశారని అన్నారు. 1980ల నుంచి దళిత సాహిత్యోద్యమం, స్త్రీవాద సాహిత్యోద్యమం రావడం మన సాహిత్య ప్రజాస్వామికీకరణకు దోహదపడిందని అన్నారు. విప్లవోద్యమం, విరసం ఆ ధోరణులను ఆహ్వానించాయని, అయితే ఆ రచయితల్లో కొందరు విప్లవోద్యమాన్ని తిరస్కరించే వైఖరి తీసుకున్నారని అన్నారు. ఎం.ఆర్.పి.ఎస్. అడుగుతున్నట్లు వర్గీకరణ నేపథ్యంలో మాదిగ కులం నుంచి సాహిత్యం వస్తోందని అన్నారు. వ్యక్తిగత ఆస్తి రద్దు చేసే విప్లవోద్యమ క్రమంలోనే నూతన మానవ ఆవిష్కరణ జరుగుతుందని, నక్సల్బరీ నూతన మానవున్ని ఆవిష్కరించిందని ఆయన ముగించారు.

విప్లవోద్యమ నాయకుడు కా. కిషన్‌జీ జ్ఞాపకాల **సంకలనం అసిధార,** తెలంగాణ జర్నలిస్టులు ప్రచురించిన **కిషన్‌జీ సంస్మరణ వ్యాసాల సంకలనం లాంగ్‌మార్చ్‌లను** ఘంటా చక్రపాణి ఆవిష్కరించారు. పాణి రాసిన అస్తిత్వాలు – ఆధునికత – మార్క్సిజం అనే వ్యాస సంపుటిని కా. ఎన్. వేణుగోపాల్ ఆవిష్కరించారు. రివేరా **నదీ బాల్యం** కవితా సంపుటిని ప్రముఖ కవి ఇంద్రవెల్లి రమేష్ ఆవిష్కరించగా విరసం **సాహిత్య విమర్శ** సంకలనాన్ని మెట్టు రవీందర్ ఆవిష్కరించారు.

బిడి శర్మ రాసిన ఇంగ్లిషు పుస్తకాన్ని విరసం సభ్యురాలు కా. శశికళ **అమలుకాని హామీల చరిత్ర** అనే పేరుతో అనువదించారు. ఈ పుస్తకాన్ని గుంటి రవి ఆవిష్కరించారు. పాలమూరు అధ్యయన వేదిక తీసుకొని వచ్చిన తెలంగాణ పాటల సీడీ **ఆరని మంటను** ప్రముఖ కవి నందిని సుధారెడ్డి ఆవిష్కరించారు.

సాయంత్రం సెషన్‌లో దండకారణ్యంలో ప్రత్యామ్నాయ వ్యవస్థ-కల్పనా సాహిత్యం అనే అంశానికి కా. అల్లం రాజయ్య అధ్యక్షత వహించారు. నూతన మానవ నిర్మాణంలో అమరులైన సంతోష్‌రెడ్డి, ఆదిరెడ్డి, కిషన్‌జీలాంటివారుచేసిన కృషిలో భాగమైన తనకు నలభై ఏళ్ళ సుదీర్ఘ పయనంలోని మూల మలుపులన్నీ గుర్తుకు వస్తున్నాయని రాజయ్య అన్నారు. అడవిలోకి వెళ్లిన సాహు, పెద్ది శంకర్ వంటి విప్లవకారులు అక్కడి పరిస్థితుల్ని అధ్యయనం చేశారని, మనదే గొప్ప పోరాటం అనుకోకుండా భారత చరిత్రలో జరిగిన గొప్ప పోరాట అనుభవాల్ని స్వీకరించారని, 2004లో అవతలవారి అనుభవాల్ని స్వీకరించడం వల్లనే మావోయిస్టు పార్టీ ఆవిర్భవించిందని ఆయన అన్నారు. దండకారణ్యంలో ముప్పై ఏళ్లుగా జరుగుతున్న పోరాటం చరిత్రను నిర్మిస్తోందని, ఆ చరిత్రను, దానికి సాక్ష్యమైన సాహిత్యాన్ని కూడా వాళ్లే రాస్తున్నారని, ముప్పైఏళ్ల దండకారణ్య సాహిత్య చరిత్ర వాళ్ళు రాశారని, అది అందరికీ పఠన గ్రంథమని ఆయన అన్నారు.

వక్త కా. కూర్మనాథ్ మాట్లాడుతూ 'అధ్యయన పద్ధతుల్ని నేర్చుకుందామ'నే-మావో రచనను అందరూ చదవాలని, ముప్పయ్యేళ్ళ దండకారణ్య సాహిత్య చరిత్రను-జైలులో కా. రవి ఇంగ్లిషులోకి అనువాదం చేసారని దాన్ని త్వరలో విరసం ప్రచురిస్తుందని అన్నారు. వాళ్లు తమ చరిత్రను తామే రాసుకుంటూ, ఇతర భాషల్లోకి కూడా అనువదించుకుంటున్నారని అన్నారు. ప్రపంచంలోనే మూడవ పెద్ద సైన్యంతో పోరాడుతూనే సాహిత్య సృజన చేస్తున్నారని అన్నారు. ప్రపంచంలో అరవై, డెబ్బై దేశాల విస్తీర్ణంతో సమానంగా ఉన్న బస్తర్‌లో ప్రత్యామ్నాయ నిర్మాణం అవుతోందని ఆయన అన్నారు.

1980లలో 30, 35 మంది దళంగా వెళ్లిన రోజు నుంచే చరిత్ర నిర్మాణం మీద వారు శ్రద్ధ పెట్టారని, అప్పటి నుంచే సాహిత్య రచన చేస్తున్నారని అన్నారు.

దండకారణ్య సాహిత్యం-కల్పనా సాహిత్యం కాదు, మనం టెక్నిక్ రీత్యా అలా అంటాం కాని అది పుట్టు కథ అని, అల్లం రాజయ్యగారు కథకు స్థల కాలాదులు ఉండాలంటారని, అలాంటి లక్షణాలు దండకారణ్య సాహిత్యంలో పుష్కలంగా ఉన్నాయని అన్నారు. 'రాగో' నవలలో .. గొడ్డు పాలను తాగితే దాన్ని రక్తం తాగినట్లే అనుకునేంత మానవీయంగా ఆలోచించే ఆదివాసులు స్త్రీల పట్ల ఎందుకట్లా ఉంటారని సాధన ప్రశ్నిస్తారని గుర్తు చేశారు. నూతన మానవ ఆవిష్కారం కోసం దండకారణ్యంలో జరుగుతున్న ప్రయత్నాల వెనుక ఇంత సుదీర్ఘమైన, లోతైన ప్రయత్నం ఉందని

అన్నారు. షహీద, మిడ్కో రాసిన కథలు దండకారణ్యంలోని రెండోతరం కథలని, ప్రస్తుత దండకారణ్య ప్రత్యామ్నాయ వ్యవస్థ నిర్మాణాన్ని ఆ కథలు చిత్రించాయని అన్నారు.

దండకారణ్య సాహిత్యాన్ని అందరూ చదవాలని, విస్తారంగా రాయాలని, దండకారణ్య సాహిత్యాన్ని పూర్తి సంపుటాలుగా తేవాల్సిన అవసరం ఉందని చెపుతూ ఆయన ముగించారు.

సభకు అధ్యక్షత వహించిన కా. అల్లం రాజయ్య తన చివరి మాటల్లో దండకారణ్య సాహిత్యం ప్రాక్టికల్ సాహిత్యమని, ఇది కళకు సంబంధించినది మాత్రమే కాదు, కలలను నిజం చేస్తున్న సాహిత్యమని, కుప్పతెప్పలుగా బయట సాహిత్యముందని అది నిజమైన సాహిత్యం కాదని, ఇది మాత్రమే నిజమైన సాహిత్యమని అక్కడ సాహిత్యాన్ని సృష్టిస్తున్నవాళ్లు కళాకారులా, రచయితలా, సృష్టికర్తలా అంటే వాళ్లు సాహిత్యాన్ని లయాత్మకం చేస్తున్నవాళ్ళని, యుద్ధాన్ని కూడా లయాత్మకం చేసింది దండకారణ్యమని ఆయన అన్నారు.

ఒక మానవ జాతికి సంబంధించిన ఒక మహత్తర బాధ్యతనుమోస్తూ, వాళ్ళు చరిత్ర నిర్మిస్తున్న క్రమమని, ఇది మన యుద్ధమని, ఇది ప్రత్యామ్నాయం కోసం జరిగే యుద్ధమని ఆయన ముగించారు.

తదనంతరం సాహిత్య పాఠశాల ముగింపుగా తీర్మానాల సభ విరసం కార్యదర్శి పి. వరలక్ష్మి అధ్యక్షతన జరిగింది.

సభలో ఆర్.డి.ఎఫ్‌పై నిషేధాన్ని ఎత్తివేయాలని కా. పాణి, చార్మినార్ వద్ద భాగ్యలక్ష్మి దేవాలయం వద్ద ఇంకేం నిర్మాణాలు చేపట్టరాదని కా. వి.వి., విప్లవ సహచరుడు కా. పి. నాగభూషణంగారికి నివాళిని కా. చలసాని, మహిళలపై అత్యాచారాల్ని అరికట్టడానికి, సామ్రాజ్యవాద సంస్కృతిని వ్యతిరేకించాలని కా. రుక్మిణి, సిఆర్‌పిఎఫ్ జవాన్ల మృతదేహాల్లో మావోయిస్టులు బాంబులు పెట్టారనే దుష్ప్రచారం గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమేనని కా. కళ్యాణరావు, తెలంగాణలో విద్యార్థుల అక్రమ అరెస్టులు, పోలీసుల అణిచివేత చర్యలు, బైండోవర్‌లతో నడుస్తున్న అప్రకటిత ఎమర్జెన్సీని వ్యతిరేకిస్తూ, వెంటనే తెలంగాణను ప్రకటించాలని కా. బాసిత్ తీర్మానాలను ప్రవేశపెట్టారు. సభికులు తీర్మానాలను ఆమోదించారు. ఈ రెండు రోజులూ ప్రజాకళామండలి కళాకారులు తమ పాటలతో, ప్రదర్శనలతో విప్లవ, ప్రజా పోరాట సందేశాన్ని అందించారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్, నిర్వాసిత సమస్య, ప్రత్యేక తెలంగాణ, అమరత్వంపై పాటలు పాడారు. విరసం సభ్యులు రైతాంగ సమస్యలపై వీధి నాటిక ప్రదర్శించారు. అరుణోదయ కళాకారులు సాంస్కృతిక కార్యక్రమంలో పాల్గొన్నారు. దండకారణ్యంలో జరుగుతున్న నూతన మానవ ఆవిష్కారాన్ని ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలోకి వెళ్లి ఎత్తి చూపిన సాహిత్య పాఠశాల విప్లవోత్తేజంతో ముగిసింది. దండకారణ్యమే మన ఆలంబన, దండకారణ్యానికి సంఘీభావం ప్రకటిద్దాం, ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకిస్తూ విప్లవ జనతన సర్కార్‌కు అండగా నిలబడదాం .. అనే స్ఫూర్తిని చాటి పాఠశాల ముగిసింది.

## సాహిత్య పాఠశాలలో ఆమోదించిన తీర్మానాలు

### 1

ఢిల్లీలో (నిర్భయ)పై జరిగిన అత్యాచారాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది. సమాజంలో క్షీణిస్తున్న సంస్కృతికి, విలువలకిది అద్దం పడుతూ ఉందని భావిస్తోంది.

డిసెంబరు 16వ తేదీ రాత్రి జ్యోతిసింగ్, ఆమె స్నేహితుడు బస్సులో ప్రయాణిస్తుండగా, దుండగులు ఆమెపై అత్యాచారం చేసి, ఆమెనూ ఆమె స్నేహితుడిని వివస్త్రలను చేసి బస్సు నుండి కిందికి తోసి, చంపేయాలని చూడడం దుండగుల క్రూరత్వానికి పరాకాష్ట. ఆమె పొట్ట మీద స్క్రూ డ్రైవర్‌తో పొడిచి పేగులు చిల్లులు పడేటట్లుగా చేయడంతో ఆమె మరణించక తప్పలేదు. దీని వెనుక ఆ దుండగులకు హింసాక్రీడ మీద ఉన్న దుర్మార్గమైన కోరిక కనిపిస్తోంది.

ఈ ఘటనలో ఇంత క్రూరత్వం ఉంది కాబట్టే అటు ఢిల్లీలోనే కాక దేశవ్యాప్తంగా ఎంతో వ్యతిరేకత వచ్చింది. ఢిల్లీలో యువత వీధుల్లోకి వచ్చి దిగ్బంధనం చేసింది. సోనియా ఇంటి ముందు, రాష్ట్రపతి భవనం ముందు ప్రదర్శనలు నిర్వహించి ప్రభుత్వం దిగివచ్చేట్టుగా చేయగలిగింది. అంతవరకు పౌరసమాజం చేసిన పోరాటాన్ని అభినందిస్తోంది విరసం.

అయితే ఈ సందర్భంగా పౌర సమాజం దృష్టికి తీసుకురావలసిన విషయాన్ని కూడా మీ ముందుంచుతున్నాం.

ఒకటి, బస్సు నుండి తోసివేయబడిన జ్యోతిసింగ్ ఆమె స్నేహితుడు పడిపోయి ఉండగా చాలా మంది భయపడి చూస్తూ వెళ్ళిపోయారు తప్ప, వాళ్ళకు సహాయం అందించాలని ముందుకు రాకపోయారు.

మరోటి, ఢిల్లీ యువత పోరాట సందర్భంగా రకరకాల శిక్షలను అమలు చేయాలన్న వాదనలు కూడా సమాజపు ఆలోచన విధానాన్ని ప్రతిబింబిస్తోందని విరసం భావిస్తోంది.

ఈ మొత్తం నిరసనలో దుండగుల మీద శిక్షను అమలు చేయడం గురించే మాట్లాడారు. చట్టాన్ని మరింత కఠినతరం చేయడంపై శ్రద్ధ పెట్టారు, కానీ తమ నిరసనను ఏ మాత్రం సమాజంలోని ఆధిపత్య వ్యవస్థల మీద ఎక్కుపెట్టలేదు.

సమాజం ఇంతకాలం కుటుంబంలోని పితృస్వామ్యం గురించి రాజ్యహింస, కుల వ్యవస్థలోని హింస గురించే మాట్లాడింది, కానీ ఢిల్లీ సంఘటన పై వాటి గురించే కాక పౌర సమాజంలోకి పాకిన హింసానుకూల వాతావరణాన్ని మాట్లాడుకోవాల్సి వస్తోంది. స్త్రీలపై ఇంతకాలం కుటుంబంలోని పురుషులకే హక్కు ఉందనుకున్న పితృస్వామ్య భావజాలం నుండి ఈ రోజు ఎవరికైనా స్త్రీలు సరుకుగా, వస్తువుగా మారిన స్థితి కనిపిస్తోంది. కనుకనే ఈనాడు ఏ వయసువారిమీదనైనా ఏ సందర్భంలోనైనా అత్యాచారం జరగడం చూస్తున్నాం.

ఈ స్థితికి పౌర సమాజం రావడానికి ఆధిపత్య వ్యవస్థ హింసే ప్రాతిపదికని విరసం భావిస్తోంది. ప్రజా పోరాటాలను అణిచివేయాలన్న నెపంతో 'వాకపల్లి'వంటి అత్యాచారాలు, కుల అణిచివేతలో భాగంగా ఖైర్లాంజిలో దళిత స్త్రీలపై జరిగిన

దుర్మార్గాలను చూస్తూ పౌర సమాజం మౌనంగా ఉండిపోవడం చూస్తున్నాం. ఎందువల్లనంటే ఆ పౌర సమాజాన్ని ఇప్పటికీ అవినీతి, విలువ రాహిత్యంవైపు ఈ ఆధిపత్య వ్యవస్థలు దారి తీయించాయి. ఇంటర్‌నెట్‌లో, సినిమాల్లో క్షీణ సంస్కృతిని చూపించి, యువతను సమాజం వైపు చూడకుండా ఆలోచించకుండా చేస్తోంది. దీని కోసం మనుషులను తిను, తాగు, అనుభవించు అనే వస్తు వ్యామోహం వైపు, దృష్టిని మరల్చి నిర్వీర్యం చేస్తోంది.

దీని నుండి యువత, పౌర సమాజం దృష్టిని మరల్చి ఈ ఆధిపత్య వ్యవస్థలను ప్రశ్నించాలని విరసం కోరుకుంటోంది. అలా మాత్రమే ఈ సమాజంలో ఉన్న హింసను నిషేదించగలమని భావిస్తోంది.

అలా చెయ్యడం ద్వారా మాత్రమే జ్యోతిసింగ్‌పైనే కాక మొత్తం స్త్రీలపై అత్యాచారాలను అడ్డుకోగలమని భావిస్తోంది.

**2**

అఖిలపక్షం ఒక నాటకం! ప్రజల ఆకాంక్షను ఎన్నికల చుట్టూ తిప్పుతున్న స్వార్థ రాజకీయ నాయకుల కుట్రలను ఎదురించండి! పోరాటం ద్వారానే తెలంగాణ సాధ్యం!

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్ష. దీనికోసం ఇక్కడి ప్రజలు గత నలభై సంవత్సరాలుగా పోరాడుతున్నారు. ఈ ప్రజల న్యాయమైన డిమాండ్‌ను విరసం గత నలభై సంవత్సరాలుగా బలపర్చుతుంది. ఆ పోరాటంలో భాగమైంది.

గత పది సంవత్సరాల నుంచి తెలంగాణ ఆకాంక్షను ఎన్నికల నాయకులు తమ స్వార్థం కోసం వాడుకుంటున్నారు. ప్రజలు చేస్తున్న పోరాటాన్ని పక్కదారి పట్టిస్తున్నారు. అఖిల పక్షాల పేరుతో ఎన్నికల చుట్టు తెలంగాణ డిమాండ్‌ను తిప్పాలని కాంగ్రెస్ పార్టీ కుట్ర చేస్తున్నది. ఈ కుట్రలో ప్రాంత, ప్రాంతేతర ఎన్నికల నాయకులు భాగమవుతున్నారు. తెలంగాణ అంశం చర్చల్లోకి వచ్చినప్పుడల్లా దానిని కనుమరుగు చేయడానికి కోస్తాంధ్ర పాలకవర్గాలు కుట్ర చేస్తున్నాయి.

తెలంగాణ వ్యతిరేకుల కుట్రలను తిప్పికొట్టి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సాధించుకోవాలంటే ప్రజాపోరాటాలే మార్గం. ప్రత్యేక తెలంగాణను ప్రజాస్వామ్య తెలంగాణగా మార్చుకునే ముందుచూపుతో తెలంగాణ పోరాటానికి సిద్ధమవుదామని విరసం తీర్మానం చేస్తోంది.

**3**

విప్లవోద్యమంపై ప్రభుత్వం చేస్తున్న భౌతిక, మానసిక యుద్ధాన్ని ప్రజలు, ప్రజాస్వామికవాదులపై అమలు చేస్తున్న పాశవిక నిర్బంధాన్ని ఖండిస్తూ...

గ్రీన్‌హంట్ పేరుతో విప్లవోద్యమం పైన ప్రభుత్వం పాశవిక దాడులను చేస్తోంది. బూటకపు ఎన్‌కౌంటర్లతో మావోయిస్టులను పొట్టన పెట్టుకొంటోంది. మావోయిస్టులకు సహకరించిన ఆదివాసీ గ్రామాలను శ్మశానాల్లా మారుస్తోంది. తన ఫాసిస్టు చర్యలకు ఎదురు లేకుండా చేసుకోడానికి మావోయిస్టు పార్టీపైన, దాని అనుబంధ సంస్థలపైన నిషేధాన్ని కొనసాగిస్తూ ప్రకటన కూడా జారీ చేసింది.

విప్లవోద్యమంపైన నిషేధం పెట్టడం, దాడులు చెయ్యడం అప్రజాస్వామికం. ఈ అప్రజాస్వామిక చర్యతోపాటు, విప్లవోద్యమంపైన బురద జల్లుతూ తప్పుడు ప్రచారాలు చేస్తోంది.

ఆ తప్పుడు ప్రచారంలో భాగమే 'మావోయిస్టులు జవాన్‌ల మృతదేహాల్లో బాంబులు పెట్టారని' ప్రచారం చెయ్యడం. ప్రభుత్వంతోపాటు, పోలీసులతోపాటు కార్పొరేట్ మీడియా కూడా భాగం కావడం విచారకరం.

ప్రజలపైన మరిన్ని దాడులు చేయడానికే ప్రభుత్వం ఈ తప్పుడు ప్రచారం చేస్తోంది. అత్యున్నత మానవతా విలువలు కలిగిన మావోయిస్టులు ఇలాంటి అమానుష చర్యలు చెయ్యరు. ప్రభుత్వం, పోలీసులు మావోయిస్టులపై చేస్తున్న ఈ దుష్ప్రచారాన్ని విరసం ఖండిస్తోంది. ఈ దుష్ప్రచారాన్ని ఖండించాలని ప్రజాస్వామ్యవాదులకు విజ్ఞప్తి చేస్తోంది.

అలాగే కేరళలో అరెస్టు చేసిన హక్కుల ఉద్యమకారుడు గోపాలన్‌ని, ఆయనతోపాటు అరెస్టు చేసిన విద్యార్థుల్ని వెంటనే విడుదల చేయాలని విరసం డిమాండ్ చేస్తోంది.

**4**

**పొట్లూరి నాగభూషణం (1935-2012)**

విరసంకి ఆత్మీయుడు. విరసం సంస్థ స్థాపనకి, దాని ఉన్నతికి వెన్నుదన్నుగా చివరికంతా నిలిచిన వారిలో ఒకరు. ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమంలో తలమానికంగా నిలచిన కుటుంబ నేపథ్యం ఆయనది. ఆనాటి పార్టీ జిల్లా నాయకత్వాన్నీ, రాష్ట్ర నాయకత్వాన్నీ కంటికి రెప్పలా కాపాడిన కుటుంబం ఆయనది.

చిన్నప్పటినుంచీ సైన్సు, సాహిత్యం, మార్క్సిజం అనే త్రివేణి సంగమంలో ఓలలాడిన వారు నాగభూషణం. ఉద్యమ కార్యకర్తలనీ విప్లవకారులనీ కంటికి రెప్పలా కాచుకునేవారు. ఉద్యమంలో, ఒడిదుడుకులలో వెన్నుచూపని వ్యక్తి నాగభూషణం. ఆయన చిరునవ్వులో ఆప్యాయత, ఆదరణ, ప్రేమ, అభిమానం తొణికిసలాడేవి.

అప్పటి నుంచీ కూడా సాహిత్య అభినివేశంతో ముందుకు నడిచేవారు. ఎన్నో క్లిష్ట సమయాలలో విరసంకి చేదోడు, వాదోడుగా నిలబడి విరసంని ప్రోత్సహించారు. అంతేగాదు, అలనాటి అభ్యుదయ సాహిత్య పత్రికల కవిత్వం, అనువాదం రాస్తుండేవారు. షెల్లీ అన్నా, మయికో విస్కీ అన్నా పంచప్రాణాలు, వారి కవితలు కొన్ని అనువాదాలు చేశారు.

హైదరాబాద్‌లోని ఎ.జి. ఆఫీసులో పనిచేసి పదవీ విరమణ చేశారు. అక్కడ 'రంజని' అనే సాహిత్య సంస్థని విశేషంగా అభివృద్ధి చేసి దానికి రూపురేఖలు దిద్దారు. విరసం నిషేధానికి గురి అయినప్పుడు ఆయన చాచిన స్నేహహస్తం ఇంకా నిటార్గుగా నిలబడే ఉంది.

కిడ్నీ వ్యాధితో డిసెంబర్ 23న కన్ను మూశారు. ఆయన కుటుంబ సభ్యులకు మా గాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాం.



లేఖ

# విరసం అభిప్రాయాల గురించి మళ్లా ఒక ప్రశ్న

- కె. ఎల్లయ్య

నేను కొన్ని నెలల కింద 'విరసం అభిప్రాయాలు మారుతున్నాయా?' అని రాసిన ఉత్తరాన్ని జులై-ఆగస్టు 2012 అరుణతారలో వేసినందుకు కృతజ్ఞతలు. దాని మీద పాణిగారి జవాబు సెప్టెంబర్-అక్టోబర్ అరుణతారలో వేసినందుకు సంతోషం. కాని పాణిగారు రాసిన జవాబులో నా ప్రశ్నలకు జవాబులు నాకైతే కనబడలేదు. పాణిగారి ఉత్తరం మీద మళ్లా నా సందేహాలు రాద్దామని అనుకుంటూ ఉండగానే విరసం సభలు జరిగినాయి. ఆ సభల కరపత్రం చదివితే, సభలలో కొన్ని ఉపన్యాసాలు వింటే నా సందేహాలు ఇంకా పెరిగినాయి.

కరపత్రంలో ఆధునికత అనే మాట చాలసార్లు వాడినారు. మార్క్సిజం ఆధునిక శాస్త్రీయ సామాజిక సిద్ధాంతం అని దాన్ని మరెన్నో ఆధునిక సిద్ధాంతాలలో భాగం చేసి పలచన చేసినారని నాకనిపించింది. అసలు ఆధునికత అనే మాటకు అర్థం ఏమిటి? ఆ మాట మార్క్సిస్టు అవగాహనలో భాగమేనా? నాకు తెలిసినంత వరకు కాదనుకుంటున్నాను. పది పన్నెండేండ్ల కింద పోస్ట్ మాడర్నిజం గురించి తెలుగు పత్రికలో చర్చ జరిగినప్పుడు ఈ ప్రశ్న వచ్చింది. మార్క్సిజం కూడా ఆధునికతలో భాగమేనని పోస్ట్ మాడర్నిస్టులు విమర్శించారు. అప్పుడు మార్క్స్ ఆధునికతను మొత్తంగా ఆమోదించలేదని, విమర్శించాడని మార్క్సిస్టులు వాదించారు. ఈ పది సంవత్సరాల్లో మన అభిప్రాయం ఏమన్నా మారిందా?

సాహిత్యంలో నూతన మానవ ఆవిష్కరణ అని కరపత్రంలో చరిత్ర నుంచి ఉదాహరణలు ఇచ్చారు. ఎప్పటి నుంచో ఆ ఆలోచనలు ఉన్నాయని, అవి సాహిత్యంలో కూడా కనబడ్డాయని అందరికీ తెలిసిందే. కాని ఈ విషయం మాట్లాడేటప్పుడు మార్క్సిస్టులు చరిత్రకు చోదకశక్తి అయిన వర్గపోరాటం గురించి, ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల మార్పు గురించి మాట్లాడకుండా ఉండగలరా?

ఇక సభల్లో ఒకవక్త, రాజ్యానికి మూడు అంగాలు ఉంటాయని అందరూ అనుకుంటారని, కాని మార్క్సిస్టులుగా మేం నాలుగో అంగాన్ని గుర్తిస్తామని, ఆ నాలుగో అంగం పోలీసులు అని అన్నారు. మార్క్సిజం అలా భావిస్తుందా? నాకు తెలిసినంత వరకు పోలీసులు రాజ్యాంగ యంత్రంలో ఒక భాగం. బూర్జువా రాజనీతి శాస్త్రంలో చట్ట సభలు, కార్యనిర్వాహక వర్గం, న్యాయ వ్యవస్థ అని మూడు అంగాలుగా విడగొడతారు. అయినా పోలీసులు కొంత రెండో అంగంలోను, కొంత మూడో అంగంలోను ఉంటారుగాని ఈ నాలుగో అంగం అనే అవగాహన ఎక్కడిది?

ఒక వక్త హైదరాబాద్ రాజ్యంలో సాహిత్యం గురించి మాట్లాడుతూ దాశరథి గురించి చాలా పొగిడారు. పాజిటివ్‌గా చెప్పారు. 1948 వరకు దాశరథి పాత్ర గౌరవించవలసిందే. కాని ఆ తర్వాత ఆయనది పాలక వర్గాలతో కలిసి నడిచిన, పాలక వర్గాలను సమర్థించిన చరిత్రే. ఇవాళ తెలంగాణ వాదులు ఆయనను కీర్తిస్తున్నారు గాని, 1969 ఉద్యమంలో ఆయన తెలంగాణ వాదులకు వ్యతిరేకంగా ఘోరమైన కవిత్వం రాశాడు.

మరొక వక్త తెలంగాణ సాహిత్యం గురించి మాట్లాడుతూ సంఘటనలు జరిగిన తేదీలు, స్థలాల పేర్లు, మనుషుల పేర్లు పొరపాట్లు చెప్పారు. ఆ పొరపాట్ల పైన ఆధారపడి సిద్ధాంతాలు చేశారు. ఇటువంటి సభల్లో సమాచారం సరిగ్గా ఇవ్వడం, తప్పు సమాచారం మీద ఆధారపడి సిద్ధాంతాలు చేయకుండా ఉండడం మంచిది కదా.

ఆధునికత, గురజాడ విషయాల మీద ఇద్దరు సీనియర్ విరసం నాయకులు ఒకరినొకరు ఖండించుకున్నారు. వారిలో ఎవరు చెప్పేది మార్క్సిజమో అర్థం చేసుకోలేని శ్రోతలు ఏం కావాలి?

పుస్తకావిష్కరణలలో చేకూరి రామారావుగారు మార్క్సిస్టు సాహిత్య విమర్శ గురించి, రేగడి విత్తులు నవల గురించి తన భిన్నాభిప్రాయాలు చెప్పారు. ఇంద్రవెల్లి రమేష్‌గారు విరసం తన బంధనాలు వదుల్చుకుని స్వేచ్ఛా వాదాలకు అవకాశం ఇస్తుందని సంతోషం ప్రకటించారు.

మొత్తం మీద సభలలో ఎక్కువ సార్లు దండకారణ్యం, జనతన సర్కార్ అన్నారు గాని, రాజకీయాలు, మార్క్సిజం లోపించినాయని అనిపించింది.

ఇదివరకటి ఉత్తరంలో అడిగిన ప్రశ్నే మళ్లీ అడుగుతున్నాను. విరసం అభిప్రాయాలు మారుతున్నాయా? విరసం రాజకీయాలు వదులుకుంటుందా? సడలించుకుంటున్నానని చెప్పకనే చెపుతున్నదా?



సంస్మరణ



# విప్లవ రచయితల సంఘం వ్యవస్థాపక సభ్యుడు
# కామ్రేడ్ పి. నాగభూషణంకు జోహార్లు

**సంస్మరణ సభ, 19-01-2013, శనివారం, సాయంత్రం 6.00 గంటలకు, బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్, హైదరాబాద్.**

విప్లవ రచయితల సంఘం వ్యవస్థాపక సభ్యుడు, కవి, విమర్శకుడు కా. పి. నాగభూషణం (పినాకపాణి) కిడ్నీ వ్యాధితో 2012 డిసెంబర్ 23న మరణించారు. నేర్పడం, నేర్పించడమనే మౌలిక మార్క్సిస్టు అధ్యయన పద్ధతిని జీవితకాలం పాటు కొనసాగించిన వినమ్ర విప్లవ సాహిత్య విద్యార్థి ఆయన. రాజకీయాలు, సాహిత్యం వేర్వేరు అనే శుద్ధ సాహిత్య సంప్రదాయాన్ని తిప్పికొడుతూ ముందుకొచ్చిన విరసం ఆవిర్భావ చరిత్రలో ఆయన భాగస్వామి.

**అధ్యక్షత : చలసాని ప్రసాద్** (విరసం సభ్యులు)
**పి. అనుపమ** (చిన్న కూతురు)
**వి. నాగేశ్వరరావు** (అకౌంట్స్ కేటగిరి-III అసోసియేషన్ ప్రెసిడెంట్, ఏజి ఆఫీస్)
**ఎన్. వేణుగోపాల్** (వీక్షణం సంపాదకులు)
**గీతా రామస్వామి** (ఎచ్‌బిటి)
**వాసిరెడ్డి నవీన్** (కథా రచయిత)
**డా. నళిని** (ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక)
**వరవరరావు** (విరసం సభ్యులు)
**శ్రీకుమార్** (కుటుంబ మిత్రుడు)

కా. నాగభూషణం ప్రజాపక్షం వహించిన సృజనాకారుడు. వంటింటి గడపలో కూర్చొని తన తల్లి దగ్గర తెలుగు నుడికారం నేర్చుకున్నానని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి అన్నట్టు, అమ్మ చేతుల్లో రూపుదిద్దుకున్న కార్మిక వర్గ పుత్రుడు ఆయన. కృష్ణా జిల్లా వల్లూరిపాలెం గ్రామంలో 1935 డిసెంబర్‌లో కా. నాగభూషణం పుట్టారు. తల్లి సీతా మహాలక్ష్మి స్వయంగా కమ్యూనిస్టు కార్యకర్త. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కాలంలో భర్త సుదర్శనం తోడ్పాటుతో ఎందరో అజ్ఞాత కార్యకర్తలకు ఆమె ఆశ్రయమిచ్చారు. ఈ క్రమంలో బాల్యంలోనే కా. నాగభూషణంపై ఆమె ముద్రపడింది. పుట్టకల్లోనే పడిన కమ్యూనిస్టు ప్రభావం గిట్టేదాకా కొనసాగింది. బెనారస్‌లో ఎం.ఎ మ్యాథమెటిక్స్ చదివిన ఆయన హైదరాబాద్ ఏజీ ఆఫీస్‌లో చేరారు. ఒకవైపు ఉద్యోగ బాధ్యతలు, ఉద్యోగ సంఘ బాధ్యతలు మోస్తూనే మరోవైపు 'రంజని' సాహిత్య పత్రికను ప్రారంభించారు. కేకే మెనోన్ వంటి సహోద్యోగుల సహకారంతో మంచి సాహిత్య విలువలున్న పత్రికగా 'రంజని'ని సమర్థంగా నిర్వహించారు. ప్రగతిశీల రచయితలు, సాహిత్య విమర్శకులతో తన పత్రిక ద్వారా పరిచయాలు పెంచుకున్నారు. ఈ క్రమమే నక్సల్బరీ శ్రీకాకుళం, విప్లవోద్యమం ప్రేరణతో 1970 జూలై నాలుగో తేదీన హైదరాబాద్‌లో ఏర్పడిన విప్లవ రచయిత సంఘంలోకి ఆయనను నడిపించింది. విరసం ఆవిర్భావ ప్రకటన పత్రంపై సంతకం చేసిన వారిలో ఆయన ఒకరు.

సరైన సైద్ధాంతిక కృషి లేకుండా కళా, సాహిత్య రంగాల్లో ప్రజా దృక్పథాన్ని ఆవిష్కరించలేమని కా. నాగభూషణం గట్టిగా విశ్వసించారు. కమ్యూనిస్టులు అన్నింటిలోనూ ముందుండాలని, విధాన చర్చల్లో విశాలంగానూ, విధానం అమల్లో కటువుగానూ ఉండాలని అభిప్రాయపడేవారు. ప్రజాక్షేత్రంలో ఉన్నవారు మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావో రచనలను విధిగా అధ్యయనం చేయాలని కోరేవారు. చదివింది గణితం అయినా సామాజిక శాస్త్రాలు, రాజకీయ, కళా సిద్ధాంతాల పట్ల ఆసక్తి చూపడమే కాదు.. అరుణతార వంటి పత్రికలకు పినాకపాణి పేరిట వ్యాసాలు రాశారు. ఆయన రచనలు 1999లో 'స్వేచ్ఛ కోసం' పేరిట పుస్తకంగానే వెలువడ్డాయి.

సాహిత్యంలో నల్లదండులను విరసం నాయకత్వంలో గట్టిగా ప్రతిఘటించిన వారు కా. నాగభూషణం. సినీ నటులతో కలిసి నాటి ప్రభుత్వాలు 'సాహిత్య సేవ'కు తెగబడగా, ఈనాటి పాలకులు కార్పొరేట్ సంస్థల దన్నుతో రచయితలను ప్రలోభపెట్టే సిగ్గుమాలినచర్యలకు పాల్పడుతున్నారు. పోలీసుల గన్నుతో ప్రపంచ తెలుగు మహాసభలను జరిపించారు. ఇలాంటి పరిస్థితుల్లో కా. నాగభూషణం వంటి నిబద్ధ సాహిత్య కార్యకర్తలు లేకపోవడం విప్లవ సాహిత్య స్రవంతికే కాక, వ్యక్తిగతంగా విరసానికి కూడా పెద్ద లోటే. కుటుంబ సభ్యులు, ఏజీ ఆఫీస్ మిత్రులు, భావజాల సన్నిహితుల తోడ్పాటుతో నిర్వహిస్తున్న కా. నాగభూషణం సంస్మరణ సభను విజయవంతం చేయాలని ప్రతి ఒక్కరినీ కోరుతున్నాం.

**విప్లవ రచయితల సంఘం**
**సిటీ యూనిట్**



కరపత్రం

### షహీద్ భగత్‌సింగ్ 82వ వర్ధంతిని మార్చ్ 23 నుంచి 29 వరకు

# రాజకీయ ఖైదీల హక్కుల పోరాటవారంగా నిర్వహిద్దాం!

## ప్రజలకు, ప్రజాస్వామ్యవాదులకు, హక్కులసంఘాలకు, ఖైదీల బంధుమిత్రులకు విజ్ఞప్తి!

1931 మార్చ్23న అంటే ఇప్పటికి 82 ఏళ్లక్రితం బ్రిటిష్ఇండియా వలసప్రభుత్వం గొప్ప దేశభక్తులు, విప్లవకారులు భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను లాహోర్ జైల్లో రహస్యంగా ఉరితీసింది. అప్పటినుంచీ జైళ్లలోను, బయట ఖైదీల పోరాటాలకు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలకు ఆ అమరులు ప్రతీకలయిపోయారు. కిసాన్‌మజ్దూర్ (రైతుల కార్మికుల) రాజ్యస్థాపన కోసం, సర్వహారా (శ్రామిక ప్రజల) నిజమైన అధికారం కోసం, శిర్‌కో కఫన్ బాంధ్‌కే నిక్‌లో (నుదుట మరణవాఙ్మూలం రాసుకొని కదిలిన) భగత్‌సింగ్ ఇరవైనాలుగేళ్లకే నిండా నూరేళ్ల సార్థక జీవితం గడిపిన వాడయ్యాడు. ఇన్‌ఖిలాబ్ జిందాబాద్ అంటూ చిరునవ్వుతో ఉరికంబం ఎక్కి తనతోపాటు ఉరికంబం ఎక్కిన ఇద్దరు సహచరులను సమస్త మానవజాతిని చేరదీసినంత ప్రేమతో కౌగలించుకొని అమరుడయ్యాడు. జైళ్లను, కోర్టులను పోరాటశిబిరాలుగా, వేదికలుగా మలచుకున్నాడు. బధిరాంధక పార్లమెంటును కార్మిక వ్యతిరేక చట్టాలకు వ్యతిరేకంగా హెచ్చరించిన దగ్గర్నించీ ఆఖరిశ్వాస దాకా ఆయన విప్లవాచరణకు, విప్లవ ప్రచారానికి ఉండే అవినాభావ సంబంధమేమిటో తన జీవితమే గీటురాయిగా నిరూపించాడు.

1929లో చరిత్రాత్మకమైన జైలుపోరాటాన్ని జూన్6 నాడు చేపట్టి రాజకీయ ఖైదీల హక్కుల కోసం సమరశీల పోరాటం నిర్వహించాడు. 63 రోజుల ఆ ఆమరణనిరాహారదీక్షలో సెప్టెంబర్ 13న కామ్రేడ్ జతిన్‌దాస్ అమరుడైనాడు. ఆ పోరాటంలో ఖైదీలు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల మెడలువంచి గొప్ప విజయాన్ని సాధించారు. కనుక దేశవ్యాప్తంగా దేశభక్తులయిన విప్లవాభిమానులకు షహీద్ భగత్‌సింగ్ ఎంత ఉత్తేజమో ఖైదీలకు, రాజకీయ ఖైదీలకు కూడ అంతే ఆదర్శం. ప్రతిసంవత్సరం వలె ఒకటిరెండు రోజులు కాకుండా ఎనిమిది దశాబ్దాల తర్వాత కూడ అనాగరికంగా ఉరిశిక్షలు అమలుచేస్తున్న భారత ఫాసిస్టు ప్రభుత్వ దమననీతికి వ్యతిరేకంగా ఈ సంవత్సరం భగత్‌సింగ్ వర్ధంతిని వారంరోజులపాటు ఖైదీలహక్కుల పోరాటవారంగా నిర్వహించుకుందాం. అఫ్జల్‌గురు రహస్య ఉరిశిక్షను నిరసిస్తూ, వీరప్పన్ అనుచరుల, రాజీవ్‌గాంధీ హత్యకేసులో నిందితుల, పంజాబ్ మిలిటెంట్ పోరాటంలో ఉరిశిక్షపడిన ఖైదీల, మొత్తంగా ఉరిశిక్షలు పడిన వారందరి ఉరిశిక్షలు రద్దుచేయాలని, రాజ్యాంగం నుంచి మరణశిక్ష చట్టాన్ని తొలగించాలని ఉద్యమిద్దాం.

గత నలభైసంవత్సరాలకు పైగా విప్లవోద్యమానికైనా, ప్రజాస్వామిక పోరాటాలు, హక్కుల పోరాటాలకైనా దేశంలో ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజాస్వామికశక్తులు అండగా ఉన్నాయి. ఒక

**రాజకీయ ఖైదీల హక్కుల పోరాటవారం కార్యక్రమాలు: తేది:** మార్చి 23, 2013. **స్థలం:** యూనివర్సిటీ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల ఆడిటోరియం, సుబేదారి, హన్మకొండ, వరంగల్ జిల్లా. **సమయం:** ఉదయం 10 నుండి సాయంత్రం 6 గంటల వరకు. **వక్తలు:** ప్రొ. **జగ్మోహన్** (భగత్‌సింగ్ మేనల్లుడు), **చుక్కా రామయ్య, కె. శ్రీనివాస్, కె. రామచంద్రమూర్తి, అల్లం నారాయణ, మాడభూషి శ్రీధర్, పి. జయమ్మ** (సిఎంఎస్ అధ్యక్షురాలు), **మెంచు రమేష్** (టివివి రాష్ట్ర ప్రెసిడెంట్), **చిలకా చంద్రశేఖర్, ఆకుల భూమయ్య, వరవరరావు తదతరులు. అధ్యక్ష వర్గం:** ఎ. నరసింహారెడ్డి, **బల్ల రవీంద్రనాథ్,** ఎం. రామస్వామి. ప్రజా కళా మండలి కళాకారులచే సాంస్కృతిక కార్యక్రమాలు.

**తేది:** మార్చి 24, 2013. **స్థలం:** విశాఖ పౌర గ్రంథాలయం మెయిన్ హాల్, విశాఖపట్నం. **సమయం:** ఉదయం 10 నుండి. **వక్తలు:** ప్రొ. **జగ్మోహన్** (భగత్‌సింగ్ మేనల్లుడు), ప్రొ. **సుజాతో భద్రో,** ప్రొ. **హరగోపాల్, చలసాని ప్రసాద్, వరవరరావు, ఎ. దశరథ్, దేవేంద్ర** (సిఎంఎస్), **బల్ల రవీంద్రనాథ్, తదితరులు.**

ప్రజా కళా మండలి కళాకారులచే సాంస్కృతిక కార్యక్రమాలు.

**తేది:** మార్చి 25, 2013. **దేశంలోని వివిధ జైళ్ళలో మగ్గుతున్న రాజకీయ ఖైదీల బంధుమిత్రులతో హైదరాబాద్‌లో ప్రెస్‌మీట్.**

**తేది:** మార్చి 26, 2013. **ప్రజాతంత్ర దేశభక్త ఉద్యమం (పిడిఎం) వారితో సంయుక్తంగా స్థలం:** అంబేద్కర్ భవన్, ఒంగోలు. **సమయం:** ఉదయం 11 నుండి **వక్తలు: జి. కళ్యాణరావు, వి.వి. కృష్ణారావు, వై.వి., బల్ల రవీంద్రనాథ్, గంటి ప్రసాదం, తదితరులు.** ప్రజా కళా మండలి కళాకారులచే సాంస్కృతిక కార్యక్రమాలు.

**తేది:** మార్చి 28, 2013. **భద్రాచలం, ఖమ్మం జిల్లాలో రాజకీయ ఖైదీల కుటుంబ సభ్యులతో ప్రెస్‌మీట్.**

చోదకశక్తిగానూ, సమీకరణ, సంఘటన, కార్యాచరణ కేంద్రంగానూ ఉంటూ వస్తున్నాయి. కనుక సహజంగానే ఇక్కడి విప్లవాభిమానులపైన, ప్రజాస్వామికశక్తుల, వ్యక్తుల పైన వివిధ హక్కుల సంఘాల పైన, ప్రజాసంఘాలపైన రాజకీయఖైదీల హక్కులవిషయంలోను, విడుదల విషయంలోనూ చేపట్టవలసిన గురుతరబాధ్యతలు చాల ఉన్నాయి. ఆ విధంగా చూసినప్పుడు ఒక నిర్మాణంగా రాజకీయఖైదీల విడుదల కమిటీ (కమిటీ ఫర్ ది రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజనర్స్ - సిఆర్‌పిపి) ఆంధ్రప్రదేశ్ చాప్టర్ బహుముఖ కోణాల్లో రాజకీయఖైదీల సమస్యలను ఇక్కడి ప్రజలదృష్టికి, ప్రజాస్వామ్యవాదుల దృష్టికి తేవాల్సి ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ జైళ్లలో తెలుగునేలమీదనే విప్లవ, ప్రజాస్వామిక, దళిత, ఆదివాసీ, మైనారిటీ, తెలంగాణ రాష్ట్ర హక్కుల సాధన కోసం పోరాడి అరెస్టయి జైళ్లలో మగ్గుతున్న వాళ్లున్నారు. వాళ్లలో అత్యధికులు అండర్ ట్రయల్ ఖైదీలు. ఆంధ్రప్రదేశ్ నుంచి దేశం నలుమూలలకు వెళ్లి విప్లవోద్యమంలో పాల్గొని అరెస్టయి వేరువేరు రాష్ట్రాల్లో జైళ్లలో మగ్గుతున్నవాళ్లున్నారు. వాళ్ల కుటుంబాలు, మూలాలు అన్నీ ఇక్కడే ఉన్నాయి. మావోయిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యులనే కారణంగానో, ఆంధ్రప్రదేశ్‌లో అరెస్టయిన కారణంగానో ఆంధ్రప్రదేశ్ జైళ్లలో మగ్గుతున్నవాళ్లూ ఉన్నారు. బయటి రాష్ట్రాల్లోని జైళ్లలో ఉన్నా ఇక్కడ కేసులున్నవాళ్లూ ఉన్నారు. ఇక్కడివాళ్లే అయి ఉండి తమ ప్రమేయం ఏమీలేకుండా బయటి రాష్ట్రాల్లోని కేసుల్లో ఇరికించబడి అక్కడి కోర్టుల్లోనే విచారణ జరుగుతూ విడుదలకాకుండా ఉన్నవాళ్లూ ఉన్నారు.

వీరందరి విడుదల కోసం, జైళ్లలో ఉన్నంతకాలం జైళ్లలో హక్కుల కోసం (స్వేచ్ఛగా ఎక్కడికైనా తిరిగే హక్కు తప్ప ఖైదీలకు వాళ్లు ఖైదీలయినంత మాత్రాన ఏ ప్రాథమిక హక్కూ కోల్పోవడానికి వీలులేదు) న్యాయసహాయం కోసం కృషిచేయడం మన బాధ్యతే అవుతుంది. వీళ్లలో మళ్లీ రెండురకాలు. శిక్షపడినవాళ్లు, ఆరోపణలు ఎదుర్కొంటున్నవాళ్లు (అండర్ ట్రయల్స్) శిక్షపడిన వాళ్లలో మొదట పేర్కొనదగినవాళ్లు చర్లపల్లి (సికిందరాబాదు) జైల్లో ఉన్న పివిబి గణేశ్ (1995 నుంచి 18 సంవత్సరాలుగా) ఖదీర్ (1991 నుంచి 22 ఏళ్లుగా) విషయంలో ముఖ్యమంత్రితో సహా అందరూ ఇప్పటికెప్పుడో విడుదల కావల్సినవాళ్లని అంటారుగానీ అది ఎప్పటికి కార్యరూపం దాలుస్తుందో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. పివిబి గణేశ్ ఆరోగ్యం గురించి, ఖదీర్‌కు మధుమేహం ఉన్నందువల్ల ఒక కాలు తొలగించినవిషయం ప్రభుత్వంలో తెలియని బాధ్యులెవరూ లేరు. మనదింత అమానుషవ్యవస్థ.

అట్లే ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరు మొదలయిన ప్రాంతాలకు చెంది భోపాల్ కోర్టులో ఏడు సెక్షన్లకు ఏడు యావజ్జీవ శిక్షలు పడి హైకోర్టులో అపీల్ ఉండి భోపాల్ జైల్లో దుర్భరమైన పరిస్థితుల్లో చక్కా కృష్ణ, గంగ్రకోట పెంటయ్య, దున్నాడాంగే, ఎలవర్తి లీలాకృష్ణ, సునీతలు మగ్గుతున్నారు. వీళ్ల అరెస్టు కాలం నుంచి విచారణ దశదాకా తన ఆరోగ్యాన్ని లెక్కచేయకుండా వెళ్లి న్యాయవాదిగానూ, రాజకీయఖైదీల విడుదలకమిటీ ఉపాధ్యక్షుడుగానూ సేవలందించిన బిఎస్ఎ సత్యనారాయణ స్మరణ మనకిపుడు ఆదర్శం కావాలి.

శాసనసభా వసతిగృహ ప్రాంగణంలో కరపత్రాలు, సాహిత్యం పంచిన ఆరోపణపై పదిసంవత్సరాల శిక్షపడిన మాలతి, ఆమెతోపాటు అరెస్టయి ఆయుధాలు పట్టుబడిన కేసులో విచారణనెదుర్కుంటున్న మీనా రాయపూర్ జైల్లో ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌కు చెంది శిక్షలు పడినవాళ్లను తమ పిల్లలను, కుటుంబాలను చూసుకోవడానికి వీలుగా ఇక్కడి జైలుకు మార్చాలన్నది చట్టం అనుమతించే అంశమే. ఈ విషయం గురించి వివిధ హక్కుల సంఘాలు, సంస్థలు, ప్రజలందరూ ఐక్యంగా డిమాండ్ చేయాలి. (అఫ్జల్‌గురుకు ఉరిశిక్ష ఖాయమైన తర్వాత తనను శ్రీనగర్ జైలుకు తరలించాలని కాశ్మీర్‌లోయలోని సోపార్ నుంచి తన తొంభైఏళ్ల తల్లి, భార్య, పసిపిల్లవాడు తీహార్‌జైలుకు వచ్చి చూడడం వ్యయప్రయాసలతో కూడినపని అని సుప్రీంకోర్టులో వేసిన పిటిషన్‌ను ఆయనను ఉరితీసిన రెండురోజుల తర్వాత ఫిబ్రవరి11న సుప్రీంకోర్టు ఇపుడు దీనికింక కాలం చెల్లిందని ఫైలు మూసేసింది).

ఇంక అండర్‌ట్రయల్ ఖైదీలుగా దీర్ఘకాలంగా (ఏడెనిమిదేళ్ల నుంచి నాలుగేళ్ల వరకు) ఆంధ్రప్రదేశ్ జైళ్లలో ఉన్నవాళ్లు కొండయ్య (కేసులు కర్ణాటకలో - జైలు - కడప), పాండురంగారెడ్డి (సాగర్ - ఒంగోలుజైలు) ఎల్‌ఎస్ఎన్ మూర్తి (కేసులు- రాజమండ్రి, నెల్లూరు. జైలు - రాజమండ్రి) చంద్రశేఖర్ (కేసులు కర్ణాటకలో ఉన్నాయిగానీ చర్లపల్లి జైల్లో ఉన్నాడు). వీరిలో పాండురంగారెడ్డి (సాగర్) నల్లమల ఉద్యమనాయకుడు. ఇతనిమీద మొదట 54 కేసులు పెట్టారు. వాటిలో 40కి పైగా హత్యానేరారోపణలు. అవన్నీ వీగిపోయి ఆరేడు కేసులు మాత్రమే మిగిలాయి. అలిపిరిలో చంద్రబాబునాయుడుపై హత్యాప్రయత్నం కేసులో సెషన్స్ కోర్టు పదిసంవత్సరాల శిక్ష వేస్తే అపీల్‌పై కోర్టు కొట్టివేసింది. కనుక ఇంక ఈ ఆరేడుకేసులు కూడ కొట్టివేయబడి విడుదలవుతాడేమో అనే భయంతో పోలీసులు నల్లమలలో ఒక డంప్ ఆచూకి గురించి అతని సహచరుడే చెప్పాడని కోర్టులో వేసి జైలునుంచి కస్టడీకి తీసుకున్నారు. పాండురంగారెడ్డి ఎంత ప్రతిఘటించినా బంధించి నల్లమల అడవుల్లోకి తీసుకవెళ్లి ఒక డంప్ డ్రామా ఆడి మళ్లీ జైలుకు అప్పగించారు. ఇన్ని సంవత్సరాల తర్వాత ఇట్లా పోలీసులు ఒక జుడిషియల్ కస్టడీలో ఉన్న వ్యక్తితో వ్యవహరించడంపై ఆయన కోర్టులో అభ్యంతరం చెప్తే కోర్టు నిర్లిప్తంగా, ఉదాసీనంగా ఒక పిటిషన్ వేయండి విచారిస్తాం అన్నది. గతంలో 2005లో జుడిషియల్ కస్టడీలో ఉన్న దుద్దుప్రభాకర్‌ను జైలునుంచి మరోచోట కోర్టుకు తీసుకెళ్తూ మార్గమధ్యంలో అడవిలో పోలీసులు చంపుతామని బెదరిస్తే హైకోర్టు తీవ్రంగా మందలించిన సందర్భాన్ని ఇక్కడ ఒకమారు గుర్తుచేసుకుందాం.

చత్తీస్‌గఢ్ జైళ్లు, ఆ జైళ్లలో ఖైదీల పరిస్థితి దుర్భరంగా ఉన్నది. ఒక్క జగదల్‌పూర్ జైల్లోనే 600 మందిని ఉంచవలసినచోట 1600 మందిని కుక్కారు. వీరిలో గణనీయమైన సంఖ్యలో విప్లవరైతాంగం, ఆదివాసీలున్నారు. వీళ్లకు కడుపునిండా రెండుపూటలా తిండి కూడా పెట్టరు. కట్టుకునే గుడ్డలు కూడ కరువే. ఈ స్థితిలో మహిళలైతే చెప్పనలవికాని లైంగిక, మానసికహింసలకు కూడ గురవుతున్నారు. జైల్లో వైద్యసౌకర్యం లేక, బయటి ఆసుపత్రులకు పంపక 2012 తొలి ఆరునెలల్లోనే ఆరుగురు ఖైదీలు మరణించారు. విచారణలో

ఉన్న ఖైదీలను ఏళ్లతరబడి కోర్టులకు కూడ తీసుకపోవడంలేదు. ఈ జైల్లోనే ఆరుసంవత్సరాల క్రితం అరెస్టయి 140 కేసులు ఎదుర్కొంటూ దండకారణ్య కెఎంఎస్ ఉపాధ్యక్షురాలు నిర్మల బందీగా ఉన్నది. విడుదలయి మళ్లీ జైలుముందే అరెస్టయి ఎంతకూ ఎడతెగని కేసువిచారణతో పద్మ ఇదే జైల్లో ఉన్నది. కామ్రేడ్ రాజిరెడ్డి (సత్తెన్న)తో అరెస్టయిన ఆయన సహచరి సుగుణ మహారాష్ట్ర, చత్తీస్‌గడ్ జైళ్లలో కేసులకు తిరిగి ఇపుడు అరెస్టుకేసు విచారణలో కేరళ జైల్లో బెయిలువచ్చి కూడ స్థానిక జమానతు కావాలన్న నిబంధనవల్ల బయటికి రాకుండా ఉన్నది. స్వయంగా అడ్వొకేట్ అయి దుర్గ్ (ఛత్తీస్‌గఢ్)లో ప్రాక్టీస్ చేస్తున్న రేఖ తెలుగు దీపక్‌గా పిలవబడే వెంకటేశ్వరరెడ్డి (కలకత్తా ప్రెసిడెన్సీ జైల్లో ఉన్నాడు) సహచరి అయినందుకు అరెస్టయి రాయపూర్ జైల్లో ఉన్నది. ఆయన సహచరినే కాని ఆయనతో ఏళ్లుగా కాంటాక్టు లేదని కోర్టులో చెప్తే జడ్జిగారు 'అయితే విడాకులు ఇవ్వు' అని హితోపదేశం చేసే భావజాలంతో మనకోర్టులు ఉన్నాయి. చత్తీస్‌గడ్‌లో జడ్జిలు, జైలు అధికారులు కరడుగట్టిన తిరోగమనవాదులు. బినాయక్‌సేన్, అసిత్‌కుమార్‌గుప్తా వంటి మేధావులను మావోయిస్టు పరిచయాలు, భావజాలం ఉన్నదనే కక్షతో జీవితఖైదు, ఎనిమిదేళ్ల శిక్షలు వేసినవారు. పోలీసులైతే కోర్టు ఆవరణలోనే మాలతి, మీనా తదితర కామ్రేడ్స్‌పై చెయ్యిచేసుకున్నారు. మహారాష్ట్ర జైళ్ల పరిస్థితి కూడా ఇదే. ఏంజెలా అనే మహిళా రాజకీయ ఖైదీని జైలుగేటు ముందే రోజంతా నిలిపి ఉంచితే ఆమె ప్రతిఘటించినందుకు నాగపూర్ పోలీసులు ఆమె తల పగలగొట్టారు. వీటిని బట్టి జుడిషియల్ కస్టడీలో కూడా రాజకీయఖైదీలుగా మహిళలు సైతం ఎన్ని చిత్రహింసలకు గురవుతున్నారో ఊహించుకోవచ్చు. అన్నికేసుల్లో బెయిలువచ్చి కూడ జమానతులు ఆలస్యమై ఈలోగా ఝార్ఖండ్ రాష్ట్రానికి చెందిన దుర్మార్గమైన చట్టం (క్రిమినల్ కంట్రోల్‌యాక్ట్) కింద ఎనభైఏళ్ల నారాయణసన్యాల్, బి.అనూరాధ, భిక్షపతి, ఉరిశిక్ష కొట్టివేయబడిన జీతన్‌మరాండీ ఝార్ఖండ్ జైళ్లలో మగ్గుతున్నారు. మావోయిస్టుపార్టీ సీనియర్ నాయకులు ఆంధ్రప్రదేశ్‌కు చెందిన రవిశర్మ, నూనె నర్సింహారెడ్డి ఇక్కడి కేసులన్నిటి నుంచీ విడుదలై ఝార్ఖండ్ కార్యక్షేత్రం గనుక అక్కడ హజారీబాగ్ జైల్లో మగ్గుతున్నారు. నూనె నరసింహారెడ్డి అయితే గుంటూరు జైలునుంచి విడుదలయ్యాక మళ్లీ ఎపి పోలీసులు అరెస్టుచేసి అతణ్ని ఝార్ఖండ్ పోలీసులకు అప్పగించారు. సికాస సీనియర్ నాయకుడు, మావోయిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యుడు హుస్సేన్ జైల్లోనే మధుమేహవ్యాధితో (కంటిచూపు కూడ సమస్యే) ఆంధ్రప్రదేశ్‌లో కేసులన్నింట్లో విడుదలయి కూడ ఝార్ఖండ్ బొకారో జైల్లో మగ్గుతున్నాడు. కేంద్రకమిటీ టెక్ సభ్యుడు సాధనాల రామకృష్ణతో పాటు మరో 9 మందిని కలకత్తాలో అరెస్ట్ చేసి నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీ తీవ్ర ఇంటరాగేషన్‌కు గురి చేసింది. రామకృష్ణకు విపరీతమైన టార్చర్ వల్ల తీవ్ర రక్త స్రావమై, కలకత్తా జైల్లో బైపాస్‌సర్జరీ కూడ జరిగి అనారోగ్యంతో బాధపడుతున్నాడు.

విచారణ ఖైదీల విడుదలను అడ్డుకుంటున్న పోలీసులు (మళ్లా మళ్లా కొత్తకేసులు పెట్టడం ద్వారా, విడుదలయినా జైలుముందే అరెస్టుచేసి యుఎపిఎ, మాకోక (మహారాష్ట్ర) జనసురక్షాఖానూన్ (చత్తీస్‌గడ్) సిసిలో (ఝార్ఖండ్), వంటి ఫాసిస్టు చట్టాలు పెట్టి) మరొకవైపు ఫాస్ట్‌ట్రాక్ కోర్టులలో సత్వరంగా కొనసాగిస్తూ కఠినశిక్షలు వేయిస్తున్నారు. జైళ్లలో మగ్గుతున్న మావోయిస్టుపార్టీ నాయకత్వంలోని చాలామందికి గత ఐదారుసంవత్సరాలలో యావజ్జీవ కారాగారశిక్షలు విధించారు. జైళ్లలో యావజ్జీవశిక్ష అనుభవిస్తున్న విప్లవకారుల విడుదల విషయంలో సాధారణఖైదీలకు వర్తించే మినహాయింపు నియమాలేవీ వర్తించవు.

మావోయిస్టుపార్టీకి, మావోయిస్టు భావజాలానికి చెందినవాళ్లని, లేదా ఆ భావజాలాన్ని బలపరచే ప్రజాసంఘాల్లో పనిచేసేవారిని అరెస్టుచేయడం ఒక అంశమైతే, మావోయిస్టులను అరెస్టుచేయడానికి, వాళ్లపై విషప్రచారం చేయడానికి తాము డిమాండుచేసిన సహకారం ఇవ్వడం లేదని అరెస్టుచేసి చిత్రహింసలు పెట్టి మర్మాంగాల్లో రాళ్లు కూడ జొనిపి - సుప్రీంకోర్టు ఉత్తర్వులను కూడ ఖాతరు చేయకుండా జైల్లోపెట్టిన కేసు ఆదివాసీమహిళ సోనీసోరీది (చత్తీస్‌గడ్).

వీళ్లే కాకుండా విస్థాపన సమస్యపై పోరాడుతున్న వేలాది మందిని మహారాష్ట్ర (కోర్చి) దండకారణ్యం (చాద్‌గాం, రావుఘాట్, లోహండి గూడా, పల్లెమాడ్, బోధఘాట్ తదితర ప్రాంతాలు) ఉత్తరాంధ్ర (కాకరపల్లి, సోంపేట, గాలికొండ) ఒడిషా (నారాయణపట్నా, పోస్కో ఉద్యమం) జైళ్లలో పెట్టారు. భూపోరాటాల్లో దృఢంగా నిలిచి వందలాది ఎకరాల ఎస్టేట్ భూముల్ని స్వాధీనం చేసుకున్న మర్రిపాకల, కుంకుంపూడి, సర్రెపల్లి, బలపం, లంకపాకల, కోరాపుట్ లోని కోట్టబేద, దర్భిని రైతాంగం పెద్దెత్తున జైళ్లలో ఉన్నారు.

ఈ మధ్య ఖమ్మం జిల్లాలోని చర్ల, వెంకటాపురం తదితర మండలాల్లో వందల వేల సంఖ్యలో ఆదివాసులను అరెస్టుచేసి రోజులతరబడి పోలీసు కస్టడీలో చిత్రహింసలు పెట్టి ఖమ్మం, వరంగల్ జైళ్లకు పంపుతున్నారు. విడుదల కాగానే మళ్లీ జైలుముందే అరెస్టుచేసి కొత్తకేసులు పెడుతున్నారు. జామీను ఇచ్చినవాళ్లను, విడుదలయిన వాళ్లను తీసుకపోవడానికి వచ్చిన రక్తబంధువులను కూడ అరెస్టుచేసి వాళ్లపై కూడ కేసులు పెడుతున్నారు.

నిర్దిష్టమైన కేసులు, ఆరోపణలకు ఏ అవకాశం లేని సందర్భాల్లో దేశవ్యాప్తంగానే ఎక్కువగా యుఎపిఎ వంటి ఫాసిస్టు చట్టాన్ని ప్రయోగించి బయటికి రాకుండా చేస్తున్నారు. అన్ని రాష్ట్రాలలో జైళ్లలో విప్లవమహిళల సంఖ్య రోజురోజుకూ పెరుగుతోంది. వీరిలో పార్టీ, ప్రజాసంఘాల మహిళలు, పోరాటప్రాంతాల సాధారణ మహిళలు, ఎక్కువగా ఆదివాసీలు ఉన్నారు. జైళ్లలో మహిళల దుస్థితి అతిదుర్భరంగా ఉంది. కొంతమంది మహిళలు జైళ్లలోనే ప్రసవించి తల్లులైన వారుకూడ ఉన్నారు. వారిబిడ్డల పోషణ కడుహీనంగా సాగుతోంది. కొన్నిచోట్ల ఆలుమొగలు జైలుపాలైన వారు కూడా ఉన్నారు (నిర్మల, చంద్రశేఖరరెడ్డి-జగదల్పూర్ జైలు, బి.అనూరాధ, రవిశర్మ-హజారీబాగ్ జైలు, సునీత-దివాకర్ భూపాల్ జైలు). ఈ సందర్భంలో ఆదివాసీ జంటలకైతే జైలు మ్యానువల్స్, చట్టాలు తెలియకపోవడం వల్ల అనేక జంటలు కటకటాల నడుమే అయినా కనీసం ముఖం చూపులైనా లేకుండా వాపోతున్నారు. తల్లీ, పిల్లలు అరెస్టయి జైలుపాలైన చోట మానవసంవేదనా భరితమైన మానవ సంబంధాల పట్ల దుర్మార్గంగా వ్యవహరించే జైళ్లలో పిల్లలు ఒక

బ్యారక్‌లో, తల్లులు ఒక బ్యారక్‌లో ఉండి పడుతున్న ఆవేదన వర్ణనాతీతం. కొన్ని అవసరాల కోసం మహిళలకు ఉండాల్సిన ప్రైవసీ కూడ కరువైపోతున్న సందర్భాలున్నాయి. మహిళల పట్ల జైలువార్డర్లు పురుష అధికారులు అనుసరించే లైంగిక వేధింపులు, హింసతో వారెంతగానో కుమిలిపోతున్నారు. వరంగల్ మహిళా జైళ్ళో జైలు సూపరింటెండెంట్ చాలా అమానుష్యంగా ప్రవర్తిస్తున్నారు.

అయితే మహిళా ఖైదీలుగానీ మొత్తంగా రాజకీయఖైదీలు గానీ ఇంత అననుకూల పరిస్థితుల్లో నిర్బంధంలో అసహాయంగా లేరు. తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. జైళ్లనే కమ్యూన్‌లుగా, రాజకీయ పాఠశాలలుగా, పోరాట శిబిరాలుగా మలచుకొని పోరాడుతున్నారు. ఎన్నో హక్కులు సాధించుకుంటున్నారు. తమ పరిస్థితులనే కాదు సాధారణఖైదీల పరిస్థితులను కూడ మానవీయంగా మార్చడానికి సహకరిస్తున్నారు. ఏడుసంవత్సరాల జీవితకాలం పూర్తిచేసిన సత్ప్రవర్తన కలిగిన యావజ్జీవశిక్ష పడిన సాధారణ ఖైదీల విడుదల విషయంలో 94-95లలో నక్సలైటు ఖైదీలు అమరులు కామ్రేడ్ పటేల్ సుధాకర్, శాకమూరి అప్పారావుల నాయకత్వంలో చేసిన చరిత్రాత్మక పోరాటాన్ని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవాలి. భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను ఉరితీసిన మార్చ్23, దేశమే ఒక జైలుగా మారిన ఎమర్జెన్సీ విధించిన జూన్ 26, జతీన్‌దాస్ జైలుపోరాటంలో అమరుడైన సెప్టెంబర్ 13, అంతర్జాతీయ మానవహక్కుల దినమైన డిసెంబర్ 10 దేశమంతా అన్నిజైళ్లలో రాజకీయఖైదీలు, వాళ్ల ప్రోత్సాహంతో సాధారణ ఖైదీలు కూడ వేలసంఖ్యలో పోరాటదినాలుగా నిర్వహిస్తున్నారు.

దోపిడీ రాజ్యాంగయంత్రంలో జైళ్లు పెద్ద అణచివేతకేంద్రాలుగా పనిచేస్తాయనడానికి వర్తమాన దోపిడీవ్యవస్థలోని జైళ్లన్నీ నిదర్శనాలే. ఉద్యమప్రాంతాలలో ప్రధానంగా సల్వాజుడుం సాగిన ప్రాంతాల్లో కార్పెట్ సెక్యూరిటీ అమలులోకి వచ్చి అడవి ఒక పెద్దజైలుగా మారి గ్రామాలన్నీ బహిరంగ బందిఖానాలయ్యాయి. జుడుం కాలంలో ఏర్పడిన బేస్‌క్యాంపులన్నీ కాన్‌సెంట్రేషన్ (అణచివేత) కేంద్రాలుగానే ముందుకొచ్చాయి. గ్రీన్‌హంట్‌దాడుల్లో భాగంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేపడుతున్న చర్యలన్నీ ఈ దిశలోనే తీవ్రమవుతున్నాయి.

ప్రత్యేక తెలంగాణ ప్రజాస్వామిక ఉద్యమంపై అణచివేత, శ్రీకృష్ణకమిషన్ ఎనిమిదవ అధ్యాయం రహస్య అజెండా అమలు, తెలంగాణవాదులపై ముఖ్యంగా వేలాదిమంది విద్యార్థులపై కేసులు, క్యాంపస్‌లను పోలీసు శిబిరాలుగా మార్చడం, న్యాయవాదులను కూడ మినహాయించకుండా కేసుల్లో ఇరికించడం – ఈ గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగంగా చూడవలసిన తీవ్రనిర్బంధమే.

ఇలాంటి పరిస్థితుల్లో గ్రామాలపై పోలీసుదాడుల్ని ముమ్మరంచేసి పెద్దెత్తున అరెస్టులు, మిస్సింగ్‌లు, బూటకపు ఎన్‌కౌంటర్లు కొనసాగిస్తున్నారు. (బీజాపూర్ అడవుల్లో ఫిబ్రవరి24న జరిగిన 'ఎన్‌కౌంటర్'లో ఆదిలాబాదు జిల్లాకు చెందిన సాంబశివరెడ్డి, మరో ఆదివాసీ కామ్రేడ్ అమరులైన ఉదంతం మార్చ్ 9న మరో ఆదివాసీ మహిళ ఎన్‌కౌంటర్, వసంతతోపాటు మరికొంత మందిని అక్రమంగా నిర్బంధించి అరెస్ట్ చూపించకపోవడం తాజా ఉదాహరణ).

పోలీసులు చేస్తున్న అరెస్టులను ఎక్కడికక్కడే ప్రతిఘటిస్తూ, ప్రజలను పోలీసులు అరెస్టుచేస్తే వాళ్ల విడుదల కోసం ప్రచారం, ఆందోళనలను చేపట్టడంతో పాటు అన్నిరూపాల్లో నిరంతర ప్రతిఘటన ఉండాలి.

వివిధ జైళ్లలో బందీలుగా ఉన్నవారి కుటుంబాలను అన్నివిధాల ఆదుకోవాలి. వారి సమస్యలను, పోరాటాలను సమర్ధిస్తూ తగిన వేదికల ద్వారా ప్రచార, ఆందోళనలు కూడ చేపట్టాలి. బయట మనం చేపట్టే ప్రతిచర్యా జైళ్లలో రాజకీయంగా దృఢంగా నిలిచి పోరాడుతున్నవారికి మరింత చైతన్యం, పట్టుదల పెరిగేలా చేయాలి. రాజకీయఖైదీల, అర్హులైన జీవిత ఖైదీల, వృద్ధుల, మహిళల, మైనార్టీల, దళిత ఆదివాసీ ఖైదీల, అనారోగ్యంతో మగ్గుతున్న ఖైదీల విడుదల కోసం తీవ్రంగా చేసే కృషిగా సాగాలి.

ఈ మహత్తరమైన రాజకీయ, మానవీయకర్తవ్యం ఒక్క రాజకీయ ఖైదీల విడుదల కమిటీ మాత్రమే చేపట్టి నిర్వహించజాలదు. ఇందుకు అశేష ప్రజానీకం, విశాల ఐక్య ప్రజాస్వామిక సంఘటిత ఉద్యమ సహకార, సంఘీభావాలు హృదయ పూర్వకంగా ఆశిస్తున్నాం.

**(కమిటి ఫర్ ది రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజనర్స్ (సిఆర్‌పిపి), ఆంధ్రప్రదేశ్ చాప్టర్)**



# -: స్వీకారం :-

వేమన
(వేమనపై విమర్శ వ్యాసాలు)
ప్రచురణ :
సి.పి.బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రం
యోగి వేమన విశ్వవిద్యాలయం
వెల : రు. 160/-
పేజీలు : 254

నదీ బాల్యమూ
రివేరా కవిత్వం
వెల : రు. 30/-
పేజీలు : 55

కవితా ఝంకార్
(గ్రీన్‌హంట్ వ్యతిరేక కవితా సంకలనం
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 75/-
పేజీలు : 224

పోరాడితేనే రాజ్యం
తెలంగాణ మహిళా ఉద్యమ గాథలు
రచయిత :
కవిని
ప్రచురణ :
ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక
వెల : రు. 30/-
పేజీలు : 54

మార్క్సిస్టు సాహిత్య విమర్శ
సిద్ధాంత రాజకీయ సమస్యలు
రచయిత :
డాక్టర్ శ్రీనివాస్
ప్రచురణ :
వందన ప్రచురణలు
వెల : రు. 100/-
పేజీలు : 199

అస్తిత్వాలు ఆధునికత మార్క్సిజం
పాణి
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 75/-
పేజీలు : 175

విరసం సాహిత్య విమర్శ
2004 - 12
సంపాదకులు :
పాణి, వి. చెంచయ్య
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 150/-
పేజీలు : 476

అబూజ్‌మాడ్
రచయిత :
పాణి
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 50/-
పేజీలు : 104

**Understanding Maoists**
**N. Venugopal**
**Setu Prakashani**
Rs. 375/-
Pages : 319

కథల పంట 2
కథలు
విరసం వర్క్‌షాప్‌ల కథలు
(2009 - 2012)
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 60/-
పేజీలు : 231

యహ్ క్యా జగా హై దోస్తో
పరాధీనత - స్వావలంబన
రచయిత :
వరవరరావు
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 100/-
పేజీలు : 199

కూడంకుళం నిజనిర్ధారణ
సముద్రంతో సంభాషణ
రచయిత :
పి. వరలక్ష్మి
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 20/-
పేజీలు : 48

కొత్త కోణం
రచయిత :
ఎనిశెట్టి శంకర్
ప్రచురణ :
స్నేహ ప్రచురణలు
వెల : రు. 80/-
పేజీలు : 152

నీటి చుక్క
రచయిత :
ఈతకోట సుబ్బారావు
ప్రచురణ :
పాలపిట్ట బుక్స్
వెల : రు. 50/-
పేజీలు : 46

మా అమ్మా బాపూ రాజారం
రచయితలు :
హేమలత, వసంత, రాంగోపాల్, అరుణ, వేణుగోపాల్, రజని
పేజీలు : 120

**ARUNATARA** ...ugu Monthly | Journal of Revolutionary Writers' Association (VIRASAM)
● RNI Regn.No.21152/72 ● Published on 25/03/2013 296 - Jan - Feb, 2013














ఓ గొంతు తెగిపడింది..
కశ్మీరియత్ లేచినిలబడింది..
మంచుకొండల్లో
రుధిరనేత్ర జ్వలనంతో
పోరాట పరవళ్ళలో...





Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002.
Editor : Chalasani Prasad



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M162 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Bhanusree |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |